అన్నాదికమ్(క్షత్తృభ్యః)శూద్రాత్ క్షత్రియాయాం జాతేభ్యః(సంగ్రహీతృభ్యః)యే యుద్ధార్థానుప గిరః సమ్యగ్ గృహ్ణన్తి తేభ్యః(చ)(వః)(నమః)సత్కరణమ్(నమః) సుసంస్కృత మన్నాదికమ్ (మహద్భ్యః)మహాశయేభ్యో విద్యావయోభ్యాం వృద్ధేభ్యః పూజ్యేభ్యః (అర్భకేభ్యః)కనిష్ఠేభ్యః క్షుద్రాశయేభ్యః శిక్షణీయేభ్యో విద్యార్థిభ్యః(చ)(వః)(నమః) సత్కరణమ్. ॥౨౬॥ అన్వయః :– హే రాజప్రజాజనా ! యథా వయం సేనాభ్యో నమో వః సేనానిభ్యో నమశ్చ రథిభ్యో నమో వోఽరథేభ్యో నమశ్చ క్షత్తృభ్యో నమో వః సంగ్రహీతృభ్యో నమశ్చ మహద్భ్యో నమో వో ఽర్భకేభ్యో నమశ్చ సతతం కుర్మో దద్మశ్చ తథైవ యూయమపి పూజేభ్యః కురుత దత్త చ. భావార్థః:– రాజపురుషైః సర్వాన్ భృత్యాన్ సత్కృత్య సుశిక్ష్యాన్నాదినా వర్ధయిత్వా ధర్మేణ రాజ్యం పాలనీయమ్.

పదార్థము :–ఏ రాజా ! ప్రజలారా ! మే మెటుల, సేనాభ్యః నమః = శత్రువులను బంధించు సైనికులను సత్కరించెదమో, చ వః సేనానిభ్యః నమః = మఱియు సేనానాయకులకు ప్రధాన పురుషులకు అన్నమిచ్చెదమో, రథిభ్యః నమః = శ్రేష్ఠరథములు గలవారిని సత్కరించెదమో, చ వః అరథేభ్యః నమః = మఱియు రథములు లేకుండ కాలితో నడచు మిమ్ము సత్కరించెదమో, క్షత్తృభ్యః నమః = క్షత్రియ స్త్రీకి శూద్రునివలన జన్మించిన వర్ణసంకరునికి అన్నాది పదార్థముల నిచ్చెదమో, చ వః సంగ్రహీతృభ్యః = మఱియు చక్కగ యుద్ధసామగ్రిని సమకూర్చు మిమ్ము సత్కరించెదమో, మహద్భ్యః నమః = విద్యచేతను వయస్సుచేతను వృద్ధులు పూజనీయులు నగు మహాశయులకు సుపక్వమైన యన్నాది పదార్థముల నిచ్చెదమో, చ వః అర్భకేభ్యః నమః = క్షుద్రాశయులు, శిక్షణపొందుటకు యోగ్యులునగు విద్యార్థులను నిరంతరము సత్కరించెదమో అటులనే మీరును అన్నమొసగుడు, సత్కరించుడు. ॥౨౬॥

భావార్థము :–సమస్త భృత్యులను సత్కరించి, సుశిక్షగఱపి, అన్నాది పదార్థములతో నున్నతి పఱచి రాజపురుషులు ధర్మముతో రాజ్యమును పాలించవలయును. ॥౨౬॥ (౮౧౦)

---

౮౧౧ నమస్తక్షభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతాః, నిచృచ్ఛక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

విద్వద్భిః కే సత్కర్త్తవ్యా ఇత్యాహ. విద్వాంసు లెవరిని సత్కరించవలయును ?

నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమో నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమో నమో నిషాదేభ్యః పుఞ్జిష్ఠేభ్యశ్చ వో నమో నమః శ్వనిభ్యో మృగయుభ్యశ్చ వో నమః ॥ ॥౨౭॥

నమ, తక్షభ్య ఇతి తక్ష+భ్యః, రథకారేభ్య ఇతి రథ + కారేభ్యః, చ వః, నమః, నమః, కులాలేభ్యః, కర్మారేభ్యః, చ, వః, నమః, నమః, నిషాదేభ్యః, నిషాదేభ్య ఇతి ని+సాదేభ్యః, పుఞ్జిష్ఠేభ్యః, చ, వః, నమః, నమః, శ్వనిభ్య ఇతి శ్వనిభ్యః, మృగయుభ్య ఇతి మృగయు+భ్యః, చ, వః, నమః. (27)

పదార్థః :–(నమః)అన్నమ్(తక్షభ్యః)యే తక్ష్ణువన్తి తనూకుర్వన్తి తేభ్యః(రథకారేభ్యః)యే రథాన్ విమానాది యాన సమూహాన్ కుర్వన్తి తేభ్యః శిల్పిభ్యః (చ) (వః) (నమః) వేతనాదిదానేన సత్కరణమ్(నమః)అన్నాదికమ్(కులాలేభ్యః)మృత్స్నా పాత్రాదిరచకేభ్యః (కర్మారేభ్యః)అసి భుశు

ణ్టేశతఘ్న్యాదీని నిర్మాతృభ్యః(చ)(వః) (నమః) సత్కరణమ్ (నమః) అన్నాదిదానమ్ (నిషాదేభ్యః) యే వనపర్వతాదిషు తిష్ఠన్తి తేభ్యః(పుఞ్జిష్ఠేభ్యః)యే పుఞ్జేషు వర్ణేషు భాషాసు వా తిష్ఠన్తి తేభ్యః(చ) (వః)(నమః)సత్కరణమ్(నమః)అన్నాదిదానమ్(శ్వనిభ్యః) యే శునో నయన్తి శిక్షయన్తి తేభ్యః (మృగయుభ్యః)య ఆత్మనో మృగాన్ కామయన్తే తేభ్యః(చ)(వః)(నమః)సత్కరణమ్. అన్వయః హే మనుష్యా ! యథా వయం రాజాదయో వస్తక్షభ్యో నమో రథకారేభ్యో నమశ్చ వః కులాలేభ్యో నమః కర్మారేభ్యో నమశ్చ వో నిషాదేభ్యో నమః పుఞ్జిష్ఠేభ్యో నమశ్చ వః శ్వనిభ్యో నమో మృగయుభ్యో నమశ్చ దద్యామ కుర్యామ చ తథా యూయ మపి దత్త కురుత చ. ॥౨౭॥ భావార్థః :- విద్వాంసో యే పదార్థ విద్యయాఽపూర్వాణి శిల్పకృత్యాని సాధ్నుయుస్తాన్ పారితోషిక దానేన సత్కుర్యుః.యే శ్వాదిపశుభ్యోఽన్నాది దానేన పరిపాల్య సుశిక్ష్యైవ యోజయేయుస్తాన్ సుఖాని ప్రాపయేయుః

పదార్థము :—మానవులారా ! రాజాదులమగు మే మెటుల. తక్షభ్యః నమః = లలితకళలచే పదార్థములను తయారుచేయు మి కన్న మొసగుచున్నామో, చ రథకారేభ్యః వః నమః = మఱియు అనేక విమానాదులను నిర్మించు మీకు పరిశ్రమాదుల[కు ప్రతిఫలముగ]ధనమిచ్చి సత్కరించుదుమో, కులాలేభ్యః నమః = శ్రేష్ఠమృణ్మయ పాత్రలను తయారు జేయువారి కన్నాది పదార్థముల నొసగెదమో, చ కర్మారేభ్యః వః నమః = మఱియు ఖడ్గములను, తుపాకులను, ఫిరంగులను, శస్త్రములను నిర్మించు మిమ్ము సత్కరించు చున్నామో, నిషాదేభ్యః నమః = వన పర్వతాదులందుండు దుష్టజీవులను దండించు మీకు నన్నాదుల నొసగెదమో, చ పుంజిష్ఠేభ్యః వః నమః = మఱియు శ్వేతాది వర్ణము లందు, భాషలందు ప్రవీణులగు మిమ్ము సత్కరించెదమో, శ్వనిభ్యః నమః = కుక్కలకు శిక్షగఱపు మీకు అన్నాదుల నొసగెదమో, చ మృగయుభ్యః నమః = మఱియు స్వీయాత్మతో వన్యహరిణాది మృగములను అభికాంక్షించు మిమ్ముల సత్కరించెదమో అటులనే మీరును సత్కరించుడు. ॥౨౭॥

భావార్థము :—పదార్థ విద్యనెఱిగి అపూర్వ శిల్పకార్యములను శిల్పయుక్త పదార్థములను సాధించువారికి విద్వాంసులు పారితోషికముల నిచ్చి సత్కరించి ప్రసన్నులగ నొనర్చవలయును. కుక్క మొదలైన జంతువులను అన్నాదులచే రక్షించి చక్కని శిక్షగఱపి ఉపయోగములోనికి తీసుకవచ్చు వారికి సుఖము చేకూర్చవలయును. ॥౨౭॥ (౮౧౧)

---

౮౧౨ నమః శ్వభ్య ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, ఆర్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

మనుష్యైః కేభ్యః కథ ముపకారో గ్రాహ్య ఇత్యాహ.

మానవులు దేనినుండి ఎటువంటి ఉపకారమును గ్రహించవలయును ?

నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చ వో నమో నమో భవాయ చ రుద్రాయ చ నమః శర్వాయ చ పశుపతయే చ నమో నీలగ్రీవాయ చ శితికణ్ఠాయ చ. ॥౨౮॥

నమః, శ్వభ్య ఇతి శ్వ+భ్యః, శ్వపతిభ్య ఇతి శ్వపతి+భ్యః, చ, వః,నమః, నమః, భవాయ, చ, రుద్రాయ, చ, నమః, శర్వాయ, చ, పశుపతయ ఇతి పశు+పతయే, చ, నమః, నీలగ్రీవాయేతి నీల+గ్రీవాయ, చ, శితికణ్ఠాయేతి శితి+కణ్ఠాయ, చ.

పదార్థః :—(నమః)అన్నమ్(శ్వభ్యః)కుక్కురేభ్యః(శ్వపతిభ్యః)శునాం పాలకేభ్యః(చ)(వః)

(నమః)అన్నం సత్కరణం చ (నమః)సత్కరణమ్(భవాయ) యః శుభగుణాదిషు భవతి తస్మై (చ) (రుద్రాయ) దుష్టానాం రోదకాయ(చ)(నమః) అన్నాదికమ్ (శర్వాయ) దుష్టానాం హింసకాయ (చ) (పశుపతయే)గవాది పశుపాలకాయ(చ) (నమః) అన్నమ్ (నీలగ్రీవాయ) నీలః శోభనో వర్ణో గ్రీవాయాం యస్య తస్మై(చ)(శితికణ్ఠాయ)శితి స్తీక్ష్ణీభూతః కృష్ణో వా కణ్ఠో యస్య తస్మై (చ). ॥౨౮॥

అన్వయః :—హే మనుష్యాః యథా వయం పరీక్షకాః శ్వభ్యో నమో వః శ్వపతిభ్యో నమశ్చ భవాయ నమశ్చ రుద్రాయ నమశ్చ శర్వాయ నమశ్చ పశుపత యే నమశ్చ నీలగ్రీవాయ నమశ్చ శితికణ్ఠాయ నమశ్చ దద్యామ కుర్యామ తథా యూయ మపి దత్త కురుత చ. ॥౨౮॥ భావార్థః :—మనుష్యైః శ్వాది పశూనన్నాది దానేన వర్ధయిత్వా తైరుపకారో గ్రాహ్యః.పశుపాలకాదీనాం సత్కారశ్చ కార్యః.

పదార్థము :—మానవులారా ! మేము పరీక్షకుల మెటుల, శ్వభ్యః నమః = కుక్కల కాహార మిచ్చెదమో, చ వః శ్వపతిభ్యః నమః = మఱియు కుక్కలను పెంచు మీ కన్నమిచ్చెదమో. మిమ్ము సత్కరించెదమో; చ భవాయ నమః = మఱియు శుభగుణములతో ప్రసిద్ధుడైన వానిని సత్కరించెదమో, చ రుద్రాయ(నమః) = దుష్టుల నేడిపించు వీరులను సత్కరించెదమో. చ శర్వాయ నమః = దుష్టులను సంహరించువారికి అన్నాదుల నొసగెదమో. చ పశుపతయే[నమః] = పశుపాలకుల కన్న మొసగెదమో, చ నీలగ్రీవాయ = చక్కని రంగుగల కంఠము గలవానికి, చ శితికంఠాయ = తీక్ష్ణ కంఠము లేక నల్లని కంఠము గలవానికి, నమః = అన్నమిచ్చెదమో, సత్కరించెదమో, అటులనే మీరును అన్నాదు లొసగి సత్కరించుడు. ॥౨౮॥

భావార్థము :—మానవులు కుక్కలు మొదలైన పశువుల కాహార మిడి పెంచి వాని నుండి యుపకారమును పొందవలయును. మఱియు పశురక్షకులను సత్కరించవలయును. ॥౨౮॥ (౮౧౨)

---

౮౧౩ నమః కపర్దినే చేత్యస్య ఋషిః, రుద్రో దేవతా, భురిగతి జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

గృహస్థైః కే సత్కర్తవ్యాః ఇత్యుచ్యతే. గృహస్థు లెవరిని సత్కరించవలయును ?

నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమః సహస్రాక్షాయ చ శతధన్వనే చ నమో గిరిశయాయ చ శిపివిష్టాయ చ నమో మీఢుష్టమాయ చేషుమతే చ ॥౨౯॥

నమః, కపర్దినే, చ, వ్యుప్తకేశాయేతి వ్యుప్త+కేశాయ, చ, నమః, సహస్రాక్షాయేతి సహస్ర+అక్షాయ, చ, శతధన్వన ఇతి శత+ధన్వనే, చ, నమః,గిరిశయాయేతి గిరి+శయాయ, చ, శిపివిష్టాయేతి శిపి+విష్టాయ, చ, నమః, మీఢుష్టమాయ, మీఢుస్తమాయేతి మీఢుః+తమాయ, చ, ఇషుమత+ఇతీషు+మతే, చ.

పదార్థః :—(నమః)అన్నమ్(కపర్దినే)జటిలాయ బ్రహ్మచారిణే (చ)(వ్యుప్తకేశాయ)విశేషతయోప్తాశ్ఛేదితాః కేశా యేన తస్మై సంన్యాసినే (చ) సంన్యాస మిచ్ఛవే వా (నమః) సత్కరణమ్ (సహస్రాక్షాయ)సహస్రేష్వ సంఖ్యాతేషు శాస్త్ర విషయా దిష్వక్షిణీ యస్య తస్మై విదుషే బ్రాహ్మణాయ (శతధన్వనే) ధనుర్విద్యా ద్యసంఖ్య శస్త్ర విద్యాశిక్షకాయ (చ)(నమః)సత్కరణమ్(గిరిశయాయ) యో గిరిషు పర్వతేషు శ్రితః సన్ శేతే తస్మై వాన ప్రస్థాయ(చ) (శిపివిష్టాయ) శిపిషు పశుషు

పాలకత్వేన విష్టాయ ప్రవిష్టాయ వైశ్యప్రభృతయే(చ)శూద్రాయ (నమః) సత్కరణమ్ (మీఢుష్టమా య)అతిశయేన వృక్షోద్యాన క్షేత్రాది సేచకాయ కృషీవలాద్యాయ (చ) (ఇషుమతే) ప్రశస్తా ఇషవో బాణా విద్యన్తే యస్య తస్మై వీరాయ (చ) భృత్యవర్గాయ ॥౨౯॥ అన్వయః :—గృహస్థా మనుష్యాః సమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమః సహస్రాక్షాయ చ శతధన్వనే చ నమో గిరిశ యాయ చ శిపివిష్టాయ చ నమో మీఢుష్టమాయ చేషుమతే చ కుర్యుః ప్రదద్యుశ్చ. భావార్థః :— గృహస్థై ర్బ్రహ్మచారి ప్రభృతీన్ సత్కృత్య విద్యాదానం కర్తవ్యం కారయితవ్యం చ తథా సంన్యా స్యాదీన్ సంపూజ్య విశిష్ట విజ్ఞానం గ్రాహ్యమ్. ॥౨౯॥

పదార్థము :—గృహస్థులు, కపర్దినే = జటాధారియగు బ్రహ్మచారికి, చ వ్యుప్తకేశాయ = స కలకేశములను తీసివేసిన సంన్యాసికి, చ = సంన్యాస మభిలషించు వానికి, నమః = అన్నమివ్వ వల యును. చ సహస్రాక్షాయ = అసంఖ్యములగు శాస్త్ర విషయములను వీక్షించు బ్రాహ్మణుని, చ శత ధన్వనే = ధనురాద్యసంఖ్య శస్త్రవిద్యల శిక్షగలవు క్షత్రియుని, నమః = సత్కరించవలయును. గిరి శయాయ = పర్వతముల యాశ్రయమున శయనించు వానప్రస్థుని, చ శిపివిష్టాయ = పశుపాలకులగు వైశ్యాదులను, చ = శూద్రుని, నమః = సత్కరించవలయును. మీఢుష్టమాయ = వృక్షములను, ఉద్యా నములను, సస్యక్షేత్రములను బాగుగ సించన మొనర్చు కృషీవలులను, చ = తోటమాలి మొదలైన వారిని,ఇషుమతే చ = ప్రశంసితశరముల ధరించిన వీరపురుషుని,నమః = సత్కరించవలయును,వీరికి అన్నాదుల నివ్వవలయును. ॥౨౯॥ (౮౧౩)

---

౮౧౪ నమో హ్రస్వాయే త్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, విరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పున స్తదేవాహ. మరల నా విషయమే.

నమో హ్రస్వాయ చ వామనాయ చ నమో బృహతే చ వర్షీయసే చ నమో వృద్ధాయ చ సవృధే చ నమోఽగ్ర్యాయ చ ప్రథమాయ చ ॥ ॥౩౦॥

నమః, హ్రస్వాయ, చ, వామనాయ, చ, నమః, బృహతే, చ, వర్షీయసే,చ,నమః, వృద్ధాయ, చ, సవృధ ఇతి స+వృధే, చ, నమః, అగ్ర్యాయ, చ, ప్రథమాయ, చ.

పదార్థః :—(నమః) అన్నమ్ (హ్రస్వాయ) బాలకాయ (చ) (వామనాయ) వామం ప్రశస్తం విజ్ఞానం విద్యతే యస్య తస్మై. వామ ఇతి ప్రశస్తనా . . . నిఘం.౩.౮. అత్ర పామాదిత్వాన్నః అ. ౫.౨.౧౦౦(చ)(నమః) సత్కరణమ్(బృహతే) మహతే (చ) (వర్షీయసే) అతిశయేన విద్యావృద్ధాయ (చ) (నమః) సత్కరణమ్ (వృద్ధాయ) వయోఽధికాయ (చ) (సవృధే) యః సమానైః సహ వర్ధతే తస్మై (చ) సర్వమిత్రాయ (నమః) సత్కరణమ్(అగ్ర్యాయ)అగ్రే భవాయ సత్కర్మసు పురః సరా యే (చ) (ప్రథమాయ) ప్రఖ్యాతాయ(చ). ॥౩౦॥ అన్వయః :—యే గృహస్థా మనుష్యా హ్రస్వాయ చ వామనాయ చ నమో బృహతే చ వర్షీయసే చ నమో వృద్ధాయ చ సవృధే చ నమోఽ గ్ర్యాయ చ ప్రథమాయ నమశ్చ దదతి కుర్వన్తి చ తే సుఖినో భవన్తి. ॥౩౦॥ భావార్థః :—గృహ స్థై ర్మనుష్యై రన్నాదినా బాలకాదీన్ సత్కృత్య సద్వ్యవహార ఉన్నేయః. ॥౩౦॥

పదార్థము :—ఏ గృహస్థులు, హ్రస్వాయ = బాలకునకు, చ వామనాయ = ప్రశంసిత జ్ఞానవం తునకు, చ = మధ్యమ విద్వాంసునకు, నమః = అన్న మొసగు చున్నారో, బృహతే = పెద్దలను, చ

వర్షీయసే = విద్యయందధిక వృద్ధులను, చ = విద్యార్థులను, నమః = సత్కరించుచుదురో, వృద్ధాయ = వయసు నందధికుని, చ సవృధే = సమవయస్కుని, చ = సర్వమిత్రుని, నమః = సత్కరించెదరో, చ అగ్ర్యాయ = సత్కర్మ లొనరించుటలో సర్వప్రథముడుగ నుండువానిని. చ ప్రథమాయ = ప్రసిద్ధ పురుషుని, నమః = సత్కరించెదరో; వారు సుఖవంతులు కాగలరు. ॥౩౦॥

భావార్థము :— గృహస్థులు అన్నాది పదార్థములచే బాలకాదులను సత్కరించి శ్రేష్ఠవ్యవహారములను ఉన్నతి పఱచవలయును. ॥౩౦॥ (౫౪౧)

---

౫౪౨ నమ ఆశవ ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ పంక్తి శ్ఛందః, పఞ్చమః స్వరః.

అథోద్యోగః కథం కార్య ఇత్యుపదిశ్యతే. ఉద్యోగ మెటులొనర్చ వలయును :

నమ ఆశవే చాజిరాయ చ నమః శీఘ్ర్యాయ చ శీభ్యాయ చ నమ ఊర్మ్యాయ చావస్వన్యాయ చ నమో నాదేయాయ చ దీప్యాయ చ ॥ ॥౩౧॥

నమః, ఆశవే, చ, అజిరాయ, చ, నమః, శీఘ్ర్యాయ, చ, శీభ్యాయ, చ, నమః, ఊర్మ్యాయ, చ, అవస్వన్యాయేత్యవ+స్వన్యాయ, చ, నమః నాదేయాయ, చ, ద్వీప్యాయ, చ. (31)

పదార్థః:—(నమః)అన్నాదికమ్(ఆశవే)వాయురివాధ్వానం వ్యాప్తాయాశ్వాయ(చ)(అజిరాయ) అశ్వవారం ప్రక్షేప్త్రే (చ) (నమః) అన్నమ్ (శీఘ్ర్యాయ) శీఘ్రగతౌ సాధవే (చ) (శీభ్యాయ) శీభేషు క్షిప్రకారిషు భవాయ. శీభ మితి క్షిప్ర నా . . . నిఘం. ౨.౧౫(చ)(నమః)అన్నమ్(ఊర్మ్యాయ)ఊర్మిషు జలతరఙ్గేషు భవాయ వాయు రివ వర్తమానాయ(చ)(అవస్వన్యాయ)అర్వాచీనేషు స్వనేషు భవాయ (చ) (నమః) అన్నమ్ (నాదేయాయ) నద్యాం భవాయ(చ)(ద్వీప్యాయ) ద్వీపేషు ద్విర్గత జలేషు దేశేషు భవాయ(చ). ॥౩౧॥ అన్వయః :—హే మనుష్యాః యది యూయ మాశవే చాజిరాయ చ నమః శీఘ్ర్యాయ శీభ్యాయ చ నమ ఊర్మ్యాయ చావస్వన్యాయ చ నమో నాదేయాయ చ ద్వీప్యాయ చ నమో దత్త తర్హి భవన్తోఽఖిలానందాన్ ప్రాప్నుత. ॥౩౧॥ భావార్థః :—యే క్రియా కౌశలేన రచితై ర్విమానాదియానై రశ్వాదిభిశ్చ శీఘ్రం గతిమన్తః సన్తి తే కం కం ద్వీపం దేశం వాఽగత్వా రాజ్యాయ ధనం చ నాప్నువన్తి ? కిన్తు సర్వత్ర గత్వా సర్వమాప్నువన్తి. ॥౩౧॥

పదార్థము :—మనుష్యులారా ! మీరు, ఆశవే = వాయువువలె మార్గమున పరుగిడునది, చ అజిరాయ = సవారులను విసరి పడవేయునదియు నగు అశ్వమునకు, చ = గజాదులకు, నమః = అన్నమిచ్చుచో, శీఘ్ర్యాయ = శీఘ్రగమన శీలునకు, శీభ్యాయ = శీఘ్రగాములలో ప్రసిద్ధునకు, చ = మధ్యస్థపురుషునకు, నమః = అన్న మొసగుచో, ఊర్మ్యాయ = జలతరంగములలో కలుగు వాయువువలె నుండువానికి, చ అవస్వన్యాయ = అత్యుత్త [మాధునిక]శబ్దములలో ప్రసిద్ధుడైనవానికి, చ = దూరమునుండి వినువానికి, నమః = అన్న మొసగుచో, నాదేయాయ = నదిలో నివసించు వానికి, చ ద్వీప్యాయ = జలస్థద్వీపమునందుండు వానికి. చ = అతని సంబంధీకులకు, చ = అన్న మొసగుచు నుండుచో, మీకు సంపూర్ణానందము లభించగల. ॥౩౧॥

భావార్థము:—ఎవరు క్రియాకౌశలముచే నిర్మింపబడిన విమానాది యానములద్వారా, అశ్వము లద్వారా శీఘ్రగాములగుచున్నారో, వారు ఏయే ద్వీపములకు వెళ్లకయు, రాజ్యమునకై ధనసంచయమొ నర్చకయు సుందరుః కింతు వారన్నిస్థలములకు వెళ్లి సమస్తమును పొందగలుగుదురు. ॥౩౧॥

---

౮౧౬. నమో జ్యేష్ఠాయేత్యస్య పత్స ఋషిః, రుద్రో దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యాః పరస్పరం కథం సత్కృతా భవేయు రిత్యాహ.

మానవులు పరస్పరమెటుల సత్కరించు కొనవలెను ?

నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వజాయ చాపరజాయ చ నమో మధ్యమాయ చాపగల్భాయ చ నమో జఘన్యాయ చ బుధ్న్యాయ చ ॥

నమః, జ్యేష్ఠాయ, చ, కనిష్ఠాయ, చ, నమః, పూర్వజాయేతి పూర్వ+జాయ, చ, అపరజాయేత్యపర+జాయ, చ, నమః, మధ్యమాయ, చ, అపగల్భాయే త్యప+గల్భాయ, చ, నమః, జఘన్యాయ, చ, బుధ్న్యాయ, చ. [32]

పదార్థః :—(నమః)సత్కరణ మన్నం వా (జ్యేష్ఠాయ)అతిశయేన వృద్ధాయ(చ) (కనిష్ఠాయ) అతిశయేన బాలకాయ (చ) (నమః) సత్కరణ మన్నం వా (పూర్వజాయ) పూర్వజాతాయ జ్యేష్ఠాయ భ్రాత్రే బ్రాహ్మణాయ వా (చ) (అపరజాయ) అపరం జాతాయ జ్యేష్ఠానుజాయాన్త్యజాయ వా (చ) (నమః)సత్కారాదికమ్(మధ్యమాయ)మధ్యే భవాయ బన్ధవే క్షత్రియాయ వైశ్యాయ వా (చ) (అపగల్భాయ)అపగతం దూరీకృతం గల్భం ధార్ష్ట్యం యేన తస్మై(చ)(నమః) సత్కరణమ్(జఘన్యాయ) జఘనే నీచకర్మణి భవాయ శూద్రాయ మ్లేచ్ఛాయ వా (చ)(బుధ్న్యాయ) బుధ్నే జలబన్ధనే ఽన్తరిక్షే భవాయ మేఘాయేవ వర్తమానాయ దాత్రే(చ). ॥౩౨॥ అన్వయః :—హే మనుష్యా ! యూయం జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః పూర్వజాయ చాపరజాయ చ నమో మధ్యమాయ చాపగల్భాయ చ నమో జఘన్యాయ చ బుధ్న్యాయ చ నమో దత్త. ॥౩౨॥ భావార్థః :—సత్కారే కర్తవ్యే నమస్తే ఇతి వాక్యోచ్చారణేన కనిష్ఠై ర్జ్యేష్ఠా జ్యేష్ఠైః కనిష్ఠా నీచై రుత్తమా ఉత్తమై ర్నీచాః క్షత్రియాద్యై ర్బ్రాహ్మణా బ్రాహ్మణాద్యైః క్షత్రియాద్యాశ్చ సతతం సత్కర్తవ్యాః. ఏతేనైవ వేదోక్త ప్రమాణేన శిష్టాచారే సర్వత్ర సర్వై రేతద్వాక్యం సమ్ప్రయోజ్యా ఽన్యోన్యేషాం సత్కరణాత్ప్రసన్నై ర్భవితవ్యమ్. ॥౩౨॥

పదార్థః :—మానవులారా ! మీరు, జ్యేష్ఠాయ = అత్యంత వృద్ధులకు, కనిష్ఠాయ = అతి బాలకులకు, నమః = అన్నమొసగుడు, వారిని సత్కరించుడు. చ పూర్వజాయ = జ్యేష్ఠసోదరునికి లేక బ్రాహ్మణునకు, చ అపరజాయ చ = తమ్మునకు లేక నీచునకు,నమః = అన్నమిండు, వారిని సత్కరించుడు మధ్యమాయ = బంధువునకు, క్షత్రియునకు లేక వైశ్యునకు, చ అపగల్భాయ = మొండితనమును వదలిన సరళస్వభావునకు, చ నమః = వీరందఱికి సత్కారాదుల నొసగుడు. జఘన్యాయ = నీచకర్మల నొనర్చు శూద్రునికి లేక మ్లేచ్ఛునకు, చ బుధ్న్యాయ = అంతరిక్షములో నుండు మేఘమువలె దానమిచ్చువానికి, నమః = అన్నాదులొసగి సత్కరించుడు. ॥౩౨॥

భావార్థము :—పరస్పరము కలుసుకొన్నప్పుడు సత్కరించుటకై 'నమస్తే' వాక్యము నుచ్చరించి చిన్నలు పెద్దలను, పెద్దలు చిన్నలను, క్షత్రియాదులు బ్రాహ్మణులను, బ్రాహ్మణాదులు క్షత్రియాదులను, నిరంతరము సత్కరించవలెను. ప్రజలందరు ఈ వేదోక్త ప్రమాణముచే అన్ని యెడల శిష్టాచారము నందీ వాక్యమును ప్రయోగించి పరస్పరము ఒకరినొకరు సత్కరించుకొని ప్రసన్నులు కావలయును. ॥౩౨॥ (౬౮౧)

---

౬౮౨ నమః సోభ్యాయేత్యస్య పరస్య ఋషిః, రుద్రో దేవతాః, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నావిషయమే.

నమః సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ నమః శ్లోక్యాయ చావసాన్యాయ చ నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ ॥

నమః, సోభ్యాయ, చ, ప్రతిసర్యాయేతి ప్రతి+సర్యాయ, చ, నమః యామ్యాయ, చ, క్షేమ్యాయ, చ, నమః, శ్లోక్యాయ చ, అవసాన్యాయేత్యవఽసాన్యాయ, చ, నమః, ఉర్వర్యాయ, చ, ఖల్యాయ, చ. (33)

పదార్థః :—(నమః)అన్నమ్(సోభ్యాయ)సోభే ఐశ్వర్యయుక్తేషు భవాయ(చ) (ప్రతిసర్యాయ) యే ప్రతీతే ధర్మే సరన్తి తేషు భవాయ(చ)(నమః)సత్కరణమ్(యామ్యాయ)యో యమేషు న్యాయకారిషు సాధు స్తస్మై. అత్రాన్యేషా మపీతి దీర్ఘః(చ)(క్షేమ్యాయ)క్షేమేషు రక్షకేషు సాధు స్తస్మై(చ) (నమః)సత్కరణమ్(శ్లోక్యాయ)శ్లోకే వేదవాణ్యాం సాధవే. శ్లోక ఇతి వాఙ్ నా. నిఘం. ౧.౧౧(చ) (అవసాన్యాయ)అవసానవ్యవహారే సాధవే(చ)(నమః)సత్కరణమ్(ఉర్వర్యాయ) ఉరూణాం మహతా మర్యాయ స్వామినే(చ)(ఖల్యాయ)ఖలే సంచయాధికరణే సాధవే (చ) ॥౩౩॥ అన్వయః:— హే మనుష్యాః ! సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ నమః శ్లోక్యాయ చావసాన్యాయ చ నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ నమః ప్రయోజ్య దత్త్వా చైతాన్ భవన్త ఆనన్దయన్తు. ॥౩౩॥ భావార్థః :—అత్రానేకైశ్చకారై రన్యేప్యుపయోగినోఽర్థాః సంగ్రాహ్యాః సత్కర్తవ్యాశ్చ ప్రజాస్థై ర్న్యాయాధీశాదీనాం న్యాయాధీశాద్యైః ప్రజాస్థానాం చ సత్కారః పత్న్యాద్యైః ర్భార్యాద్యా భార్యాద్యైః పత్యాదయశ్చ ప్రసాదనీయాః ॥౩౩॥

పదార్థము :—మానవులారా ! సోభ్యాయ = ఐశ్వర్యవంతులలో ప్రసిద్ధునకు.చ ప్రతిసర్యాయ = ధర్మాత్ములలో జనించినవానికి.చ = ధనికులగు ధర్మాత్ములకు. నమః = అన్నమిచ్చియు. యామ్యాయ = న్యాయకారుల యందుత్తమునికి. చ క్షేమ్యాయ = రక్షణ మొనర్చువారిలో శ్రేష్ఠునకు. చ = న్యాయాధీశాదులకు. నమః = అన్నమిచ్చియు. శ్లోక్యాయ = వేదవాణియందు ప్రవీణుని. చ అవసాన్యాయ = కార్యమును సమాప్త మొనర్చుటలో కుశలుడైనవానిని.చ = ఆరంభించుటయందుత్తముడైన పురుషుని. నమః = సత్కరించియు. ఉర్వర్యాయ = మహాపురుషుల స్వామిని. చ ఖల్యాయ = శ్రేష్ఠభోజన పదార్థాదులను సంచయ మొనరించుటలో ప్రవీణుని. చ = వ్యయ మొనర్చుటలో విచక్షణుడగువానిని. నమః = సత్కరించియు; వీరి నందరిని మీరు ఆనందపఱచ వలయును. ॥౩౩॥

భావార్థము :—ఈమంత్రమునందు అనేక చకారము లున్నవి. వీనికి నింకను ఉపయోగకరము

వారు వనములలోనుండు వారిని సత్కరించవలయును. ప్రజలు న్యాయాధీశుని. న్యాయాధీశుడు ప్రజలను, పత్నులు భార్యాది స్త్రీలను, భార్యాది స్త్రీలు పత్యాది పురుషులను సత్కరించి ప్రసన్నులుగ నొనర్చవలయును. ॥౩౩॥ (౧౬।౩౩)

---

౩౪ నమో వన్యాయేత్యస్య ప్రజాపతి ర్ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
రాజ పురుషైః కథం భవితవ్య మిత్యాహ. రాజపురుషులు ఏవిధముగ నుండవలయును ?

నమో వన్యాయ చ కక్ష్యాయ చ నమః శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమః శూరాయ చావభేదినే చ ॥ ॥౩౪॥

నమః, వన్యాయ, చ, కక్ష్యాయ, చ, నమః, శ్రవాయ, చ, ప్రతిశ్రవాయేతి ప్రతి+శ్రవాయ, చ, నమః, ఆశుషేణాయ, ఆశుసేనాయేత్యాశు+సేనాయ, చ, ఆశురథాయేత్యాశు+రథాయ, చ, నమః, శూరాయ, చ, అవభేదిన ఇత్యవ+భేదినే, చ.

పదార్థః :—(నమః) అన్నమ్ (వన్యాయ) వనే జఙ్గలే భవాయ (చ) (కక్ష్యాయ) కక్షాసు భవాయ (చ) (నమః) సత్కరణమ్ (శ్రవాయ) శ్రోత్రే శ్రవణహేతవే వా (చ) (ప్రతిశ్రవాయ) యః ప్రతిశృణోతి ప్రతిజానీతే తస్మై (చ) (నమః) అన్నదానమ్ (ఆశుషేణాయ) ఆశు శీఘ్రగామినీ సేనా యస్య తస్మై (చ) (ఆశురథాయ) ఆశుశీఘ్రగామినో రథా యానాని యస్య తస్మై (చ) (నమః) సత్కారమ్ (శూరాయ) శత్రూణాం హింసకాయ (చ) (అవభేదినే) శత్రూన్ అవభేత్తుం విదారయితుం శీలాయ (చ) ॥౩౪॥
అన్వయః :—హే మనుష్యాః ! యే వన్యాయ చ కక్ష్యాయ చ నమః శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమః శూరాయ చావభేదినే చ నమః ప్రదద్యుః కుర్యుస్తే సర్వత్ర విజయినో భవన్తు ॥౩౪॥ భావార్థః :—రాజపురుషైః వనకక్షస్థాధ్యేత్రధ్యాపక బలిష్ఠసేనాశూర్ఘగామి యానస్థవీరదూతా నన్నధనాదినా సత్కారేణ ప్రోత్సాహ్య సదా విజయభి ర్భవితవ్యమ్ ॥౩౪॥

పదార్థము:—మానవులారా ! ఎవరు, వన్యాయ = అడవిలోనుండువారికి, చ కక్ష్యాయ చ = వన సమీపమున గదులలోనుండువారికి, గుహలలో నుండువారికి నమః = అన్నమిచ్చెదరో, శ్రవాయ = వినువారిని, లేక వినిపించుటలో హేతువగువానిని, చ ప్రతిశ్రవాయ = ప్రతిజ్ఞ యొనర్చువానిని, చ = ప్రతిజ్ఞను నెఱవేర్చువానిని, నమః = సత్కరించెదరో, ఆశుషేణాయ = శీఘ్రగామియగు సేన కలిగి యున్నవానికి, చ ఆశు రథాయ = శీఘ్రముగ నడచు రథముల యజమానికి, చ = సారథి మొదలైనవారికి నమః = అన్నమిచ్చెదరో. శూరాయ = శత్రువులను చంపువారిని, చ అవభేదినే = శత్రువులను చీల్చి చెండాడువానిని, చ = దూతలను. నమః = సత్కరించెదరో; వారికి సర్వత్ర విజయము లభించును.

భావార్థము :—రాజపురుషులు వనమందు, భవనములందుండువారికి, చదివించు వారికి, చదువు వారికి, బలిష్ఠసేనలకు, శీఘ్రగాములగు యానముల నధిష్ఠించు వీరులకు, దూతలకు అన్నాదులొసగి సత్కారపూర్వకముగ నుత్సాహమును పెంచి, సదా విజయమును పొందవలయును. ॥౩౪॥(౧౬।౩౪)

---

౧౬।౩౫ నమో బిల్మిన ఇత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
యోద్ధౄణాం రక్షా కథం కార్యేత్యాహ? యోద్ధుల నెటుల రక్షించవలయును?

నమో బిల్మినే చ కవచినే చ నమో వర్మిణే చ వరూథినే చ నమః శ్రుతాయ చ శ్రుతసేనాయ చ నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ ॥ ॥౩౫॥

నమః, బిల్మినే, చ, కవచినే, చ, నమః, వర్మిణే, చ, వరూథినే, చ, నమః, శ్రుతాయ, చ, శ్రుతసేనాయేతి శ్రుత+సేనాయ, చ, నమః దున్దుభ్యాయ, చ, ఆహనన్యాయేత్యా+హనన్యాయ, చ. (౩౫)

పదార్థః :—(నమః)సత్కరణమ్(బిల్మినే)ప్రశస్తం బిల్మమ్ ధారణం వా విద్యతే యస్య తస్మై (చ) (కవచినే) సమ్బద్ధం కవచం శరీర రక్షాసాధనం విద్యతే యస్య తస్మై)(చ) (నమః) అన్నాదిదానమ్(వర్మిణే)బహూని వర్మాణి శరీర రక్షాసాధనాని విద్యన్తే యస్య(తస్మై(చ)(వరూథినే)ప్రశస్తాని వరూథాని గృహాణి విద్యన్తే యస్య తస్మై. వరూథ మితి గృహ నా. నిఘం. . ౩.౪(చ) (నమః) సత్కరణమ్ (శ్రుతాయ)యః శుభగుణేషు శ్రూయతే తస్మై (చ) (శ్రుత సేనాయ) శ్రుతా ప్రఖ్యాతా సేనా యస్య తస్మై(చ)(నమః)సత్కరణమ్ (దున్దుభ్యాయ)దున్దుభిషు వాదిత్రేషు సాధవే(చ)(ఆహనన్యాయ) వీరరసాయ వాదిత్రవాదనేషు సాధవే(చ) ॥౩౫॥ అన్వయః :—హే రాజప్రజాజనాధ్యక్ష ! భవన్తో బిల్మినే చ కవచినే చ నమో వర్మిణే చ వరూథినే చ నమః శ్రుతాయ చ శ్రుతసేనాయ చ నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ నమః కుర్యు ర్దద్యు ర్యతో యుష్మాకం పరాజయః కదాపి న స్యాత్. ॥౩౫॥ భావార్థః :—రాజప్రజాజనై ర్యోద్ధౄణాం సర్వతో రక్షా సర్వతః సుఖప్రదాని గృహాణి భోజ్యపేయాని వస్తూని ప్రసంసితజనానాం సఙ్గోఽత్యుత్తమాని వాదిత్రాణి చ దత్వా స్వాభీష్టాని సాధనీయాని. ॥౩౫॥

పదార్థము :—రాజా ! ప్రజాధ్యక్షా ! మీరు, బిల్మినే = ప్రశంసితధారణ పోషణ లొనర్చు వానిని, చ కవచినే = శరీర రక్షణ కవచములను ధరించినవానిని,చ = వారి సహాయకారులను, నమః = సత్కరించవలయును.వర్మిణే = శరీర రక్షణసాధనము లనేకము గలవానికి,చ వరూథినే = ప్రశంసితగృహములు గలవారికి, చ = గృహాదుల రక్షకులకు, నమః = అన్నాదుల నీయవలయును, శ్రుతాయ = శుభగుణములలో ప్రఖ్యాతులను, చ శ్రుతసేనాయ = ప్రఖ్యాత సేన గల వానిని,చ = సేనలోని వానిని, నమః = సత్కరించవలయును. చ దుందుభ్యాయ = వాద్యనిపుణుని, చ ఆహనన్యాయ = యుద్ధమందు వీరుల కుత్సాహము పెంపొందించుటకై వాద్యము వాయించు నతనిని, నమః = సత్కరించుడు. దీనివలన మీకు పరాజయ మెన్నటికి కలుగదు. ॥౩౫॥

భావార్థము :—రాజు ప్రజలు యోద్ధుల కన్ని విధముల రక్షణ, సకల విధముల సుఖ మొసగు గృహములను, ఖాద్యపేయ పదార్థములను, శ్రేష్ఠుల సాంగత్యము, అత్యుత్తమ వాద్యముల నిచ్చి స్వాభీష్ట కార్యములను సాధించవలయును. ॥౩౫॥ (౮౧౬)

---

౮౨౦ నమో ధృష్ణవ ఇత్యస్య పర్వ ఋషిః, రుద్రో దేవతాః, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ నమో నిషఙ్గిణే చేషుధిమతే చ నమస్తీ

క్షిషవే చాయుధినే చ నమః స్వాయుధాయ చ సుధన్వనే చ ॥ ॥౩౬॥

నమః, ధృష్ణవే, చ, ప్రమృశాయేతి ప్ర+మృశాయ, చ, నమః, నిషఙ్గిణే, చ, ఇషుధిమత ఇతీషుధి+మతే, చ, నమః, తీక్ష్ణేషవ ఇతి తీక్ష్ణ+ఇషవే, చ, ఆయుధినే, చ, నమః, స్వాయుధాయేతి సు+ఆయుధాయ, చ, సుధన్వన ఇతి సు+ధన్వనే, చ.

పదార్థః :—(నమః)అన్నాది దానమ్ (ధృష్ణవే) యో ధృష్ణోతి దృఢో నిర్భయో భవతి (చ) (ప్రమృశాయ) ప్రకృష్టవిచారశీలాయ (చ) మృదుస్వభావ జనాయ (నమః) సత్కరణమ్ (నిషఙ్గిణే) బహవో నిషఙ్గాః శస్త్రసమూహా విద్యన్తే యస్య తస్మై (చ) (ఇషుధిమతే)ప్రశస్తశస్త్రాస్త్ర కోశాయ (చ)(నమః)సత్కరణమ్(తీక్ష్ణేషవే)తీక్ష్ణాస్తీవ్రా ఇషవోఽస్త్రశస్త్రాణి యస్య తస్మై(చ)(ఆయుధినే) యే శతఘ్న్యాదిభిః సమన్తాద్యుధ్యన్తే తే ప్రశస్తా విద్యన్తే యస్య తస్మై(చ)(నమః) అన్నదానమ్ (స్వాయుధాయ) శోభనాని ఆయుధాని యస్య తస్మై (చ) (సుధన్వనే) శోభనాని ధన్వాని ధనూంషి యస్య తస్మై(చ)తేషాం రక్షకాయ. ॥౩౬॥ అన్వయః:—యే రాజప్రజాజనాధ్యక్షా ధృష్ణవే చ ప్రమృశాయ చ నమో నిషఙ్గిణే చేషుధిమతే చ నమస్తీక్ష్ణేషవే చాయుధినే చ నమః స్వాయుధాయ చ సుధన్వనే చ నమః ప్రదద్యుః కుర్యుశ్చ తే సదా విజయినో భవన్తు. ॥౩౬॥ భావార్థః :— మనుష్యై ర్యత్కిఞ్చిత్కర్మ కార్యం తత్సువిచారేణ దృఢోత్సాహేనేతి నహి శరీరాత్మబల మన్తరేణ శస్త్ర ప్రహరణం శత్రువిజయశ్చ కర్తుం శక్యతే తస్మాత్సతతం సేనా వర్ధనీయా. ॥౩౬॥

పదార్థము :—ఏరాజు, ఏప్రజాధిపతులు, ధృష్ణవే = దృఢునకు, చ ప్రమృశాయ = ఉత్తమ విచార శీలునకు, చ = కోమల స్వభావముగల పురుషునకు, నమః = అన్నమిచ్చెదరో, నిషంగిణే = బహు శస్త్రములు గలిగి యున్నవానిని, చ ఇషుధిమతే = ప్రసంసిత శస్త్రాస్త్ర కోశములు గలవానిని, చ = కూడ, నమః = సత్కరించెదరో, తీక్ష్ణేషవే = తీక్ష్ణమైన అస్త్ర శస్త్రములు గలవానిని, చ ఆయుధినే = ఫిరంగి మొదలగు వానితో చక్కగా పోరాడు వీరుల కధ్యక్షుడైన వానిని, చ = కూడ. నమః = సత్కరించుదురో, స్వాయుధాయ చ = సుందరాయుధములు గలవానికి, చ సుధన్వనే = మంచి ధనుస్సులు గలవానికి, చ = వారి రక్షకులకు, నమః = అన్న మిచ్చెదరో, వారు సదా విజయమును పొందగలరు ॥౩౬॥

భావార్థము :—మానవులే కర్మయొనర్చినను దానిని బాగుగ విచారించి దృఢోత్సాహముతో జేయవలెను. శరీరాత్మబలములులేనిదే శస్త్రచాలనము శత్రువులను జయించుట ఎన్నటికి జేయ జాలరు. కనుక నిరంతరము సేనను అభివృద్ధి పఱచ వలయును. ॥౩౬॥ (౨౦)

౨౧ నమః స్రుత్యా యేత్యస్య కుత్స ఋషిః, రుద్రా దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

మనుష్యై రుదకేన కథ ముపకర్తవ్య మిత్యాహ.

మానవులు జలములచే నెటుల ఉపకారము గ్రహించ వలయును?

నమః స్రుత్యాయ చ పథ్యాయ చ నమః కాట్యాయ చ నీప్యాయ చ నమః కుల్యాయ చ సరస్యాయ చ నమో నాదేయాయ చ వైశన్తాయ చ ॥ ॥౩౭॥

నమః, స్రుత్యాయ, చ, పథ్యాయ, చ, నమః, కాట్యాయ, చ, నీప్యాయ, చ, నమః, కుల్యాయ, చ, సరస్యాయ, చ, నమః, నాదేయాయ, చ, వైశన్తాయ, చ.

పదార్థః :—(నమః)అన్నదానమ్ (స్రుత్యాయ)స్రుతౌ ప్రస్రవదే భవాయ(చ) (పథ్యాయ)పథి భవాయ గన్తుకాయ(చ)మార్గాదిశోధకాయ(నమః)సత్కరణమ్(కాట్యాయ)కాటేషు కూపేషు భవాయ. కాట ఇతి కూప నా... నిఘం. ౩.౨౩ (చ)(నీప్యాయ)నితరా మాపో యస్మిన్ స నీప స్తత్ర భవాయ (చ)తత్సహాయినే(నమః)సత్కరణమ్(కుల్యాయ)కుల్యాసు నదీషు భవాయ. కుల్యా ఇతి నదీ నా... నిఘం. ౧,౧౩(చ)(సరస్యాయ)సరసి తడాగే భవాయ(చ)(నమః)అన్నాది దానమ్(నాదేయాయ)నదీషు భవాయ(చ)(వైశన్తాయ)వేశన్తేషు క్షుద్రేషు జలాశయేషు భవాయ(చ) ॥౩౭॥ అన్వయః :— మనుష్యైః స్రుత్యాయ చ పథ్యాయ చ నమః కాట్యాయ చ నీప్యాయ చ నమః కుల్యాయ చ సరస్యాయ నమశ్చ నాదేయాయ చ వైశన్తాయ చ నమో దత్వా దయా ప్రకాశనీయా ॥౩౭॥ భావార్థః :— మనుష్యైః స్రోతసాం మార్గాణాం కూపానాం జలప్రాయదేశానాం మహదల్ప సరసాం చ జలం చాలయిత్వా యత్ర కుత్ర బద్ధ్వా క్షేత్రాదిషు పుష్కలాన్యన్న ఫల వృక్ష లతాగుల్మాదీని సంవర్ధనీయాని.

పదార్థము :—మానవులు, స్రుత్యాయ = స్రోతస్సులందు. కాలువలందు నుండువానికి, చ పథ్యాయ = మార్గమున నడచు వానికి, చ = మార్గాదులను శోధించు వానికి, నమః = అన్నమీయవలెను. కాట్యాయ = కూపాదులందు ప్రసిద్ధుడైన వానిని, చ నీప్యాయ = బృహజ్జలాశయములందున్న వానిని, చ = అతని సహాయకుని, నమః = సత్కరించవలయును, కుల్యాయ = కాలువలను సరిచూచు వానిని, చ సరస్యాయ = తటాక కార్యములందు ప్రసిద్ధుడైన వానిని, నమః = సత్కరించ వలయును,చ నాదేయాయ = నదీతటములందు ఉండువానికి,చ వేశన్తాయ = చిన్న చిన్న జలాశయము లందున్న జీవములకు, చ = వాప్యాదులందున్న ప్రాణులకు, నమః = అన్నాదు లొసగి దయను కనబఱచవలయును.

భావార్థము = మానవులు నదుల మార్గములలోని, కూపములలోని, జలప్రాయ దేశములోని, చిన్న పెద్ద సరస్సులలోని జలములను ప్రవహింపజేసి యెక్కడైనను బంధించి క్షేత్రాదులందు వదలి పుష్కలముగ అన్నఫలములను, వృక్ష లతా గుల్మాదులను బాగుగ పెంచవలయును. ॥౩౭॥ (౮౩౧)

---

౮౨౨ నమః కూప్యాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతాః, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల నావిషయమే.

నమః కూప్యాయ చావట్యాయ చ నమో వీధ్ర్యాయ చాతప్యాయ చ నమో మేఘ్యాయ చ విద్యుత్యాయ చ నమో వర్ష్యాయ చావర్షాయ చ ॥ ॥౩౮॥

నమః, కూప్యాయ, చ, అవట్యాయ, చ, నమః, వీధ్ర్యాయేతి, వి+ఈధ్ర్యాయ, చ, ఆతప్యాయేత్యా+తప్యాయ, చ, నమః, మేఘ్యాయ, చ, విద్యుత్యాయేతి వి+ద్యుత్యాయ, చ, నమః, వర్ష్యాయ, చ, అవర్ష్యాయ, చ. (38)

పదార్థః :—(నమః) అన్నాదికమ్ (కూప్యాయ)కూపే భవాయ(చ) (అవట్యాయ) అవటేషు గర్తేషు భవాయ(చ)జఙ్గలేషు భవాయ(నమః) సత్కారాదికమ్ (వీధ్ర్యాయ)వివిధేషు ఈధ్రేషు దీపనేషు

భవాయ. అత్ర వి పూర్వకా దిన్ధి ధాతో రౌణాదికో రక్ ప్రత్యయః (చ) (ఆతప్యాయ) ఆతపేషు భవాయ(చ) కృష్యాదేః ప్రబంధకర్త్రే(నమః) అన్నాదికమ్(మేధ్యాయ)మేఘేషు భవాయ (చ)(విద్యుత్యాయ) విద్యుతి భవాయ(చ)అగ్నివిద్యా విదే(నమః) సత్కారక్రియామ్(వర్ష్యాయ)వర్షాసు భవాయ(చ) (అవర్ష్యాయ)అవిద్యమానాసు వర్షాసు భవాయ(చ) ॥౩౮॥ అన్వయః :—మనుష్యాః కూప్యాయ చావట్యాయ చ నమో వీధ్ర్యాయ చాతప్యాయ చ నమో మేధ్యాయ చ విద్యుత్యాయ చ నమో వర్ష్యాయ చావర్ష్యాయ చ నమో దత్వా కృత్వా చానన్దన్తు. ॥౩౮॥ భావార్థః :—యది మనుష్యాః కూపాదిభ్యః కార్యసిద్ధయే భృత్యాన్ సత్కుర్యు స్తర్హ్యనే కాన్యుత్తమాని కార్యాణి కర్తుం శక్నుయుః. ॥౩౮॥

పదార్థము :—మానవులు, కూప్యాయ = కూపస్థజీవములకు, చ అవట్యాయ = గోతులలోని జీవములకు, చ = వన్యజీవములకు, నమః = అన్నమివ్వవలయును; చ వీధ్ర్యాయ = వివిధప్రకాశము లందుండువానికి, చ ఆతప్యాయ = ఎండలో నుండువానికి, చ = వ్యవసాయాదుల ప్రబంధ మొనర్చు వానికి, నమః = అన్నమియ్యవలెను. మేధ్యాయ = మేఘములలో నుండు వానికి, చ విద్యుత్యాయ = విద్యుత్తుచే పని గొనువానికి, చ = అగ్నివిద్య నెరిగిన వానికి, నమః = అన్నాదుల నొసగ వలయును. చ వర్ష్యాయ = వర్షము నందుండు వానిని, చ అవర్ష్యాయ = వర్షారహిత దేశము నందుండు వానిని, నమః = సత్కరించి ఆనందితులు కావలయును. ॥౩౮॥

భావార్థము :—మానవులు కూపాదులనుండి కార్యసిద్ధి పొందుటకై భృత్యులను సత్కరించుచో అనేకోత్తమ కార్యములను సాధించ గలరు. ॥౩౮॥ (౮-౨-౨)

---

౮-౨-౩ నమో వాత్యాయేత్యస్య కుత్స ఋషిః, రుద్రో దేవతాః, స్వరాడార్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ మనుష్యై రన్యేభ్యో జగత్స్థపదార్థేభ్యః కథ ముపకారో గ్రాహ్య ఇత్యుపదిశ్యతే.

మానవు లితరములగు లోకస్థ పదార్థములనుండి ఉపకారమెటుల గ్రహించ వలయును?

నమో వాత్యాయ చ రేష్మ్యాయ చ నమో వాస్తవ్యాయ చ వాస్తుపాయ చ నమః సోమాయ చ రుద్రాయ చ నమస్తామ్రాయ చారుణాయ చ ॥ ॥౩౯॥

నమః, వాత్యాయ, చ, రేష్మ్యాయ, చ, నమః, వాస్తవ్యాయ, చ, వాస్తుపాయేతి వాస్తు + పాయ, చ, నమః, సోమాయ చ, రుద్రాయ, చ, నమ, తామ్రాయ, చ, అరుణాయ, చ. (39)

పదార్థః :—(నమః)అన్నాదికమ్(వాత్యాయ)వాయు విద్యాయాం భవాయ (చ) (రేష్మ్యాయ) రేష్మసు హింసకేషు భవాయ (చ)(నమః) సత్కరణమ్ (వాస్తవ్యాయ)వాస్తుని నివాసస్థానే భవాయ (చ)(వాస్తుపాయ) వాస్తూని నివాసస్థానాని పాతి తస్మై(చ) (నమః)అన్నాదికమ్ (సోమాయ)ఐశ్వర్యోపపన్నాయ(చ)(రుద్రాయ) దుష్టానాం రోదకాయ(చ) (నమః)సత్కరణమ్ (తామ్రాయ)యస్తామ్యతి గ్లాయతి తస్మై(చ)(అరుణాయ)ప్రాపకాయ(చ) ॥౩౯॥ అన్వయః :—యే మనుష్యాః వాత్యాయ చ రేష్మ్యాయ చ నమో వాస్తవ్యాయ చ వాస్తుపాయ చ నమః సోమాయ చ రుద్రాయ చ నమ స్తామ్రాయ చారుణాయ చ నమో విదధ్యు స్తే శ్రియా సమ్పన్నాః స్యుః.॥౩౯॥ భావార్థః :—యదా మనుష్యా వాయ్వాదిగుణాన్ విదిత్వా వ్యవహారేషు సంప్రయుఞ్జీరం స్తదానేకాని సుఖాని లభేరన్.

పదార్థము :—ఏ మానవులు, వాత్యాయ = వాయు విద్యాకుశలునకు, చ రేష్మ్యాయ = చంపు వారిలో ప్రసిద్ధునకు, చ = కూడ, నమః = అన్నాదుల నొసగెదరో, చ వాస్తవ్యాయ = నివాసస్థానము లందుండు వానిని, వాస్తుపాయ = నివాసస్థాన రక్షకుని, నమః = సత్కరించెదరో, చ సోమాయ = ధనాఢ్యునకు, చ రుద్రాయ = దుష్టుల నేడిపించు వానికి, నమః = అన్నాదు లిచ్చెదరో, చ తామ్రాయ = దుష్కర్మల నుండి ఏవగించు వానిని, చ అరుణాయ = శ్రేష్ఠపదార్థములను లభింప జేయు వానిని. నమః = సత్కరించెదరో, వారు సంపన్నులు కాగలరు. ॥౩౯॥

భావార్థము :—మనుష్యులు వాయ్వాదుల గుణముల నెరిగి వ్యవహారములందు ప్రయోగించి నప్పుడు అనేక సుఖములను పొందగలరు. ॥౩౯॥ (౮౨౩)

---

౮౨౪ నమః శఙ్గవ ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, భురిగతి జగతీ ఛన్దః, పఞ్చమః స్వరః.

మనుష్యైః కథం సంతోష్టవ్య మిత్యాహ. మానవు లెటుల సంతోష పడవలయును?

నమః శఙ్గవే చ పశుపతయే చ నమ ఉగ్రాయ చ భీమాయ చ నమోఽగ్రేవధాయ చ దూరేవధాయ చ నమో హన్త్రే చ హనీయసే చ నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయ ॥ ॥౪౦॥

నమః, శఙ్గవ ఇతి శమ్+గవే, చ, పశుపతయ ఇతి పశు+పతయే, చ, నమః, ఉగ్రాయ, చ, భీమాయ, చ, నమః, అగ్రేవధాయేత్యగ్రే+వధాయ, చ, దూరేవధాయేతి దూరేఽవధాయ, చ, నమః, హన్త్రే, చ, హనీయసే, చ, నమః, వృక్షేభ్యః, హరికేశేభ్య+ఇతి హరి + కేశేభ్యః, నమః, తారాయ. (40)

పదార్థః :—(నమః) అన్నాదికమ్ (శఙ్గవే)శం సుఖం గచ్ఛతి ప్రాప్నోతి తస్మై(చ)(పశుపతయే)గవాదిపశూనాం పాలకాయ(చ)(నమః)సత్కరణమ్(ఉగ్రాయ)తేజస్వినే(చ)(భీమాయ) బిభేతి యస్మాత్ తస్మై భయఙ్కరాయ(చ)(నమః) అన్నాదికమ్(అగ్రేవధాయ) యోఽగ్రే పురః శత్రూ న్బధ్నాతి హన్తి వా తస్మై(చ)(దూరేవధాయ)యోఽరీన్దూరే బధ్నాతి తస్మై(చ) (నమః)అన్నాది దానమ్(హన్త్రే)యో దుష్టాన్ హన్తి తస్మై(చ)(హనీయసే)దుష్టానా మతిశయేన హన్త్రే వినాశకాయ (చ)(నమః)సత్కరణమ్(వృక్షేభ్యః)యే శత్రూన్ వృశ్చన్తి ఛిన్దన్తి తేభ్యః పాదపేభ్యో వా(హరికేశేభ్యః)హరయో హరితాః కేశా యేషాం తేభ్యో యువభ్యో వా(నమః)అన్నాదికమ్(తారాయ)దుఃఖాత్సన్తారకాయ ॥౪౦ అన్వయః :—యే మనుష్యాః । శఙ్గవే చ పశుపతయే చ నమ ఉగ్రాయ చ భీమాయ చ నమోఽగ్రే వధాయ చ దూరే వధాయ చ నమో హన్త్రే చ హనీయసే చ నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయ నమో దద్యుః కుర్యుస్తే సుఖినః స్యుః. ॥౪౦॥ భావార్థః :— మనుష్యై ర్గవాదిపశుపాలనేన భయఙ్కరాది శాన్తికరణేన చ సంతోష్టవ్యమ్. ॥౪౦॥

పదార్థము :—ఏ మానవులు, శంగవే = సుఖమును పొందు వానికి, చ పశుపతయే = గవాది పశువుల రక్షించు వానికి, చ = గవాదులకు, నమః = అన్నాది పదార్థముల నిచ్చెదరో, ఉగ్రాయ = తేజస్విని,

చ క్షిమాయ = భయంకరునకు. చ = కూడ, నమః = సత్కరించెదరో. అగ్రేవధాయ = ముందు శత్రువులను బంధించు వానికి, చ దూరేవధాయ = దూరమున నున్న శత్రువులను బంధించు లేక చంపు వానికి, చ = కూడ. నమః = అన్నాదుల నిచ్చెదరో హంత్రే చ = దుష్ట సంహారునకు, హనీయసే చ = దుష్టులను నిర్మూలన మొనరించు వానికి కూడ, నమః = అన్నాదుల నిచ్చెదరో, వృక్షేభ్యః = శత్రువులను చీల్చు వానిని లేక వల్లకు, హరికేశేభ్యః = ఆకుపచ్చని వెంట్రుకలుగల భటులను లేక ఆకు పచ్చని ఆకులుగల వృక్షములకు, నమః = ఆదరించెదరో, జలాదుల నొసగెదరో. తారాయ నమః = దుఃఖముల నుండి తరింపజేయు వానికి, అన్నాదుల నొసగెదరో వారు సుఖులు కాగలరు. ॥౪౦॥

భావార్థము :—మానవులు గవాది పశువులను పాలించియు, భయంకర జీవములను శాంతింప జేసియు సంతోషించ వలయును. ॥౪౦॥ (౧౬–౪౧)

---

౧౬–౪౧ నమః శమ్భవాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రో దేవతాః, స్వరాడార్షీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

జనైః కథం స్వాభీష్టం సాధ్య మిత్యాహ. మానవులు తమ అభీష్టము నెటుల సాధించ వలెను?

నమః శమ్భవాయ చ మయోభవాయ చ నమః శఙ్కరాయ చ
మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ ॥ ॥౪౧॥

నమః, శమ్భవాయేతి శమ్+భవాయ, చ, మయోభవాయేతి మయః+భవాయ, చ, నమః, శఙ్కరాయేతి శమ్+కరాయ, చ, మయస్కరాయ, మయః+కరాయేతి మయః+కరాయ, చ, నమః, శివాయ, చ, శివతరాయేతి శివ+తరాయ, చ.

పదార్థః :—(నమః)సత్కరణమ్(శమ్భవాయ)యః శం సుఖం భావయతి తస్మై పరమేశ్వరాయ సేనాధీశాయ వా. అత్రాన్తర్భావితో ణ్యర్థః(చ)(మయోభవాయ)మయః సుఖం భవతి యస్మాత్తస్మై(చ)(నమః)సత్కరణమ్(శఙ్కరాయ)యః సర్వేషాం సుఖం కరోతి తస్మై(చ) (మయస్కరాయ)యః సర్వేషాం ప్రాణినాం మయః సుఖం కరోతి తస్మై (చ) (నమః) సత్కరణమ్ (శివాయ)మఙ్గలకారిణే(చ)(శివతరాయ)అతిశయేన మఙ్గలస్వరూపాయ(చ).॥౪౧॥ అన్వయః :—యే మనుష్యాః శమ్భవాయ చ మయోభవాయ చ నమః శఙ్కరాయ చ మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ నమః కుర్వన్తి తే కల్యాణమాప్నువన్తి. ॥౪౧॥ భావార్థః :—మనుష్యైః ప్రేమభక్త్యా సర్వమఙ్గలప్రదః పరమేశ్వర ఏవోపాస్యో బలాధ్యక్షశ్చ సత్కర్తవ్యో యతః స్వాభీష్టాని సిధ్యేయుః.

పదార్థము :—ఏ మానవులు, శమ్భవాయ = సుఖములను లభింపజేయు పరమేశ్వరుని [లేక సేనానాయకుని], చ మయోభవాయ = సుఖప్రాప్తికి హేతువగు విద్వాంసుని కూడ, నమః = సత్కరించెదరో, శంకరాయ = కల్యాణమొనర్చు వానిని, చ మయస్కరాయ = సకలప్రాణులకు సుఖము చేకూర్చు వానిని కూడ, నమః = ఆశ్రయించెదరో, శివాయ = మంగళకరుని, చ శివతరాయ = అత్యంత మంగళస్వరూపుని, చ = కూడ, నమః = ఆదరించెదరో, వారు కల్యాణము పొందుదురు, ॥౪౧॥

భావార్థము :—మానవులు ప్రేమతో భక్తితో సకల మంగళముల నొసగు, పరమేశ్వరునే ఉపాసించ వలయును. సేనాధ్యక్షుని సత్కరించ వలయును. ఇటులొనర్చుటచే నభీష్టకార్యములు సిద్ధించును.

---

౧౬-౪౨ నమః పార్యాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, నిచృదార్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱలా విషయమే.

నమః పార్యాయ చావార్యాయ చ నమః ప్రతరణాయ చోత్తరణాయ చ నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ నమః శష్ప్యాయ చ ఫేన్యాయ చ ॥ ॥౪౨॥

నమః, పార్యాయ, చ, అవార్యాయ, చ, నమః, ప్రతరణాయేతి ప్ర + తర ణాయ, చ, ఉత్తరణాయేత్యుత్ + తరణాయ, చ, నమః, తీర్థ్యాయ, చ, కూల్యాయ, చ, నమః, శష్ప్యాయ, చ, ఫేన్యాయ, చ. (12)

పదార్థః :-(నమః) అవారే సత్కారణమ్ (పార్యాయ)దుఃఖేభ్యః పారే వర్తమానాయ (చ) (అవార్యాయ)అవారే అర్వాచీనే భాగే భవాయ (చ) (నమః)సత్కారణమ్ (ప్రతరణాయ) నౌకాదినా పరతటాదర్వాచీనే తట ప్రాప్తాయ ప్రాపయిత్రే వా(చ) (ఉత్తరణాయ) అర్వాచీనతటాత్ పరతటం ప్రాప్నువతే ప్రాపయతే వా(చ)(నమః)అన్నమ్(తీర్థ్యాయ) తీర్థేషు వేదవిద్యాధ్యాపకేషు సత్యభాషణాదిషు చ సాధవే(చ)(కూల్యాయ) కూలేషు సముద్రనద్యాది తటేషు సాధవే(చ)(నమః) అన్నాదిదానమ్ (శష్ప్యాయ)శష్పేషు తృణాదిషు సాధవే(చ)(ఫేన్యాయ)ఫేనేషు బుద్బుదాకారేషు సాధవే చ.॥౪౨॥

అన్వయః :-యే మనుష్యాః। పార్యాయ చావార్యాయ చ నమః ప్రతరణాయ చోత్తరణాయ చ నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ నమః శష్ప్యాయ చ ఫేన్యాయ చ నమః కుర్వన్తు ప్రదద్యుశ్చ తే సుఖం ప్రాప్నుయుః. ॥౪౨॥ భావార్థః :-మనుష్యై ర్యానేషు నౌకాదిషు సుశిక్షితాన్ కైవర్తకాదీన్ సంస్థాప్య సముద్రాది పారావారౌ గత్వాగత్య దేశదేశాన్తర ద్వీపద్వీపాన్తర వ్యవహారేణ ధనం నిష్పాద్యాభీష్టం సాధనీయమ్. ॥౪౨॥

పదార్థము :-ఏ మానవులు, పార్యాయ = దుఃఖముల నుండి గట్టెక్కినవానికి, చ అవార్యాయ = ఇవతలి యొడ్డున నున్నవానికి, చ = కూడ, నమః = అన్న సత్కారములను, చ = అటులనే, ప్రతరణాయ = ఆ తటము నుండి నౌకాదులద్వారా ఈ యొడ్డుకు చేరు వానికి లేక చేర్చు వానికి, చ ఉత్తరణాయ = ఈ యొడ్డునుండి ఆ యొడ్డుకు చేరు వానికి లేక చేర్చు వానికి, నమః = అన్న సత్కారములను, తీర్థ్యాయ = వేద విద్యలను అభ్యసించు వానికి, సత్యభాషణాది కార్యములందు ప్రవీణునకు, చ కుల్యాయ = సముద్ర తటమున లేక నదుల తీరమున నుండు వానికి, నమః = అన్న సత్కారములను, శష్ప్యాయ = తృణాది కార్యములందు నేర్పరికి, చ ఫేన్యాయ = బుడగలకు సంబంధించిన పనులలో ప్రవీణునకు, చ = కూడ, నమః = అన్న సత్కారముల నొసగుదురో, వారు కల్యాణములను పొందుదురు. ॥౪౨॥

భావార్థము :-మానవులు నౌకాది యానములందు సుశిక్షితులగు నావికుల నుంచి సముద్రాదులను ఇటు నటు దాటి దేశ దేశాంతరములందు, ద్వీపద్వీపాంతరము లందు వ్యవహారము లొనర్చి ధనము నున్నతి పఱచి స్వాభీష్టములను సాధించ వలయును. ॥౪౨॥ (౧౬-౪౨)

---

౧౬-౪౩ నమః సికత్యాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, జగతీ ఛన్దః, నిషాదఃస్వరః.

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యాహ. మానవు లేమి చేయ వలెను?

నమః సికత్యాయ చ ప్రవాహ్యాయ చ నమః కింశిలాయ చ క్షయణాయ చ నమః కపర్దినే చ పులస్తయే చ నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ ॥

నమః, సికత్యాయ, చ, ప్రవాహ్యాయేతి ప్ర + వాహ్యాయ, చ, నమః, కింశిలాయ, చ, క్షయణాయ, చ, నమః, కపర్దినే, చ, పులస్తయే, చ, నమః, ఇరిణ్యాయ, చ, ప్రపథ్యాయేతి ప్ర+పథ్యాయ చ. (43)

పదార్థః :—(నమః)అన్నమ్(సికత్యాయ)సికతాసు సాధవే(చ) (ప్రవాహ్యాయ)యే ప్రవోఢుం యోగ్యాస్తేషు సాధవే (చ) (నమః) (కింశిలాయ) కిం కుత్సితః శిలో వృత్తి ర్యస్య తస్మై(చ) (క్షయణాయ)నివాసే వర్తమానాయ(చ)(నమః)అన్నమ్(కపర్దినే)జటాయుక్తాయ జనాయ(చ) (పులస్తయే)మహాకాయ క్షేప్త్రే. అత్ర పుల మహత్త్వే ధాతో ర్బాహులకా దౌణాదికః కస్తిః ప్రత్యయః (చ)(నమః)సత్కరణమ్ (ఇరిణ్యాయ) ఇరిణ ఊషరభూమౌ సాధవే (చ)(ప్రపథ్యాయ)ప్రకృష్టేషు ధర్మపథిషు సాధవే(చ). ॥౪౩॥ అన్వయః :—యే మనుష్యాః సికత్యాయ చ ప్రవాహ్యాయ నమః కింశిలాయ చ క్షయణాయ చ నమః కపర్దినే చ పులస్తయే చ నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ నమో దద్యుః కుర్యుస్తే సర్వప్రియా జాయేరన్. ॥౪౩॥ భావార్థః :—మనుష్యై ర్భూగర్భవిద్యయా సికతాదిషు భవాన్ సువర్ణాదీన్ ధాతూన్ నిఃసార్య మహదైశ్వర్య మున్నీయానాథాః పాలనీయాః.॥౪౩॥

పదార్థము :—ఏ మానవులు. సికత్యాయ = ఇసుకనుండి పదార్థములను తీయుటలో చతురునికి, చ ప్రవాహ్యాయ చ = వృషభాదులను తోలుటలో ప్రసిద్ధుడైన వానికిని, నమః = అన్నమొసగెదరో, కిం శిలాయ చ = శిలావృత్తి ననుసరించువానికి,క్షయణాయ = నివాసస్థానము నందుండు వానికి,చ = కూడ, నమః = అన్నమొసగెదరో, కపర్దినే చ = జటాధారికి, పులస్తయే చ = పెద్దపెద్ద శరీరములను విసరి వేయు వానికిని, నమః = అన్నమొసగెదరో, ఇరిణ్యాయ = ఊసర క్షేత్రము నుండి అత్యుపకారము గ్రహించు వానిని.చ ప్రపథ్యాయ = ఉత్తమ ధర్మ మార్గములందు ప్రవీణుడైన వానిని. చ = కూడ, నమః = సత్కరించెదరో, వారందరు సర్వ ప్రియు లగుదురు. ॥౪౩॥

భావార్థము :—మానవులు భూగర్భ విద్యానుసారము ఇసుక మట్టి మొదలైన వానినుండి సువర్ణాది ధాతువులను తీసి మహదైశ్వర్యమును పెంచి యనాథులను పోషించ వలయును. ॥౪౩॥ (౮—౨౭)

---

నమో వ్రజ్యాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః,రుద్రా దేవతాః,ఆర్షీ త్రిష్టుప్ఛన్దః,ధైవతః స్వరః. కీదృశా జనాః సుఖినో భవన్తీత్యుపదిశ్యతే. ఎటువంటి మానవులు సుఖులుగా నుందురు?

నమో వ్రజ్యాయ చ గోష్ఠ్యాయ చ నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ నమో హృదయ్యాయ చ నివేష్యాయ చ నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ ॥

నమః, వ్రజ్యాయ, చ, గోష్ఠ్యాయ గోస్థ్యాయేతి గో+స్థాయ, చ, నమః, తల్ప్యాయ, చ, గేహ్యాయ, చ, నమః, హృదయ్యాయ, చ, నివేష్యాయేతి ని+వేష్యాయ, చ, నమః, కాట్యాయ, చ, గహ్వరేష్ఠాయ, చ. (44)

పదార్థః :—(నమః)అన్నాదిదానమ్(బ్రజ్యాయ) వ్రజేషు క్రియాసు భవాయ(చ) (గోష్ఠ్యాయ) గోష్ఠేషు గవాం స్థానేషు సాధవే(చ)(నమః)అన్నమ్(తల్ప్యాయ)తల్పే శయనే సాధవే(చ)(గేహ్యా య)గేహే నితరాం భవాయ(చ)(నమః) సత్కృతిమ్ (హృదయ్యాయ)హృదయే సాధవే(చ) (నిషే ష్యాథ)నితరాం వ్యాప్తౌ సాధవే(చ)(నమః)అన్నాదిదానమ్(కాట్యాయ)కూపేష్వవరణేషు భవాయ (చ) (గహ్వరేష్ఠాయ)గహ్వరేషు గహనేషు తిష్ఠతి,తత్ర సుసాధవే(చ).॥౪౪॥అన్వయః :—యే మనుష్యాః వ్రజ్యాయ చ గోష్ఠ్యాయ చ నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ నమో హృదయ్యాయ చ నివేష్యాయ చ నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ నమో దద్యు స్తే సుఖం భజేరన్. ॥౪౪॥ భావార్థః :— యే మనుష్యా మేఘవృష్టిజన్యతృణాది రక్షణేన గవాదీన్ వర్ధయేయు స్తే పుష్కలం భోగం లభేరన్.

పదార్థము :— ఏ మానవులు, వ్రజ్యాయ = క్రియలందు ప్రసిద్ధునికి,చ గోష్ఠ్యాయ = గవాది స్థానముల యుత్తమ ప్రబంధకర్తకు, చ = కూడ, నమః = అన్నమిచ్చెదరో, తల్ప్యాయ = మంచములను నిర్మించు ప్రవీణునకు, చ గేహ్యాయ చ = గృహములనందుండు వానికి కూడ, నమః = అన్నమిచ్చెదరో, హృదయ్యాయ = హృదయభావములలో కుశలునికి, చ నివేష్యాయ = విషయములందు నిరంతరము వ్యాప్తుడై యుండు కుశలుని,చ = కూడ.నమః = సత్కరించెదరో, కాట్యాయ = ఆచ్ఛాదితములగు గుప్తపదార్థములను ప్రకటించు వానికి, చ గహ్వరేష్ఠాయ = గహనములైన గిరికందరములందుండు త్తమునికి, చ = కూడ, నమః = అన్నమిచ్చెదరో;వారు సుఖమును పొందగలరు. ॥౪౪॥

భావార్థము = ఏ మానవులు మేఘముచే నుత్పన్నమగు వర్షముచే జనించు తృణాదులను కాపాడి గవాది పశువులను వృద్ధి పరచెదరో వారు పుష్కల భోగములను పొంద గలరు. ॥౪౪॥

---

౭౫ నమః శుష్క్యాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునస్తైః కిం కార్య మిత్యాహ. ఆ మానవు లేమి చేయ వలెను?

నమః శుష్క్యాయ చ హరిత్యాయ చ నమః పాంసవ్యాయ చ రజస్యాయ చ నమో లోప్యాయ చోలప్యాయ చ నమ ఊర్వ్యాయ చ సూర్వ్యాయ చ ॥

నమః, శుష్క్యాయ, చ, హరిత్యాయ, చ, నమః, పాంసవ్యాయ చ, రజస్యాయ, చ, నమః, లోప్యాయ, చ, ఉలప్యాయ, చ, నమః, ఊర్వ్యాయ, చ, సూర్వ్యాయేతి సు+ఊర్వ్యాయ, చ. (45)

పదార్థః :—(నమః) జలాదికమ్ (శుష్క్యాయ) శుష్కేషు నీరసేషు భవాయ(చ)(హరిత్యాయ) హరితేషు సరసేషు ఆర్ద్రేషు భవాయ(చ)(నమః)మాన్యమ్(పాంసవ్యాయ)పాంసుషుధూలిషు భవాయ (చ) (రజస్యాయ) రజఃసు లోకేషు పరమాణుషు వా భవాయ (చ) (నమః) మానమ్ (లోప్యాయ) లోపేషు ఛేదనేషు సాధవే (చ) (ఉలప్యాయ) ఉలపే ఉత్క్షేపణే సాధవే. అత్రోలశ్చోరాదికాద్ధాతో రౌణాదికో కపన్ ప్రత్యయః(చ)(నమః) సత్క్రియామ్ (ఊర్వ్యాయ) ఊర్వౌ హింసాయాం సాధవే (చ)(సూర్వ్యాయ) సుష్ఠు ఊర్వౌ భవాయ(చ) ॥౪౫॥ అన్వయః :—యే మనుష్యాః శుష్క్యాయ హరిత్యాయ చ నమః పాంసవ్యాయ చ రజస్యాయ చ నమో లోప్యాయ చోలప్యాయ

చ నమ ఊర్వ్యాయ చ సూర్వ్యాయ చ నమో దద్యుః కుర్యు స్తేషాం కార్యాణి సిధ్యేయుః. ॥౪౫॥
భావార్థః :—మనుష్యాః శోషణ హరితత్వాది కారకాన్ వాయూన్ విజ్ఞాయ కార్యసిద్ధిం కుర్యుః. ॥౪౫॥

పదార్థము :—ఏ మానవులు, శుష్క్యాయ = రసరహిత పదార్థము లందుండు వానికి, చ హరిత్యాయ చ = సరస పదార్థములందు ప్రసిద్ధుడైన వానికి కూడ, నమః = జలాదుల నొసగుదురో, పాంసవ్యాయ = ధూళియందుండు వానిని. చ రజస్యాయ చ = లోకలోకాంతరము లందున్న వానిని కూడ, నమః = ఆదరించెదరో, లోప్యాయ = ఛేదించుటలో ప్రవీణుని, చ ఉలప్యాయ చ = విసరివేయుటలో నేర్పరిని కూడ, నమః = సత్కరించెదరో. ఊర్వ్యాయ = కొట్టుట యందు ప్రసిద్ధుని, చ సూర్వ్యాయ చ = చక్కగ తాడన మొనర్చు వానిని కూడ, నమః = సమ్మానించెదరో, అట్టివారి సకల కార్యములు సిద్ధించును. ॥౪౫॥

భావార్థము :—మానవులు ఎండించు జేయు, మఱియు పచ్చపఱచు వాయువులను తెలిసికొని స్వకార్యములను సాధించవలయును. ॥౪౫॥ (రా౨౯)

---

౨౨౦ నమః పర్ణాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, స్వరాట్ ప్రకృతి శ్ఛన్దః, ధైవతః స్వరః ।
పున స్తదేవాహ. ముఱల నా విషయమే.

నమః పర్ణాయ చ పర్ణశదాయ చ నమ ఉద్గురమాణాయ చాభిఘ్నతే చ నమ ఆఖిదతే చ ప్రఖిదతే చ నమ ఇషుకృద్భ్యో ధనుష్కృద్భ్యశ్చ వో నమో నమో వః కిరికేభ్యో దేవానాం హృదయేభ్యో నమో విచిన్వత్కేభ్యో నమో విక్షిణత్కేభ్యో నమ ఆనిర్హతేభ్యః ॥ ॥౪౬॥

నమః, పర్ణాయ, చ, పర్ణశదాయేతి పర్ణ+శదాయ, చ, నమః, ఉద్గురమాణాయేత్యుత్+గురమాణాయ, చ, అభిఘ్నత ఇత్యభి+ఘ్నతే, చ, నమః, ఆఖిదత ఇత్యా+ఖిదతే, చ, ప్రఖిదత ఇతి ప్ర+ఖిదతే, చ, నమః, ఇషుకృద్భ్య ఇతీషుకృత్+భ్యః, ధనుష్కృద్భ్యః, ధనుః+కృద్భ్య ఇతి ధనుః కృత్ + భ్యః, చ, వః, నమః, నమః, వః, కిరికేభ్యః, దేవానామ్, హృదయేభ్యః, నమః, విచిన్వత్కేభ్య ఇతి వి+చిన్వత్కేభ్యః, నమః, విక్షిణత్కేభ్య ఇతి వి + క్షిణత్కేభ్యః, నమః, ఆనిర్హతేభ్య ఇత్యానిః+హతేభ్యః. (46)

పదార్థః :—(నమః) అన్నమ్ (పర్ణాయ)యః ప్రతిపాలయతి తస్మై (చ) (పర్ణశదాయ)యః పర్ణాని శీయతే ఛినత్తి తస్మై(చ)(నమః)(ఉద్గురమాణాయ)య ఉత్కృష్టతయా గురత ఉద్యచ్ఛత్యుద్యమం కరోతి తస్మై(చ)(అభిఘ్నతే) య ఆభిముఖ్యేన హన్తి తస్మై (చ) (నమః) సత్కరణమ్ (ఆఖిదతే)ఆసమన్తాద్దీనాయైశ్వర్యోపక్షీణాయ (చ) (ప్రఖిదతే) ప్రకృష్టతయా క్షీణాయ (చ) (నమః)

అన్నాదిదానమ్(ఇషుకృద్భ్యః)బాణనిర్మాపకేభ్యః(ధనుష్కృద్భ్యః)ధనుషాం నిర్మాతృభ్యః(చ) (వః) యుష్మభ్యమ్(నమః)మాన్యమ్(నమః)అన్నాదిదానమ్(వః)యుష్మభ్యమ్(కిరికేభ్యః) విక్షేపకేభ్యః(దేవానామ్) విదుషామ్(హృదయేభ్యః)హృద్యవద్వర్త మానేభ్యః (నమః)సత్కరణమ్ (విచిన్వత్కేభ్యః) యే విచిన్వన్తితేభ్యః(నమః)సత్కారమ్(విక్షిణత్కేభ్యః)యే శత్రూన్ విక్షయన్తి తేభ్యః(నమః)సత్కారమ్(ఆనిర్హతేభ్యః) యే సమన్తాన్నిర్హతా స్తేభ్యః. ॥౪౬॥ అన్వయః :—యే మనుష్యాః పర్ణాయ చ పర్ణశదాయ చ నమ ఉద్గురమాణాయ చాభిఘ్నతే చ నమ ఆఖిదతే చ ప్రఖిదతే చ నమ ఇషుకృద్భ్యో నమో ధనుష్కృద్భ్యశ్చ వో నమో దేవానాం హృదయేభ్యః కిరికేభ్యో వో నమో విచిన్వత్కేభ్యో నమో విక్షిణత్కేభ్యో నమ ఆనిర్హతేభ్యో నమో దద్యుః కుర్యుశ్చ తే సర్వత ఆఢ్యా జాయన్తే. ॥౪౬॥ భావార్థః :—మనుష్యైః సర్వౌషధిభ్యోఽన్నాదికం సంగృహ్యానాథ మనుష్యాదిప్రాణిభ్యో దత్వా ఆనన్దయితవ్యాః. ॥౪౬॥

పదార్థము :—ఏ మానవులు, పర్ణాయ = ప్రత్యుపకార మొనర్చి రక్షించు వానికి, చ పర్ణశదాయ చ = పత్రములను ఛేదించువానికి కూడ, నమః = అన్న మిడుదురో, ఉద్గురమాణాయ = ఉత్తమ పద్ధతితో పరిశ్రమించు వానికి, చ అభిఘ్నతే = సమ్ముఖులై దుష్టులను సంహరించు వానికి కూడ, నమః = అన్న మొసగెదరో, ఆఖిదతే = దీనుని, నిర్ధనుని, చ ప్రఖిదతే = అతి దరిద్రుని కూడ, నమః = ఆదరించెదరో, ఇషుకృద్భ్యః = బాణములు నిర్మించు వానికి, నమః = అన్నాదు లిచ్చెదరో, చ ధనుష్కృద్భ్యః వః = ధనుస్సులను నిర్మించు మిమ్ము, నమః = సత్కరించెదరో, దేవానాం హృదయేభ్యః = విద్వాంసులకు హృదయముల వలె ప్రియులు, కిరికేభ్యః = శరాదులను విసరువారు నగు, వః నమః = మీకు భోజనాదుల నిచ్చెదరో, విచన్వత్కేభ్యః నమః = శుభగుణములను లేక శుభ పదార్థములను సంచయ మొనర్చు వారిని సత్కరించెదరో, విక్షిణత్కేభ్యః = శతృవులను నాశన మొనర్చు వారిని, నమః = సత్కరించెదరో, ఆనిర్హతేభ్యః నమః = బాగుగ పరాజయము పొందిన వారిని సత్కరించెదరో వా రన్నివిధముల ధనికు లయ్యెదరు. ॥౪౬॥

భావార్థము :—మానవులు సకలౌషధముల నుండి ఉత్తమ పదార్థములను గ్రహించి అనాథులైన మనుష్యాది ప్రాణుల కిచ్చి యందరిని ఆనంద పరచ వలయును. ॥౪౬॥ (౮౩౦)

---

౮౩౧ ద్రాప ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, భురిగార్షీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ద్రాపేఽఅన్ధసస్పతే దరిద్ర నీలలోహిత । ఆసాం ప్రజానా

మేషాం పశూనాం మా భే ర్మారో ఙ్మో చ నః కిం చనామమత్ ॥౪౭॥

ద్రాపే, అన్ధసః, పతే, దరిద్ర, నీలలోహితేతి నీల+లోహిత, ఆసామ్, ప్రజానామితి ప్ర+జానామ్, ఏషామ్, పశూనామ్, మా, భేః, మా, రోక్, మో ఇతి మో, చ, నః, కిమ్, చన, ఆమమత్. (47)

పదార్థః :-(ద్రాపే)యో దః కుత్సితయా గతేః పాతి రక్షతి తత్సమ్బుద్ధౌ(అన్ధసః) అన్నాదేః

(పతే)స్వామిన్(దరిద్రి) యో దరిద్రాన్ ద్రాతి తత్సంబుద్ధౌ (నీలలోహిత)యో నీలాన్ వర్ణాన్ రోహయతి తత్సంబుద్ధౌ(ఆసామ్)ప్రత్యక్షాణామ్(ప్రజానామ్) మనుష్యాదీనామ్(ఏషామ్) (పశూనామ్)గవాదీనామ్ (మా)(భేః)మా భయం ప్రాపయేః(మా)(రోక్)రోగం కుర్యాః(మో)(చ)(నః)అస్మాన్(కిమ్)(చన) (ఆమమత్)ఆమ రోగే. అమాగమః.౨జీ రూపమ్.॥౪౭॥అన్వయః :—హే ద్రాపే అన్ధసస్పతే ! దరిద్రి నీలలోహిత రాజప్రజాజన త్వమాసాం ! ప్రజానా మేషాం పశూనాం చ సకాశాన్మా భేః.మా రోక్నోఽ స్మాన్ కించన మో ఆమమత్. ॥౪౭॥ భావార్థః :-య ఆఢ్యా స్తే దరిద్రాన్ పాలయేయు ర్యే రాజప్రజాజనా స్తే ప్రజాపశుహింసనం కదాపి మా కుర్యు ర్యతః సర్వేషాం సుఖం వర్ధేత. ॥౪౭॥

పదార్థము :—ద్రాపే = నిందితగతి నుండి రక్షించు వాడా! అన్ధసః పతే = అన్నాదులకుస్వామీ! దరిద్రి = దరిద్రమును పొందినవాడా! నీలలోహిత = నీలవర్ణ పదార్థముల సేవించు రాజా! లేక ప్రజా! నీవు, ఆసాం ప్రజానామ్ = ఈ ప్రత్యక్ష మానవులను, చ ఏషాం పశునామ్ = మఱియు నీ గవాదిపశువులను రక్షించుము వీని నుండి,మాభేః = భయమును పొందకుము. మా రోక్ = రోగివి కాకుండుము. నః = మమ్ము. కిమ్ చన = అన్యులెవరిని కూడ, మో ఆమమత్ = రోగులుగ నొనర్చకుము ॥౪౭॥

భావార్థము :-ధనాఢ్యులు దరిద్రులను పాలించ వలయును. రాజు రాజపురుషులు ప్రజలను పశువుల నెన్నటికి చంప కూడదు. అందువలన ప్రజలలో నందఱి సుఖము పెంపొందగలదు. ॥౪౭॥

---

౪౮.ఇమా రుద్రాయేత్యస్య పరమేష్ఠీ ప్రజాపతి ర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, ఆర్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

విద్వద్భిః కిం కార్య మిత్యుచ్యతే. విద్వాంసు లేమి చేయ వలెను ?

ఇమా రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహే మతీః ।
యథా శమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామేఽఅస్మిన్ననాతురమ్ ॥

ఇమాః, రుద్రాయ, తవసే, కపర్దినే, క్షయద్వీరాయేతి క్షయత్+వీరాయ, ప్ర, భరామహే, మతీః, యథా, శమ్, అసత్, ద్విపద ఇతి ద్వి+పదే, చతుష్పదే, చతుః పద ఇతి చతుః+పదే,విశ్వమ్, పుష్టమ్, గ్రామే, అస్మిన్,అనాతురమ్. (48)

పదార్థః :-(ఇమాః) ప్రజాః(రుద్రాయ)శత్రురోదకాయ (తవసే) బలిష్ఠాయ (కపర్దినే) కృతబ్రహ్మచర్యాయ(క్షయద్వీరాయ)క్షయన్తో దుష్టనాశకా వీరా యస్య తస్మై(ప్ర)(భరామహే)ధరామహే (మతీః)మేధావినః. మతయ ఇతి మేధావి నా... నిఘం.౩.౧౫(యథా)(శమ్) సుఖమ్(అసత్)భవేత్ (ద్విపదే)మనుష్యాద్యాయ(చతుష్పదే)గవాద్యాయ (విశ్వమ్) సర్వం జగత్(పుష్టమ్) రోగరహితత్వేన బలిష్ఠమ్(గ్రామే)బ్రహ్మాణ్డసమూహే(అస్మిన్)వర్తమానే(అనాతురమ్)అదుఃఖితమ్.॥౪౮॥అన్వయః :- హే వీర రుద్ర ! యథాఽస్మిన్ గ్రామేఽనాతురం పుష్టం విశ్వం శమసత్ తథా వయం ద్విపదే చతుష్పదే తవసే కపర్దినే క్షయద్వీరాయ రుద్రాయ చేమా మతీః ప్రభరామహే తథా త్వమస్మై ప్రభర. ॥౪౮॥ భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. విద్వద్భి ర్యథా ప్రజాసు స్త్రీపురుషా ధీమన్తః స్యు స్తథా ఽనుష్ఠాయ మనుష్యపశ్వాదియుక్తం రాజ్యం రోగరహితం పుష్టిమత్ సుఖి సతతం సమ్పాదనీయమ్. ॥౪౮॥

పదార్థము :—శత్రురోదకా ః వీరపురుషా ః యథా = ఎటుల, అస్మిన్ గ్రామే = ఈబ్రహ్మాండ సమూహమున, విశ్వమ్ = సకలజగత్తు, అనాతురం పుష్టమ్‌శమ్ = దుఃఖరహితము రోగరహితము బలిష్ఠమును సుఖంవతమును, అసత్ = అగునో, అటుల మేము,ద్విపదే = మనుష్యాదుల కొఱకు, చతుష్పదే = గవాదులకొఱకు, తవసే = బలిష్ఠుని కొఱకు, కపర్దినే = బ్రహ్మచర్యము నసుష్ఠించువాని కొఱకు,క్షయద్వీరాయ = దుష్టుల నాశనమొనర్చు వీరులను కలిగియున్నవాని కొఱకు, రుద్రాయ = పాపుల నేడిపించు సేనాపతి కొఱకు, ఇమాః మతీః = వివేకవంతులగు నీ ప్రజలను భరణపోషణ లొనర్చుచున్నామో,అటులనే మీరును దానిని భరించుడు. ॥౪౮॥

భావార్థము :—వాచకలుప్తోపమాలంకార మీ మంత్రమందున్నది. ప్రజలయందు స్త్రీపురుషులు వివేకవంతులగునటుల విద్వాంసు లనుష్ఠించి మనుష్యులతో పశువులతో నిండియున్న రాజ్యమును రోగ రహితముగ, పుష్టియుక్తముగ, నిరంతరసుఖిగ నొనర్చవలయును. ॥౪౮॥ (౮౩-౨)

---

౮౩౩ యాతే రుద్ర ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రా దేవతాః, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

యా తే రుద్ర శివా తనూః శివా విశ్వాహా భేషజీ ।

శివా రుతస్య భేషజీ తయా నో మృడ జీవసే ॥ ॥౪౯॥

యా, తే, రుద్ర, శివా, తనూః, శివా, విశ్వాహా, భేషజీ, శివా, రుతస్య, భేషజీ, తయా, నః మృడ, జీవసే. (49)

పదార్థః :—(యా)(తే)తవ(రుద్ర)రాజవైద్య(శివా)కల్యాణకారిణీ(తనూః) శరీరం విస్తృతా నీతి ర్వా(శివా)ప్రియదర్శనా(విశ్వాహా)సర్వాణి దినాని(భేషజీ)ఔషధానీవ రోగనివారికా(శివా)సుఖ ప్రదా(రుతస్య) రుగ్ణస్య. అత్ర పృషోదరాదిత్వాజ్జలోపః (భేషజీ) ఆధివినాశినీ (తయా) (నః)అస్మాన్ (మృడ)సుఖయ(జీవసే)జీవితుమ్. ॥౪౯॥ అన్వయః :—హే రుద్రః త్వం యా తే శివా తనూః శివా భేషజీ రుతస్య శివా భేషజ్యస్తి తయా జీవసే విశ్వాహా నో మృడ. ॥౪౯॥ భావార్థః :—రాజ వైద్యాది విద్వద్భి ర్ధర్మనీత్యౌషధిదానేన హస్తక్రియాకౌశలేన శస్త్రైశ్ఛిత్వా భిత్వా చ రోగేభ్యో నివార్య సర్వాః సేనాః ప్రజాశ్చ రక్షణీయాః. ॥౪౯॥

పదార్థము :—రుద్ర = రాజవైద్యా ! తే = నీయొక్క, శివా తనూః = కల్యాణ మొనగూర్చు దేహము లేక విస్తారయుక్తనీతి, శివా = చూచుటకు ప్రియమైనది, భేషజీ = ఓషధులవలె రోగనాశ నము, రుతస్య శివా = రోగికి సుఖదాయకము, భేషజీ = పీడనుహరించునదియునగు, యా = ఏది యున్నదో, తయా = దానిచే, జీవసే = జీవించుటకై, విశ్వాహా = సకలదినములు, నః = మమ్ము, మృడ = సుఖులుగ నొనర్చుము. ॥౪౯॥

భావార్థము :—రాజవైద్యుడు, విద్వాంసులు ధర్మనీతిగలపియు,ఔషధముల నిచ్చియు,చేతిపనుల నేర్పరితనముచేతను, శస్త్రములచే ఛేదన భేదనములొనర్చియు రోగములనుండి రక్షించి సేనను ప్రజ లను ప్రసన్నులుగ నొనర్చవలయును. ॥౪౯॥ (౮౩౩)

---

౮౦౪ ౫౦ ౹ ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

రాజపురుషైః కిం కార్య మిత్యాహ. రాజపురుషులు ఏమి చేయవలయును?

పరి ణో రుద్రస్య హేతి ర్వృణక్తు పరి త్వేషస్య దుర్మతి రఘాయోః ।
అవ స్థిరా మఘవద్భ్య స్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృడ ॥౫౦॥

పరి, నః రుద్రస్య, హేతిః, వృణక్తు, పరి, త్వేషస్య, దుర్మతిరితి దుః+ర్మతిః, అఘాయోః, అఘాయోరిత్యఘ+యోః, అవ, స్థిరా, మఘవద్భ్య ఇతి మఘవత్+భ్యః, తనుష్వ, మీఢ్వః, తోకాయ, తనయాయ, మృడ. (50)

పదార్థః :—(పరి)సర్వతః(నః)అస్మాన్ (రుద్రస్య)సభేశస్య(హేతిః)వజ్రః (వృణక్తు)పృథక్ కరోతు(పరి) (త్వేషస్య) క్రోధాదినా ప్రదీప్తస్య(దుర్మతిః)దుష్టబుద్ధిః (అఘాయోః) ఆత్మనోఽఘమి చ్ఛో ర్దుష్టాచారిణః(అవ)(స్థిరా)నిశ్చలా(మఘవద్భ్యః)పూజితధనేభ్యః(తనుష్వ)విస్తృణు(మీఢ్వః) సుఖసేచక(తోకాయ)సద్యో జాతాయ బాలకాయ(తనయాయ) కుమారాయ(మృడ) ఆనన్దయ. ॥౫౦॥

అన్వయః :—హే మీఢ్వో ! భవాన్ యో రుద్రస్య హేతి స్తేన త్వేషస్యాఘాయోః సకాశాన్నః పరివృణక్తు యా దుర్మతి ర్భవే త్తస్యాశ్చాస్మాన్ పరివృణక్తు. యా చ మఘవద్భ్యః ప్రాప్తా స్థిరా మతి రస్తి తాం తోకాయ తనయాయ పరి తనుష్వైతయా సర్వాన్ సతత మవమృడ. ॥౫౦॥ భావార్థః :— రాజపురుషాణాం తదేవ ధర్మ్యం సామర్థ్యం యేన ప్రజారక్షణం దుష్టానాం హింసనం చ స్యాత్తతః స ర్వైర్విద్యాః సర్వేషా మారోగ్యం స్వాతన్త్ర్యసుఖోన్నతిం చ కుర్యు ర్యేన సర్వే సుఖినో భవేయుః.॥౫౦॥

పదార్థము :—మీఢ్వః = సుఖమునువర్షింపజేయురాజపురుషా ! నీవు, రుద్రస్య = సభాపతియగు రాజుయొక్క, హేతిః = ఏ వజ్రమున్నదో దానిచే, త్వేషస్య = క్రోధాదులతో మండిపడువాడు, అఘాయోః = తానే కోరి దుష్టాచారములొనర్చువాడునగు పురుషుని సంబంధమునుండి, నః = మమ్ము, పరి వృణక్తు = అన్ని విధముల దూరముగ నుంచుము. దుర్మతిః = దుష్టబుద్ధినుండి మమ్ము రక్షింపుము, మఘవద్భ్యః = ప్రశంసితధనవంతులనుండి లభించిన, స్థిరా = ఏస్థిరమైనబుద్ధికలదో దానిని,తోకాయ = శీఘ్రముగ జనించు బాలకునికై, తనయాయ = కుమారునికై, పరి తనుష్వ = అన్నివైపులనుండి విస్తృతపఱుపుము. మఱియు నాబుద్ధిచే నందఱిని నిరంతరము,అవ మృడ = సుఖవంతులగజేయుము.

భావార్థము :—ప్రజారక్షణ దుష్టశిక్షణ జరుపుటయే రాజపురుషుల ధర్మయుక్త పురుషార్థము. దానివలన శ్రేష్ఠపైద్యులు అందరు సుఖముగనుండునటుల వారి ఆరోగ్యమును, స్వాతంత్ర్యసుఖమును పెంచగలరు. ॥౫౦॥ (౮౩౪)

---

౮౩౫ మీఢుష్టమ ఇత్యస్య పరమేష్ఠీ ప్రజాపతిర్వా దేవా ఋషయః, రుద్రో దేవతా, నిచృదార్షీ యవమధ్యా త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

సభాధ్యక్షాదిభిః కిం కార్య మిత్యాహ. సభాధ్యక్షాదు లేమి చేయవలయును ?

మీఢుష్టమ శివతమ శివో నః సుమనా భవ । పరమే వృక్ష ఆయుధన్నిధాయ
కృత్తిం వసాన ఆ చర పినాక మ్బిభ్రదా గహి ॥ ॥౫౧॥

శత్రువులను, నిగ్రాభేణ = పరాజయముచే, అధరాన్ = అధఃపతితులుగ, అసః = ఒనర్చునో అత నిని ప్రజలు సేనాపతిగ నొనర్చుదు. ॥౬౩॥

భావార్థము:—వాచకలుప్తోపమాలంకార ముందున్నది. ఈశ్వరుడు పాలించునట్లుగ నే పురుషులు ధార్మికులు చక్కగ గ్రహించెదరో, మఱియు దండించుటకు దుష్టులను నిగ్రహించి అవమాన పఱచెదరో అట్టివారే రాజ్యమొనర్చగలుగుచున్నారు. ॥౬౩॥ (౯౧౩)

---

౬౪ ఉద్గ్రాభమిత్యస్య విధృతి ఋషిః, ఇన్ద్రాగ్నీ దేవతే, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, స్వరః.
పున స్తత్రైవ రాజధర్మ ఉప దిశ్యతే. ఈ మంత్రమందు రాజధర్మము ఉపదేశించబడినది.

ఉద్గ్రాభం చ నిగ్రాభం చ బ్రహ్మ దేవా అవీవృధన్ ।
అథా సపత్నానిన్ద్రాగ్నీ మే విషూచీనాన్వ్యస్యతామ్ ॥ ॥౬౪॥

ఉద్గ్రాభమిత్యుత్+గ్రాభమ్, చ, నిగ్రాభమితి, ని+గ్రాభమ్, చ, బ్రహ్మ, దేవాః, అవీవృధన్, అథ, సపత్నానితి, స+పత్నాన్, ఇన్ద్రాగ్నీ, ఇతీన్ద్రాగ్నీ, మే, విషూచీనాన్, వి, అస్యతామ్. (64)

పదార్థః :—(ఉద్గ్రాభమ్) ఉత్కృష్టతయా గ్రహణమ్ (చ) (నిగ్రాభమ్) నిగ్రహమ్ (చ) (బ్రహ్మ)ధనమ్(దేవాః)విద్వాంసః(అవీవృధన్)వర్ధయన్తు(అథ) అథ, అత్ర నిపాతస్య చేతి దీర్ఘః (సపత్నాన్)అరీన్(ఇన్ద్రాగ్నీ) విద్యుత్పావకావివ సేనాపతీ(మే)మమ (విషూచీనాన్) విరుద్ధమాచరతః(వి)(అస్యతామ్). ॥౬౩॥ అన్వయః :—దేవా ఉద్గ్రాభం చ నిగ్రాభం చ కృత్వా బ్రహ్మావీవృధన్ అథాథ సేనాపతీ ఇన్ద్రాగ్నీ ఇవ మే విషూచీనా న్సపత్నాన్ వ్యస్యతా ముత్క్షిపతామ్. ॥౬౪॥
భావార్థః :—యే మనుష్యాః ! సజ్జనాన్ సత్కృత్య దుష్టాన్ నిహత్య బ్రహ్మ వర్ధయిత్వా నిష్కణ్టకం రాజ్యం సంపాదయన్తి త ఏవ ప్రశంసితాః. యో రాజా రాష్ట్రవాసినః సజ్జనాన్ సత్కృత్య దుష్టాన్నిరస్యైశ్వర్యం వర్ధయతి తస్యైవ సభా సేనాపతీ శత్రునాశం కర్తుం శక్నుయాతామ్.

పదార్థము :—దేవాః = విద్వాంసులు,ఉద్గ్రాభమ్ చ = అత్యంతోత్సాహముతో గ్రహణమొనర్చియు, నిగ్రాభం చ = త్యాగమొనర్చియు, బ్రహ్మ = ధనమును, అవీవృధన్ = వృద్ధి యొనర్చ వలయును. అధ = తదనంతరము, ఇంద్రాగ్నీ = విద్యుత్తుల్యుడు, అగ్నితుల్యుడునైన యిరువురు సేనాపతులు, మే = నా యొక్క, విషూచీనాన్ = విరోధ భావముతో వర్తించు, సపత్నాన్ = వైరులను, వ్యస్యతామ్ = బాగుగ ఛిత్తొత్తి పడవేయ వలయును. ॥౬౪॥

భావార్థము :—ఏ మానవులు సజ్జనులను సత్కరించియు, దుష్టులను బాగుగ దండించియు 'నిష్కంటకమగు రాజ్యమును సంపాదించుదురో వారే ప్రశంసితులగుచున్నారు. ఏ రాజు రాజ్యములో నివసించు సజ్జనుల సత్కరించి, దుష్టులను నిరాదరించి తన వైభవమును, ప్రజల ఐశ్వర్యమును వృద్ధియొనర్చునోరో అతని సభాపతి సేనాపతులు శత్రువులను నాశన మొనర్చ గలుగుచున్నారు.॥౬౪॥

---

౬౫ క్రమధ్వమిత్యస్య విధృతి ఋషిః, అగ్నిర్ దేవతా, విరాడార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

క్రమధ్వమగ్నినా నాకముఖ్యꣳ హస్తేషు బిభ్రతః ।
దివస్పృష్ఠꣳ స్వర్గత్వా మిశ్రా దేవేభి రాధ్వమ్ ॥ ॥౬౫॥

క్రమధ్వమ్, అగ్నినా, నాకమ్, ఉఖ్యమ్, హస్తేషు, బిభ్రతః, దివః, పృష్ఠమ్, స్వః, గత్వా, మిశ్రాః, దేవేభిః, ఆధ్వమ్. (65)

పదార్థః :-(క్రమధ్వమ్) పరాక్రమం కురుత (అగ్నినా)విద్యుతా (నాకమ్) అవిద్యమాన దుఃఖమ్ (ఉఖ్యమ్) ఉఖాయాం సంస్కృతం భక్ష్యమోదనాదికమ్. అత్ర ఘూరోఖా ద్యత్. అ.౪.౨.౧౩ అనేన సంస్కృతం భక్షా ఇత్యర్థే యత్ (హస్తేషు) (బిభ్రతః) ధరన్తః (దివః) న్యాయవినయాది ప్రకాశ జాతస్య (పృష్ఠమ్) జ్ఞీప్సితమ్ (స్వః) సుఖమ్ (గత్వా) ప్రాప్య (మిశ్రాః) మిలితాః (దేవేభిః) విద్వద్భిః (ఆధ్వమ్) ఉపవిశత. ॥౬౫॥ అన్వయః :-హే వీరాః యూయ మగ్నినా నాకముఖ్యం చ హస్తేషు బిభ్రతో ధరన్తః క్రమధ్వం దేవేభి ర్మిశ్రాః సన్తో దివస్పృష్ఠం స్వర్గత్వాధ్వమ్. భావార్థః :-రాజపురుషా విద్వద్భిః సహ సంప్రయోగేణాగ్నేయాస్త్రాదినా శత్రుషు పరాక్రమన్తాం స్థిరం సుఖం ప్రాప్య పునః పునః ప్రయతేరన్. ॥౬౫॥

పదార్థము :- వీరులారా ! మీరు, అగ్నినా = విద్యుత్తుచే, నాకమ్ = అత్యంత సుఖమును మఱియు, ఉఖ్యమ్ = పాత్రయందు పచన మొనర్చబడిన అన్నము, పప్పు, కూర, పులుసు మొదలగు భోజనములను, హస్తేషు = హస్తములందు, బిభ్రతః = ధారణ మొనర్చినవారలై, క్రమధ్వమ్ = పరాక్రమించుడు. దేవేభిః = విద్వాంసులతో, మిశ్రాః = కలిసినవారలై, దివః = న్యాయ వినయాది గుణముల ప్రకాశముచే పుట్టిన దివ్యమును, పృష్ఠమ్ = జ్ఞీప్సితమును నగు, స్వః = సుఖమును, గత్వా = పొంది, ఆధ్వమ్ = స్థితులగుడు. ॥౬౫॥

భావార్థము :- రాజపురుషులు విద్వాంసులతో సంబంధ మేర్పఱచుకొని ఆగ్నేయాద్యస్త్రములతో విరోధుల మీదకు పరాక్రమించవలయును. స్థిర సుఖమును పొంది మాటి మాటికి మంచి ప్రయత్నము లొనర్చవలయును. ॥౬౫॥ (౯౧౫)

---

౯౧౬ ప్రాచీమిత్యస్య విధృతి ఋషిః, అగ్నిర్ దేవతా,నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

ప్రాచీమను ప్రదిశం ప్రేహి విద్వానగ్నే రగ్నే పురో అగ్ని ర్భవేహ ।
విశ్వా ఆశా దీద్యానో వి భాహ్యూర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే ॥

ప్రాచీమ్, అను, ప్రదిశమితి ప్ర+దిశమ్, ప్ర, ఇహి, విద్వాన్, అగ్నేః,అగ్నే, పురో అగ్నిరితి పురః+అగ్నిః, భవ, ఇహ, విశ్వాః, ఆశాః, దీద్యానః, వి, భాహి, ఊర్జమ్, నః, ధేహి, ద్వి+పదే, చతుష్పదే, చతుఃపద ఇతి చతుః + పదే. (66)

పదార్థః :-(ప్రాచీమ్) పూర్వామ్ (అను) (ప్రదిశమ్) ప్రకృష్టాం దిశమ్ (ప్ర) (ఇహి) ప్రా

వున్నహి (విద్వాన్) (అగ్నేః) ఆగ్నేయాస్త్రాదియోగాత్ (అగ్నే) శత్రుదాహక (పురో అగ్నిః) అగ్రగన్తా పావక ఇవ (భవ) (ఇహ) అస్మిన్ రాజ్యవ్యవహారే (విశ్వాః) అఖిలాః (ఆశాః) దిశః. ఆశా ఇతి దిఙ్నామ, నిఘం. ౧. ౬. (దీద్యానః) దేదీప్యమానః సూర్య ఇవ (వి భాహి) ప్రకాశయ (ఊర్జమ్) అన్నాదికమ్ (నః) అస్మాకమ్ (ధేహి) (ద్విపదే) మనుష్యాద్యాయ (చతుష్పదే) గవాద్యాయ ॥౬౬॥

అన్వయః :— హే అగ్నే సభేశ ! త్వం ప్రాచీం ప్రదిశ మనుప్రేహి. త్వమిహాగ్నేః పురో అగ్నిరివ విద్వాన్ భవ. విశ్వా ఆశా దీద్యానః సన్ నోఽస్మాకం ద్విపదే చతుష్పదే ఊర్జ ధేహి విద్యా వినయ పరాక్రమైరభయం విభాహి. ॥౬౬॥ భావార్థః :— యే పూర్ణేన బ్రహ్మచర్యేణ సర్వా విద్యా అధీత్య యుద్ధవిద్యాం విదిత్వా సర్వాసు దిక్షు స్తూయన్తే తే మనుష్యాణాం పశ్వాదీనాం చ భక్ష్యభోజ్య మున్నీయ రక్షాం విధాయానన్దితా భవన్తు. ॥౬౬॥

పదార్థము — అగ్నే = శత్రువులను దహన మొనర్చు నో సభాపతీ ! నీవు, ప్రాచీమ్ ప్రదిశమ్ = తూర్పు దిక్కు వైపును, అను ప్ర ఇహి = అనుకూలముగ పొందుము. ఇహ = ఈ రాజ్య కార్యమునందు. అగ్నేః = ఆగ్నేయాస్త్రాదుల యోగముచే, పురో అగ్నిః = అగ్నివలె అగ్రగామివి, విద్వాన్ = శాస్త్రజ్ఞుడవగు విద్వాంసుడవు, భవ = కమ్ము. విశ్వాః ఆశాః = సకల దిశలను, దీద్యానః = నిరంతరము ప్రకాశమొనర్చుచున్న సూర్యునివలె, నః = మాయొక్క. ద్విపదే = మనుష్యాదులకు, చతుష్పదే = గవాది పశువులకు, ఊర్జమ్ = అన్నాది పదార్థములను, ధేహి = ధారణ మొనర్పుము. మఱియు విద్యా వినయ పరాక్రమములతో అభయమును, విభాహి = ప్రకాశింప జేయుము. ॥౬౬॥

భావార్థము :— పూర్ణ బ్రహ్మచర్యముతో సమస్త విద్యల నభ్యసించి, యుద్ధ విద్యల నెఱిగి దిశలందు స్తుతిని పొందుచున్నవారు మనుష్యాది పశువులకు భక్ష్య భోజ్యముల నభివృద్ధి పఱచియు, రక్షణ మొనర్చియు ఆనందితులగుదురు. ॥౬౬॥ (౯౧౬)

---

౯౧౭ పృథివ్యా ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, విరాడ్బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పున ర్యోగి గుణా ఉపదిశ్యన్తే. యోగి గుణములు ఉపదేశించబడుచున్నవి.

పృథివ్యా అహముదన్తరిక్షమారుహమన్తరిక్షాద్దివమారుహమ్ ।
దివో నాకస్య పృష్ఠాత్ స్వర్జ్యోతిరగామహమ్ ॥

పృథివ్యాః, అహమ్, ఉత్, అన్తరిక్షమ్, ఆ, అరుహమ్, అన్తరిక్షాత్, దివమ్, ఆ, అరుహమ్, దివః, నాకస్య, పృష్ఠాత్, స్వః, జ్యోతిః, అగామ్, అహమ్. (67)

పదార్థః :— (పృథివ్యాః) భూమేర్మధ్యే (అహమ్) (ఉత్) (అన్తరిక్షమ్) ఆకాశమ్ (ఆ) (అరుహమ్) రోహేయమ్ (అన్తరిక్షాత్) ఆకాశాత్. (దివమ్) ప్రకాశమానం సూర్యమ్ (ఆ) (అరుహమ్) సమన్తాద్రోహేయమ్ (దివః) ద్యోతమానస్య (నాకస్య) సుఖనిమిత్తస్య (పృష్ఠాత్) సమీపాత్ (స్వః) సుఖమ్ (జ్యోతిః) జ్ఞానప్రకాశమ్ (అగామ్) ప్రాప్నుయామ్ (అహమ్). ॥౬౭॥ అన్వయః :— హే మనుష్యాః ! యథా కృతయోగాఙ్గానుష్ఠాన సంయమసిద్ధోఽహం పృథివ్యా అన్తరిక్ష ముదారుహ మన్తరిక్షాద్దివ మారుహం నాకస్య దివః పృష్ఠాత్ స్వర్జ్యోతిశ్చాహమగాం తథా యూయ మప్యాచరత. ॥౬౭॥

భావార్థః :—యదా మనుష్యః స్వాత్మనా సహ పరమాత్మానం యుఙ్క్తే తదాఽణిమాదయః సిద్ధయః ప్రాదుర్భవన్తి తతోఽవ్యాహత గత్యాభీష్టాని స్థానాని గన్తుం శక్నోతి నాన్యథా. ॥౬౭॥

పదార్థము :- మానవులారా ! యోగాంగానుష్ఠాన మొనర్చిన వాడను, ధారణా ధ్యాన సమాధులలో పరిపూర్ణుడను, సంయమ సిద్ధుడను నగు, అహమ్ = నేను, ఏటుల పృథివ్యాః = భూమండలమునుండి, అంతరిక్షమ్ = ఆకాశమునకు, ఉత్ ఆ అరుహమ్ = ఎగిరిపోవుదునో, అంతరిక్షాత్ = ఆకాశమునుండి, దివమ్ = ప్రకాశమానమగు సూర్యలోకమునకు, ఆరుహమ్ = అధిరోహించెదనో, నాకస్య = సుఖము చేకూర్చునది, దివః = ప్రకాశవంతమునగు ఆ సూర్యలోకముయొక్క, పృష్ఠాత్ = సమీపమునుండి, స్వః = అత్యంత సుఖమును, జ్యోతిః = జ్ఞాన ప్రకాశమును, అహమ్ = నేను, అగామ్ = పొందుదునో, అటుల మీరును ఆచరించుడు. ॥౬౭॥

భావార్థము :—మానవుడెప్పుడు తన యాత్మతో పాటు పరమాత్మ ప్రాప్తి పొందుచున్నాడో, అప్పుడతనికి అణిమాదిసిద్ధులు లభించుచున్నవి. తదనంతరము అవ్యాహత గతితో నభీష్టస్థానములకు పోగలుగుచున్నాడు. ఇంకొక విధముగ పోజాలడు. ॥౬౭॥ (౬౧౭)

---

౬౮ స్వర్యన్త ఇత్యస్య విధృతి ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

స్వ॒ర్యన్తో॒ నాపే॑క్షన్త॒ఽఆ ద్యాꣳ రో॑హన్తి॒ రోద॑సీ ।

య॒జ్ఞం యే వి॒శ్వతో॑ధార॒ꣳసువి॑ద్వాꣳ సో వితేని॒రే ॥ ॥౬౮॥

స్వః, య॒న్తః, న, అప, ఈ॒క్ష॒న్తే॒, ఆ, ద్యామ్, రో॒హ॒న్తి॒, రోద॑సీ ఇతి॒ రోద॑సీ, య॒జ్ఞమ్, యే, వి॒శ్వతో॑ధార॒మితి వి॒శ్వతః+ధార॑మ్, సువి॑ద్వాꣳస॒ ఇతి॒ సు+వి॒ద్వాꣳసః, వి॒తే॒ని॒ర ఇతి వి+తే॒ని॒రే. (68)

పదార్థః :-(స్వః) సుఖమ్ (యన్తః) ఉపయన్తః (న) ఇవ (అప) (ఈక్షన్తే) సమాలోకన్తే (ఆ) సమన్తాత్ (ద్యామ్) ప్రకాశమయీం యోగవిద్యామ్ (రోహన్తి) (రోదసీ) ద్యావాపృథివ్యౌ (యజ్ఞమ్) సంగంతవ్యమ్ (యే) (విశ్వతోధారమ్) విశ్వతః సర్వతో ధారాః సుశిక్షితా వాచో యస్మిం స్తమ్ (సువిద్వాంసః) శోభనాశ్చ తే యోగినః (వితేనిరే) విస్తృతం కుర్వన్తి. ॥౬౮॥ అన్వయః:- యే సువిద్వాంసో యన్తో న స్వరపేక్షన్తే రోదసీ ఆరోహన్తి ద్యాం విశ్వతోధారం యజ్ఞం వితేనిరే తేఽక్షయం సుఖం లభన్తే. ॥౬౮॥ భావార్థః :—అత్రోపమాలంకారః. యథా సారథిరశ్వాన్ సుశిక్ష్యాభీష్టే మార్గే చాలయిత్వా సుఖేనాభీష్టం స్థానం సద్యో గచ్ఛతి తథైవ శోభనా విద్వాంసో యోగినో జితేన్ద్రియా భూత్వా సంయమేన స్వేష్టం పరమాత్మానం ప్రాప్యానన్దం విస్తారయన్తి.

పదార్థము :— యే సువిద్వాంసః = ఏ సువిద్వాంసులు. యంతః న = యోగాభ్యాసపు పూర్ణ నియమము లొనర్చువాని వలె, స్వః = అత్యంత సుఖమును, అప ఈక్షితే = అపేక్షించుచున్నాలో లేక, రోదసీ = ఆకాశమును పృథివిని. ఆ రోహంతి = అధిరోహించెదరో అనగా లోకలోకాంతరములకు స్వేచ్ఛా పూర్వకముగ వెళ్లుదురో, ద్యామ్ = ప్రకాశమయ మగు యోగ విద్యను,

విశ్వతోధారమ్ = అన్ని దిక్కులనుండి సుశిక్షయుక్త వాణులు కలిగియున్నది, యజ్ఞమ్ = పొందదగినదియు నగు ఆ యజ్ఞాది కర్మ[ల]ను, వితేనిరే = విస్తరింపజేయుచున్నారో, వారు అవినాశమైన సుఖమును పొందగలుగు చున్నారు. ॥౬౮॥

భావార్థము :—ఉపమాలంకార మిందున్నది. ఎటుల సారథి అశ్వములను బాగుగ శిక్షగఱపి, అభీష్టమార్గములందు నడిపించి, సుఖముగ నభీష్ట స్థానమునకు శీఘ్రముగ చేరుచున్నాడో, అటులనే శోభన విద్వాంసులు యోగులు జితేంద్రియులు నై సంయమముచే తా మభిలషించు పరమాత్మని పొంది ఆనందమును విస్తరింపజేయుచున్నారు. ॥౬౮॥ (౬౧౮)

---

౬౯ అగ్నే ఇత్యస్య విధృతి ఋషిః, అగ్నిర్ దేవతా, భురిగార్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పున ర్విద్వద్వ్యవహార ఉపదిశ్యతే. విద్వాంసుని వ్యవహార ముపదేశింప బడుచున్నది.

అగ్నే ప్రేహి ప్రథమో దేవయతాం చక్షు ర్దేవా నాముత మర్త్యానామ్ ।

ఇయక్షమాణా భృగుభిః సజోషాః స్వర్యన్తు యజమానాః స్వస్తి ॥

అగ్నే, ప్ర, ఇహి, ప్రథమః, దేవయతామితి దేవ+యతామ్, చక్షుః, దేవానామ్, ఉత, మర్త్యానామ్, ఇయక్షమాణాః. భృగుభిరితి భృగు+భిః, సజోషా ఇతి స+జోషాః, స్వః, యన్తు; యజమానాః, స్వస్తి: (69)

పదార్థః :—(అగ్నే) విద్వన్ (ప్ర) (ఇహి) ప్రాప్నుహి (ప్రథమః) ఆదిమః (దేవయతామ్) కామయమానానామ్ (చక్షుః) దర్శకమ్ (దేవానామ్) విదుషామ్ (ఉత) అపి (మర్త్యానామ్) అవిదుషామ్ (ఇయక్షమాణాః) యజ్ఞం చికీర్షమాణాః (భృగుభిః) పరిపక్వ విజ్ఞానై ర్విపశ్చిద్భిః (సజోషాః) సమానప్రీతి సేవనాః (స్వః) సుఖమ్ (యన్తు) ప్రాప్నువన్తు (యజమానాః) సర్వేభ్యః సుఖదాతారః (స్వస్తి) కల్యాణమ్. ॥౬౯॥ అన్వయః :—హే అగ్నే ! దేవయతాం మధ్యే ప్రథమః పూర్వం ప్రేహి యతో దేవానా ముత మర్త్యానాం త్వం చక్షు రసి యథేయక్షమాణాః సజోషా యజమానా భృగుభిః సహ స్వస్తి స్వ ర్యన్తు తథా త్వమపి భవ. ॥౬౯॥ భావార్థః :— హే మనుష్యాః ! విద్వద్భి రవిద్వద్భిశ్చ సహ ప్రీత్యోపదేశేన యూయం సుఖం ప్రాప్నుత

పదార్థము :—అగ్నే = విద్వాంసుడా ! దేవయతామ్ = కామించు జనులమధ్య నీవు, ప్రథమః = ముందు. ప్రేహి = లభించుము. దావిలయన, దేవానామ్ ఉత = విద్వాంసుల యొక్కయు. మర్త్యానామ్ = అవిద్వాంసులయొక్కయు వ్యవహారములను నీవు చూచువాడవై యున్నావు. ఎటుల, ఇయక్షమాణాః = యజ్ఞేచ్ఛ యొనరించువారు, సజోషాః = సమాన ప్రీతిగలవారు, యజమానాః = అందరకు సుఖము నిచ్చువారు, భృగుభిః = పరిపూర్ణ విజ్ఞానమును కలిగియున్న విద్వాంసులతో పాటు, స్వస్తి = సామాన్య సుఖమును, యన్తు = పొందుదురో అటులనే నీవును కమ్ము. ॥౬౯॥

భావార్థము :— మానవులారా ! మీరు విద్వాంసులతోను అవిద్వాంసులతోను ప్రేమతో సంభాషించి సుఖమును పొందుడు. ॥౬౯॥ (౬౧౯)

---

౭౦ం సక్తోష ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్ దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునర్మనుష్యైః కథం వర్తితవ్య మిత్యాహ. మానవు లెటుల మెలగవలయును ?

నక్తోషాసా సమనసా విరూపే ధాపయేతే శిశుమేకꣳ సమీచీ ।

ద్యావాక్షామా రుక్మోఽఅన్తర్విభాతి దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదాః ॥

నక్తోషాసా, నక్తోషసేతి నక్తోషసా, సమనసేతి స+మనసా, విరూపే ఇతి విరూపే, ధాపయేతే ఇతి ధాపయేతే, శిశుమ్, ఏకమ్, సమీచీ ఇతి సమ్+ఈచీ, ద్యావాక్షామా, రుక్మః, అన్తః, వి, భాతి, దేవాః, అగ్నిమ్, ధారయన్, ద్రవిణోదా ఇతి ద్రవిణః+దాః.

పదార్థః :—(నక్తోషాసా) రాత్ర్యుషసావివ (సమనసా) సమానం మనో విజ్ఞానం యయో స్తే (విరూపే) విరుద్ధస్వరూపే (ధాపయేతే) పాయయతః (శిశుమ్) బాలకమివ వర్తమానం జగత్ (ఏకమ్) అసహాయమ్ (సమీచీ) యే ఏకీభావ మిచ్ఛన్తస్తే (ద్యావాక్షామా) (రుక్మః) దేదీప్యమానోఽగ్నిః (అన్తః) మధ్యే (విభాతి) విశేషేణ ప్రకాశతే (దేవాః) విద్వాంసః (అగ్నిమ్) (ధారయన్) అధారయన్ అలాధిడభావః(ద్రవిణోదాః) ద్రవ్యప్రదాతారః. ॥౨౦॥ అన్వయః :—హే మనుష్యా యూయం యథా సమనసా సమీచీ విరూపే మాతృధాత్ర్యా వైకం శిశు మివ నక్తోషాసా జగద్ధాపయేతే యథా వా ద్యావాక్షామాన్తో రుక్మో విభాతి ద్రవిణోదా దేవా తమగ్నిం ధారయం స్తథా వర్తధ్వమ్. ॥౨౦॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. మనుష్యై ర్జగతి యథా రాత్ర్యుషసౌ విరుద్ధే రూపే వ్వర్తతే యథా చ విద్యుత్ సర్వపదార్థేషు వ్యాప్తా యథా వా ద్యావాభూమీ అతిసహన శీలే వర్తేతే తద్వత్ వివేచకైః శుభగుణేషు వ్యాపకై ర్భూత్వా పుత్రవ జ్జగత్పాలనీయమ్. ॥౨౦॥

పదార్థము :— మానవులారా ! ఎటుల, సమనసా = ఒకే విజ్ఞానము కలిగిన వారు, సమీచీ = ఐకమత్యము నభిలషించువారు, విరూపే = వేర్వేరు రూపములు గలిగినవారు నగు దాదియు తల్లియు నిరువురు, ఏకమ్ శిశుమ్ = ఒక శిశువునకు పాలు త్రాగించు చున్నారో అటులనే, నక్తోషాసా = రాత్రి ప్రాతఃకాల వేళలు జగత్తును, ధాపయేతే = పాలు మాదిరిగ త్రాగించు చున్నవి. అనగ ఆత్యానంద మొసగుచున్నవి, లేక ఎటుల, రుక్మః = ప్రకాశమానమైన అగ్ని, ద్యావాక్షామా అంతః = బ్రహ్మాండ మధ్యమున, వి భాతి = విశేషించి ప్రకాశ మొనరించు చున్నదో, అగ్నిమ్ = ఆ యగ్నిని, ద్రవిణోదాః = ద్రవ్యమొసగు వారు, దేవాః = శాస్త్రాధ్యయన మొనర్చినవారు, ధారయత్ = ధారణ మొనర్చు చున్నారో, అటులనే ప్రవర్తించుడు. ॥౨౦॥

భావార్థము :— వాచక లుప్తోపమాలంకార మిందున్నది. జగతి యందెటుల రాత్రి ప్రాతఃకాలములు విరుద్ధ రూపములు గలిగియున్నవో, ఎటుల విద్యుత్తు సకల వస్తువులందు వ్యాప్తమై యున్నదో, ఎటుల ప్రకాశము భూమి అత్యంత సహనశీలములై యున్నవో అటులనే మానవులు అత్యంత వివేచన మొనర్చువారు, శుభగుణములందు వ్యాపకులు నై పుత్రునివలె జగత్తును పాలించవలెను.

---

౯౨౧ అగ్నే ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్ దేవతా, భురిగార్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః. పునర్యోగి కర్మఫల ముపదిశ్యతే. యోగియొక్క కర్మల ఫలితము లుపదేశించబడుచున్నవి.

అగ్నే సహస్రాక్ష శతమూర్ధఞ్ఛతం తే ప్రాణాః సహస్రం వ్యానాః ।
త్వꣳ సాహస్రస్య రాయ ఈశిషే తస్మై తే విధేమ వాజాయ స్వాహా ॥

అగ్నే, సహస్రాక్షేతి సహస్ర+అక్ష, శతమూర్ద్ధన్నితి శత+మూర్ధన్, శతమ్, తే, ప్రాణాః, సహస్రమ్, వ్యానా ఇతి వి+అనాః, త్వమ్, సాహస్రస్య, రాయః, ఈశిషే, తస్మై, తే, విధేమ, వాజాయ, స్వాహా. (71)

పదార్థః :—(అగ్నే) పావక ఇవ ప్రకాశమయ (సహస్రాక్ష) సహస్రేష్వసంఖ్యాతేషు వ్యవహారేష్వక్షి విజ్ఞానం యస్య తత్సమ్బుద్ధౌ (శతమూర్ధన్) శతేష్వసంఖ్యాతేషు మూర్ధా మస్తకం యస్య తత్సమ్బుద్ధౌ (శతమ్) అసంఖ్యాతాః (తే) తవ (ప్రాణాః) జీవనసాధనాః (సహస్రమ్) అసంఖ్యాః (వ్యానాః) చేష్టానిమిత్తాః సర్వశరీరస్థా వాయవః (త్వమ్) (సాహస్రస్య) సహస్రాణామసంఖ్యాతానామిద మధికరణం జగత్ తస్య (రాయః) ధనస్య (ఈశిషే) ఈశోఽసి (తస్మై) (తే) తుభ్యమ్ (విధేమ) పరిచరేమ (వాజాయ) విజ్ఞానవతే (స్వాహా) సత్యయా వాచా. ॥౭౧॥ అన్వయః :— హే సహస్రాక్ష శతమూర్ధన్నగ్నే యోగిరాజ ! యస్య తే శతం ప్రాణాః సహస్రం వ్యానాః సన్తి యస్త్వం సాహస్రస్య రాయ ఈశిషే తస్మై వాజాయ తే వయం స్వాహా విధేమ. ॥౭౧॥ భావార్థః :— యో యోగీ తపః - ఆది - సాధనై ర్యోగబలం ప్రాప్యాసంఖ్యప్రాణిశరీరాణి ప్రవిశ్యానేక నేత్రాదిభి ర్దర్శనాది కార్యాణి కర్తుం శక్నోతి. అనేకేషాం పదార్థానాం ధనానాం చ స్వామీ భవతి సోఽస్మాభి రవశ్యం పరిచరణీయః. ॥౭౧॥

పదార్థము :— సహస్రాక్ష = వేలకొలది వ్యవహారములందు స్వకీయ విశేష జ్ఞానము కలిగి యున్నవాడా ! శతమూర్ధన్ = వందల ప్రాణులలో మస్తకము గలవాడా ! అగ్నే = అగ్నివలె ప్రకాశమానుడవగు నో యోగిరాజా ! తే = ఏ నీయొక్క, శతమ్ ప్రాణాః = వందలకొలది జీవనపు సాధనములున్నవో, సహస్రమ్ వ్యానాః = సకల క్రియలకు నిమిత్తములైన శరీరస్థవాయువు లున్నవో, మఱియు, త్వమ్ = ఏ నీవు, సాహస్రస్య = వేలకొలది జీవములకు పదార్థములకు ఆధారమైన జగత్తు యొక్క, రాయః = ధనమునకు, ఈశిషే = అధికారివై యున్నావో, తస్మై వాజాయ తే = అట్టి విశేష జ్ఞానము గల నీకై మేము, స్వాహా = సత్యవాణితో, విధేమ = సత్కార పూర్వకముగ వ్యవహరించెదము గాక ! ॥౭౧॥

భావార్థము :— ఏ యోగి తపః స్వాధ్యా యేశ్వర ప్రణిధానాది యోగ సాధనములచే యోగ (ధారణా ధ్యాన సమాధిరూప సంయమముల) బలమును పొంది యనేక ప్రాణుల శరీరములలో ప్రవేశించి అనేక శిరస్సులతో, నేత్రా ద్యంగములతో దర్శనాది కార్యముల నొనరించుటకు శక్తి మంతు డగుచున్నాడో, అనేక పదార్థములకు ధనములకు స్వామియు కాగలుగుచున్నాడో, అతనికి మనము తప్పక పరిచర్య యొనరించవలయును. ॥౭౧॥ (౭౨)

---

౭౨ సుపర్ణ ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదార్షీ పంక్తి శ్ఛందః, పఞ్చమః స్వరః.

పున ర్విద్వాన్ కీదృశః స్యాదిత్యాహ. విద్వాంసు డెటు లుండవలయును ?

సుపర్ణో ఽసి గరుత్మాన్ పృష్ఠే పృథివ్యాః సీద । భాసా ఽన్తరిక్షమా
పృణ జ్యోతిషా దివముత్తభాన తేజసా దిశ ఉద్దృꣳహ ॥ ॥౭౨॥

సుపర్ణః, అసి, గరుత్మానితి గరుత్మాన్, పృష్ఠే, పృథివ్యాః, సీద, భాసా,
అన్తరిక్షమ్, ఆ, పృణ, జ్యోతిషా, దివమ్, ఉత్, స్తభాన, తేజసా, దిశః, ఉత్, దృꣳహ.

పదార్థః :—(సుపర్ణః) శోభనాని పర్ణాని పూర్ణాని శుభలక్షణాని యస్య సః (అసి)(గరుత్మాన్) గుర్వాత్మా (పృష్ఠే) ఉపరి (పృథివ్యాః) (సీద) (భాసా) ప్రకాశేన(అన్తరిక్షమ్) ఆకాశమ్ (ఆ) సమన్తాత్ (పృణ) సుఖయ (జ్యోతిషా) న్యాయప్రకాశేన (దివమ్) ప్రకాశమయమ్ (ఉత్) ఊర్ధ్వమ్ (స్తభాన) (తేజసా) తీక్ష్ణకిరణేన (దిశః) (ఉత్) (దృంహ) ఉత్కర్షయ. ॥౭౨॥ అన్వయః — హే విద్వన్ యోగిన్ స్త్వం భాసా సుపర్ణో గరుత్మానసి యథా సవితా ఽన్తరిక్షస్య మధ్యే వర్తతే తథా పృథివ్యాః పృష్ఠే సీద వాయు రివ ప్రజా ఆపృణ సవితా జ్యోతిషా దివమన్తరిక్ష మివ రాజ్య ముత్తభాన లగ్ని స్తేజసా దిశ ఇవ ప్రజా ఉద్దృంహ. ॥౭౨॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యదా మనుష్యో రాగద్వేషరహితః పరోపకారీశ్వర ఇవ ప్రాణిభిః సహ వర్తేత తదా సిద్ధిం లభేత. ॥౭౨॥

పదార్థము :—విద్వాంసుడా ! యోగీ ! నీవు, భాసా = ప్రకాశముచే, సుపర్ణః = మంచి మంచి శుభలక్షణములతో కూడినవాడవు, గరుత్మాన్ = పెద్ద ఆత్మమనోబలములు గలవాడవు, అసి = అయి యున్నావు. ఎటుల సవిత – సూర్యమండలము అంతరిక్ష మధ్యమున ప్రకాశమానమై యున్నదో అటుల నీవు, పృథివ్యాః పృష్ఠే = భూమిపైని, సీద = స్థిరుడవుకమ్ము. వాయువు వలె ప్రజలను, ఆ పృణ = సుఖము నిమ్ము. లేక ఎటుల సూర్యుడు, జ్యోతిషా = స్వప్రకాశముచే, దివమ్ అంతరిక్షమ్ = ప్రకాశమయమగు అంతరిక్షమును వృద్ధి పొనర్చు చున్నాడో అటుల నీవు రాజనీతి ప్రకాశముచే రాజ్యమును, ఉత్ స్తభాన = ఉన్నతికి చేర్చుము. లేక ఎటుల అగ్ని రన, తేజసా = అతి తీక్ష్ణ తేజస్సుతో, దిశః = దిశల నున్నతి పఱుచు చున్నదో అటుల స్వకీయ తీక్ష్ణ తేజస్సుతో ప్రజలను, ఉత్ దృంహ = ఉన్నతి పఱుచుము. ॥౭౨॥

భావార్థము :—వాచక లుప్తోపమాలంకార ముండుచున్నది. ఎప్పుడు మానవుడు రాగప్రీతుల నుండియు, వైర ద్వేషములనుండియు రహితుడు పరోపకారియు నై ఈశ్వరునివలె సకల ప్రాణుల యెడ ప్రవర్తించునో అప్పుడన్ని సిద్ధులను పొందగలడు. ॥౭౨॥ (కా-౭౩)

---

కా-౭౩ ఆ జుహ్వాన ఇత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్ దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పున ర్విద్వాన్ కీదృశః స్యా దిత్యాహ. విద్వాంసు డెటు లుండవలయును ?

ఆజుహ్వానః సుప్రతీకః పురస్తాదగ్నే స్వాం యోనిమాసీద సాధుయా ।
అస్మిన్త్సధస్థేఽఅధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥

ఆజుహ్వాన ఇత్యాజు+హ్వానః, సుప్రతీక ఇతి సు+ప్రతీకః, పురస్తాత్, అగ్నే,

స్వామ్, యోనిమ్, ఆ, సీద, సాధుయేతి సాధు+యా, అస్మిన్, సధస్థే, అధి, ఉత్తరస్మిన్, విశ్వే, దేవాః, యజమానః, చ, సీదత. (73)

పదార్థః :—(ఆజుహ్వానః) సత్కారేణాహూతః (సుప్రతీకః) ప్రాప్తశుభగుణః (పురస్తాత్) ప్రథమతః (అగ్నే) యోగాభ్యాసేన ప్రకాశితాత్మన్ (స్వమ్) స్వకీయమ్ (యోనిమ్) పరమాత్మాఖ్యం గృహమ్ (ఆ) (సీద) సమన్తాత్ స్థిరో భవ (సాధుయా) శ్రేష్ఠైః కర్మభిః (అస్మిన్) (సధస్థే) సహస్థానే (అధి) ఉపరిభావే (ఉత్తరస్మిన్) (విశ్వే) సర్వే (దేవాః) దివ్యాత్మానో యోగినః (యజమానః) యోగప్రద ఆచార్యః (చ) (సీదత). ॥౭౩॥ అన్వయః :—హే అగ్నే! పురస్తాదాజుహ్వానః సుప్రతీకో యజమానస్త్వం సాధుయాస్మిన్ సధస్థే స్వం యోని మాసీద. హే విశ్వే దేవాః యూయం సాధుయోత్తరస్మిన్ సధస్థే చాధి సీదత. ॥౭౩॥ భావార్థః :— యే సాధూని కర్మాణి కృత్వా కృతయోగాభ్యాసస్య విదుషః సఙ్గప్రీతిభ్యాం పరస్పరం సంవాదం కుర్వన్తి తే సర్వాధిష్ఠాన మీశం ప్రాప్య సిద్ధా జాయన్తే. ॥౭౩॥

పదార్థము :—అగ్నే = యోగాభ్యాసముచే ప్రకాశితమైన ఆత్మగలవాడా! పురస్తాద్ = ప్రథమము నుండియే. ఆ జుహ్వానః = సత్కారముతో పిలువబడినవాడవు, సుప్రతీకః = శుభ గుణ యుక్తుడవు, యజమానః = యోగవిద్య గరపు నాచార్యుడవు, సాధుయా = శ్రేష్ఠకర్మలతో, అస్మిన్ సధస్థే = ఈ సమ్మిళిత స్థానమునందు, స్వమ్ యోనిమ్ = స్వకీయమైన పరమాత్మ యను గృహమునందు, ఆసీద = స్థిరుడవు కమ్ము. చ = మఱియు, విశ్వే దేవాః = దివ్యాత్ములైన యోగులారా! మీరు శ్రేష్ఠ కార్యములచే, ఉత్తరస్మిన్ = ఉత్తర సమయమునందు ఒక్కుమ్మడిగ సత్య సిద్ధాంతమునందు, అధి సీదత = అధికముగ స్థితులగుడు. ॥౭౩॥

భావార్థము :—ఎవరు సాధుకర్మల నొనర్చి యోగాభ్యాస మొనరించువిద్వాంసుల సాంగత్యముతోను ప్రీతితోను పరస్పర సంవాద మొనర్చెదరో, వారు సర్వాధిష్ఠాన డగు ఈశుని పొంది సిద్ధులగుచున్నారు.

---

౭౪ తాం సవితు రిత్యస్య కణ్వ ఋషిః, సవితా దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ క ఈశ్వరం ప్రాప్తుం శక్నోతీత్యాహ. ఈశ్వరుని ఎవరు పొందగలరు?

తాం సవితు ర్వరేణ్యస్య చిత్రామాహం వృణే సుమతిం విశ్వజన్యామ్।

యామస్య కణ్వో అదుహత్ప్రపీనాం సహస్రధారాం పయసా మహీం గామ్॥

తామ్, సవితుః, వరేణ్యస్య, చిత్రామ్, ఆ, అహమ్, వృణే, సుమతిమితి సు+మతిమ్, విశ్వజన్యామ్, యామ్, అస్య. కణ్వః, అదుహత్, ప్రపీనామితి, ప్ర+పీనామ్, సహస్ర ధారామితి సహస్ర + ధారామ్, పయసా, మహీమ్, గామ్. (74)

పదార్థః :— (తామ్) వక్ష్యమాణామ్ (సవితుః) యోగైశ్వర్య సంప్రదస్యేశ్వరస్య (వరేణ్యస్య) వరితు మర్హస్య (చిత్రామ్) అద్భుతవిషయామ్ (ఆ) (అహమ్)(వృణే) స్వీకుర్వే (సుమతిమ్) శోభనాం యథావిషయాం ప్రజ్ఞామ్ (విశ్వజన్యామ్) యా విశ్వ మఖిలం జగజ్జనయతి ప్రకటయతి

రామ్ (యామ్) (అస్య) (కణ్వః) మేధావీ (అదుహత్) పరిపూరయతి (ప్రపీనామ్) ప్రవృద్ధామ్ (స హస్ర ధారామ్) సహస్ర మసంఖ్యానర్థాన్ ధరతి తాం సర్వజ్ఞాన ప్రదామ్ (పయసా)అన్నాదినా (మ హీమ్) మహతీమ్ (గామ్) వాచమ్. గౌరితి వాఙ్ నా. ని. ౧ ౧౧. ॥౭౪॥ అన్వయః :- యథా కణ్వోఽస్య వరేణ్యస్య సవితు రీశ్వరస్య యాం చిత్రాం విశ్వజన్యాం ప్రపీనాం సహస్రధారాం సుమతిం పయసా మహీం గాం చాదుహత్. తథా తా మహమా వృణే. ॥౭౪॥ భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా మేధావీ జగదీశ్వరస్య విద్యాం ప్రాప్యైధతే తథైవైతాం లబ్ధ్వాఽన్యేనాపి విద్యాయోగవృద్ధ్యై భవితవ్యమ్. ॥౭౪॥

పదార్థము :-ఎటుల, కణ్వః = బుద్ధిమంతుడగు పురుషుడు, అస్య వరేణ్యస్య సవితుః = వరించ దగినవాడు, ఐశ్వర్యము నిచ్చువాడు నగు నీ పరమాత్మని యొక్క, యామ్ చిత్రామ్ = ఏ యద్భుతాశ్చర్య రూపమును, లేక, విశ్వజన్యామ్ = సమస్త జగదుత్పాదకమును, ప్రపీనామ్ = సమస్త జగదుత్పాదకమును, ప్రపీనామ్ = అత్యున్నతితో వృద్ధి బొందునదియు, సహస్రధారామ్ = వేలకొలది పదార్థములను ధరించునదియు, సుమతిమ్ = యథాతథ్య విషయములను ప్రకాశింప జేయునదియు నగు సత్తమ బుద్ధిని, మరియు, పయసా = అన్నాది పదార్థములతోపాటు, మహీమ్ గామ్ = గొప్పవాణిని, అదుహత్ = పరిపూర్ణ మొనరించునో అనగా క్రమముగ నెఱిగి తన జ్ఞాన విష యముగ నొనర్చుకొనుచున్నాడో, అటులనే, అహమ్ = నేను, తామ్ = దానిని, ఆ వృణే = చక్కగ స్వీకరించు చున్నాను. ॥౭౪॥

భావార్థము :- వాచక లుప్తోపమాలంకార మందున్నది. ఎటుల మేధావి జగదీశ్వరుని విద్యను బొంది వృద్ధిని బొందుచున్నాడో అటులనే దీని బొంది ఇతర సామాన్యజనులును విద్యా యోగముల వృద్ధికై ఉద్యతులు కావలయును. ॥౭౪॥ (౯౨౪)

---

౯౨౫ విధేమేత్యస్య గృత్స ఋషిః. అగ్నిర్ దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

విధేమ తే పరమే జన్మన్నగ్నే విధేమ స్తోమైరవరే సధస్థే ।

యస్మాద్యోనేరుదారిథా యజే తం ప్ర త్వే హవీంషి జుహురే సమిద్ధే ॥

విధేమ, తే, పరమే, జన్మన్, అగ్నే, విధేమ, స్తోమైః, అవరే, సధస్థ ఇతి సధ+స్థే, యస్మాత్, యోనేః, ఉదారిథేత్యుత్+ఆరిథ, యజే, తమ్, ప్ర, త్వ ఇతి త్వే, హవీంషి, జుహురే సమిద్ధ ఇతి సమ్+ఇద్ధే. (75)

పదార్థః :- (విధేమ) పరిచరేమ (తే) తవ (పరమే) సర్వోత్కృష్టే యోగ సంస్కారజే (జన్మన్) జన్మని. అత్ర సుపాం సు లుగితి ఙేర్లుక్ (అగ్నే) యోగసంస్కారేణ దుష్టకర్మ దాహక (విధేమ) సేవేమహి (స్తోమైః) స్తుతిభిః (అవరే) అర్వాచీనే (సధస్థే) సహస్థానే (యస్మాత్) (యోనేః) స్థానాత్ (ఉదారిథ)ఉత్కృష్టైః సాధనైః ప్రాప్నుహి. అత్రాన్యేషా మపీతి దీర్ఘః. (యజే) సంగచ్ఛే (తమ్) (ప్ర) (త్వే) త్వయి(హవీంషి) హోతవ్యాని(జుహురే)జుహ్వతి (సమిద్ధే) సమ్యక్

ప్రపద్యే. ॥౭౫॥ అన్వయః :—హే అగ్నే! యోగిన్ తే తవ పరమే జన్మన్ త్వే వర్త్తమానేఽవరే సధస్థే వర్త్తమానా వయం స్తోమై ర్విధేమ త్వమస్మాన్ యస్మాద్యోనే రుదారిథ తం యోని మహం ప్రయజే యథా హోతారః సమిద్ధేఽగ్నౌ హవీంషి జుహురే. తథా యోగాగ్నౌ దుఃఖ సమూహస్య హోమం విదేమ. ॥౭౫॥ భావార్థః :— ఇహ యస్య యోగ సంస్కారయుక్త స్య జీవస్య పవిత్రాచరితం జన్మ జాయతే స సంస్కారబలాత్ యోగజిజ్ఞాసు రేవ భవతి, యే తం సేవన్తే తేఽపి యోగజిజ్ఞాసవో సర్వ ఏతేఽగ్ని రిన్ధనానీవ సర్వా మశుద్ధిం యోగేన దహన్తి ॥౭౫॥

పదార్థము :—అగ్నే = యోగీ! తే = నీ యొక్క, పరమే జన్మన్ = సర్వశ్రేష్ఠమగు నుత్తమ యోగ సంస్కారముచే కలిగిన పూర్వజన్మయందు లేక, త్వే = వర్త్తమాన జన్మయందు, అవరే సధస్థే = అర్వాచీనమైన ఏకస్థానమందున్న మేము, స్తోమైః = స్తుతులతో, విధేమ = సత్కారపూర్వకముగ నీ సేవ యొనర్చెదము. నీవు మాకు, యస్మాత్ యోనేః = ఏ స్థానమునుండి ఉదారిథ = మంచి మంచి సాధనములతో ప్రాప్తమగు చున్నావో, తమ్ = ఆస్థానమును నేను, ప్ర యజే = బాగుగ పొందుదును మరియు నెటుల హోతలు, సమిద్ధే అగ్నౌ = చక్కగ ప్రజ్వలించుచున్న అగ్నియందు, హవీంషి = హోమ మొనర్పదగు యోగ్యవస్తువులను, జుహురే = హోమ మొసరించుచున్నారో, అటులనే యోగాగ్నియందు మేము దుఃఖములను, విధేమ = హోమ మొసర్చెదము. ॥౭౫॥

భావార్థము :—ఈ లోకములో యోగసంస్కారముగల యే జీవము పవిత్రభావముతో జన్మించునో అది సంస్కారప్రాబల్యముచే యోగమునే తెలుసుకొను నిచ్ఛగలదే అగును. అతనిని సేవించువారును యోగజిజ్ఞాసువు లగుదురు. వీరందరు అగ్ని ఇంధనములను దహించి నటుల సమస్త దుఃఖములను, అశుచులను యోగముచే దహింప జేయుదురు. ॥౭౫॥ (౯-౨౫)

---

౭౬ ప్రేద్ధ ఇత్యస్య వసిష్ఠ ఋషిః, అగ్నిర్ దేవతా, ఆర్ష్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ప్రేద్ధోఽగ్నే దీదిహి పురో నోఽజస్రయా సూర్మ్యా యవిష్ఠ ।

త్వాꣳ శశ్వన్తఽఉప యన్తి వాజాః ॥ ॥౭౬॥

ప్రేద్ధ ఇతి ప్ర+ఇద్ధః, అగ్నే, దీదిహి, పురః, నః, అజస్రయా, సూర్మ్యా, యవిష్ఠ, త్వామ్ శశ్వన్తః, ఉప, యన్తి, వాజాః. (76)

పదార్థః :—(ప్రేద్ధః) ప్రకృష్టతయా ప్రదీప్తః (అగ్నే) అగ్నిరివ దుఃఖదాహక యోగిన్ (దీదిహి) కామయస్వ (పురః) పురస్తాత్ (నః) అస్మాన్ (అజస్రయా) అనుపక్షీణయా (సూర్మ్యా) ఐశ్వర్యేణ (యవిష్ఠ) అతిశయేన యువన్ (త్వామ్)(శశ్వన్తః) నిరంతరం వర్త్తమానాః(ఉప యన్తి) ప్రాప్నువన్తు (వాజాః)విజ్ఞానవన్తో జనాః ॥౭౬॥ అన్వయః :— హే యవిష్ఠాగ్నే! త్వం పురః ప్రేద్ధః సన్నజస్రయా సూర్మ్యా నోఽస్మాన్ దీదిహి శశ్వన్తో వాజా స్త్వాముపయన్తి. ॥౭౬॥ భావార్థః :— యదా మనుష్యాః శుద్ధాత్మానో భూత్వాఽన్యానుప కుర్వన్తి తదా తేఽపి సర్వత్రోప కృతా భవన్తి. ॥౭౬॥

పదార్థము :—యవిష్ఠ = అత్యంత తరుణ వయస్కుడా! అగ్నే = అగ్నివలె దుఃఖములను వినాశ మొనరించు యోగీ! నీవు పురః = పూర్వము, ప్రేద్ధః = మంచి తేజస్సుతో ప్రకాశమాను

పెరుగుచు, అజస్రయా = నాశన రహితమగు, ఘృతాహుతి = ఐశ్వర్యప్రవాహముచే. సః = ..., పీదిః = ఆకాంక్షించుము, శశ్వంతః = నిరంతరము ఉండువారు, వాజాః = విశేష జ్ఞానము గలవారు. త్వామ్ = నిన్ను, ఉప యంతి = పొందుదురు గాక ! ॥౭౬॥

భావార్థము :—మానవు లెప్పుడు శుద్ధాత్ములై పరోపకార మొనర్చెదరో, అప్పుడు వారును అన్నిదిశలనుండి ఉపకృతు లయ్యెదరు. ॥౭౬॥ (౫౭౬)

౫౭౭ అగ్నే తమిత్యస్య పరమేష్ఠీ ఋషిః, అగ్నిర్ దేవతా, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

అగ్నే తమద్యాశ్వన్న స్తోమైః క్రతున్న భద్రꣳ హృదిస్పృశమ్ ।
ఋధ్యామా త ఓహైః ॥ ॥౭౭॥

అగ్నే, తమ్, అద్య అశ్వమ్, న, స్తోమైః, క్రతుమ్, న, భద్రమ్, హృది+స్పృశమ్, ఋధ్యామ, తే, ఓహైః. (౧౧)

పదార్థః :— (అగ్నే) విద్వన్ (తమ్) పూర్వమన్త్రోక్తమ్ (అద్య) (అశ్వమ్) తురఙ్గమ్ (న) ఇవ (స్తోమైః) స్తుతిభిః (క్రతుమ్) ప్రజ్ఞానమ్ (న) ఇవ (భద్రమ్) భజనీయం కల్యాణకరమ్ (హృదిస్పృశం) యో హృదయే స్పృశతి తమ్ (ఋధ్యామ) వర్ద్ధేమ. అత్రాన్యేషా మపి దీర్ఘః (తే) తవ (ఓహైః) రక్షణాదిభిః ॥౭౭॥ అన్వయః :— హే అగ్నే ! విద్యుత్సదృశపరాక్రమ ... త్వం న క్రతుం న భద్రం హృదిస్పృశం తం త్వాం స్తోమైరద్య ప్రాప్య తే తవోహైర్వయం సతత మృధ్యామ. ॥౭౭॥ భావార్థః :— అత్రోపమాలంకారః. యథా శరీరస్థేన విద్యు దాదినా వృద్ధివేగౌ ప్రజ్ఞాసుఖాని చ వర్ద్ధేరꣳ స్తథా విద్వచ్ఛిక్షారక్షాదిభి ర్మనుష్యాదయో వర్ధన్త. ॥౭౭॥

పదార్థము :—అగ్నే = విద్యుత్తువలె పరాక్రమముగల విద్వాంసుడా ! అశ్వమ్ న = హయమువలె, క్రతుమ్ న = బుద్ధివలె, భద్రమ్ = కల్యాణ కారివి, హృదిస్పృశమ్ = హృదయమును స్పర్శించువాడవు నగు, తమ్ = పూర్వమంత్రోక్తమైన ఆ నిన్ను, స్తోమైః = స్తుతులతో, అద్య = నేడు పొంది, తే = నీయొక్క, ఓహైః = పాలనాది గుణములచే, ఋధ్యామ = వృద్ధినిపొందుదుము గాక !

భావార్థము :—ఉపమాలంకార మిందున్నది. ఎటుల శరీరస్థమగు విద్యుదాదులచే వృద్ధి వేగములు, ప్రజ్ఞాసుఖములు వృద్ధి జెందునో అటులనే విద్వాంసుల శిక్షారక్షాదులచే మనుష్యాదులు వృద్ధిచెందుదురు.

౫౭౮ చిత్తి మిత్యస్య వశిష్ఠ ఋషిః, విశ్వకర్మా దేవతా, విరాడతి జగతీ ఛన్దః, నిషాదః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

చిత్తిం జుహోమి మనసా ఘృతేన యథా దేవా ఇహాగమన్వీతిహోత్రా ఋతావృధః
పత్యే విశ్వస్య భూమనో జుహోమి విశ్వకర్మణే విశ్వాహాదాభ్యꣳ హవిః ॥౭౮॥

చిత్తిమ్, జుహోమి, మనసా, ఘృతేన, యథా, దేవాః, ఇహ, ఆగమన్నిత్యా

+గమన్, వీతిహోత్రా ఇతి వీతి+హోత్రా, ఋతావృధః, ఋతవృధ ఇత్యృత+వృధః, పత్యే, విశ్వస్య, భూమనః, జుహోమి, విశ్వకర్మణే, ఇతి విశ్వ+కర్మణే, విశ్వాహా, అదాభ్యమ్, హవిః. (78)

పదార్థః :- (చిత్తిమ్) చిన్వన్తి యయా తామ్ (జుహోమి) గృహ్ణామి (మనసా) విజ్ఞానేన (ఘృతేన) ఆజ్యేన (యథా) (దేవాః) కామయమానా విద్వాంసః (ఇహ) (ఆగమన్) ఆగచ్ఛన్తి (వీతిహోత్రాః) వీతిః సర్వతః ప్రకాశితో హోత్రా యజ్ఞో యేషాం తే (ఋతావృధః) యే ఋతేన సత్యేన వర్ధన్తే. అత్రాన్యేషామపీతి పూర్వ పదస్య దీర్ఘః (పత్యే) పాలకాయ (విశ్వస్య) సమగ్రస్య జగతః (భూమనః) బహురూపస్య (జుహోమి) దదామి (విశ్వకర్మణే) విశ్వం కర్మ క్రియమాణం కృతం యేన తస్మై (విశ్వాహా) సర్వాణి దినాని (అదాభ్యమ్) అహింసనీయమ్ (హవిః) హోతవ్యం శుద్ధం సుఖకరం ద్రవ్యమ్. ॥౭౮॥ అన్వయః :- హే మనుష్యాః యథాఽహం మనసా ఘృతేన చిత్తిం జుహోమి యథేహ వీతిహోత్రా ఋతావృధో దేవా భూమనో విశ్వస్య విశ్వకర్మణే పత్యే జగదీశ్వరాయాదాభ్యం హవి ర్విశ్వాహా హోతు మాగమన్నహం హవి ర్జుహోమి తథా యూయమప్యాచరత. ॥౭౮॥ భావార్థః :-అత్రోపమాలంకారః. యథా కాష్ఠచితోఽగ్ని రాజ్యేన వర్ధతే తథా విజ్ఞానేనాహం వర్ధేయ యథేశ్వరోపాసకా విద్వాంసశ్చ జగతః కల్యాణాయ ప్రయతన్తే తథాహమపి ప్రయతేయ. ॥౭౮॥

పదార్థము :-మానవులారా ! యథా = ఎటుల నేను, మనసా = విజ్ఞానము చేతను, ఘృతేన నేతితోను, చిత్తమ్ = సంచయ మొనర్చు క్రియను, జుహోమి = గ్రహించుచున్నానో, లేక ఎటుల, ఇహ = ఈ జగత్తునందు, వీతిహోత్రాః = అన్ని దిక్కులందు ప్రకాశ మానమైన యజ్ఞము కలవారు, ఋతావృధః = సత్యముచే వృద్ధి నొందువారు, దేవాః = కామించు వారునగు విద్వాంసులు, భూమనః విశ్వస్య = బహురూపములుగల సకల సంసారము యొక్క, విశ్వకర్మణే = క్రియమాణ సకలకర్మల నొనర్చిన వాడు, పత్యే = పాలకుడునగు జగదీశ్వరుని కై, అదాభ్యమ్ = నష్టమొనర్చతగనిది, హవిః = హోమమొనర్చ తగినదియు నగు పదార్థమును, విశ్వాహా ఆగమన్ = సర్వదినములందు హోమ మొనర్చుటకు వచ్చుచున్నారో, మఱియు నేను హోమ మొనర్చదగు పదార్థములను, జుహోమి = హోమ మొనర్చు చున్నానో అటులనే మీరును ఆచరించుడు. ॥౭౮॥

భావార్థము :-ఉపమాలంకార మిందున్నది. కాష్ఠచితమైనయగ్ని ఎటుల నేతితో పెద్దదగుచున్నదో అటులనే విజ్ఞానముచే నేను అభివృద్ధిచెందుదును గాక! ఎటుల ఈశ్వరోపాసన యొనర్చు విద్వాంసులు జగత్తుయొక్క కల్యాణమునకు ప్రయత్నించెదరో అటులనే నేనును ప్రయత్నించెదను గాక !

---

౭౯- సప్త త ఇత్యస్య సప్తఋషయ ఋషయః, అగ్నిర్ దేవతా, ఆర్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.
పునస్తమేవ విషయ మాహ. మరల నా విషయమునే చెప్పెను.

సప్త తేఽఅగ్నే సమిధః సప్త జిహ్వాః సప్తఽఋషయః సప్త ధామ ప్రియాణి ।
సప్తహోత్రాః సప్తధా త్వా యజన్తి సప్తయోనీ రాపృణస్వ ఘృతేన స్వాహా ॥౭౯॥

సప్త, తే, అగ్నే, సమిధ ఇతి సమ్+ఇధః, సప్త, జిహ్వాః, సప్త, ఋషయః, సప్త, ధామ, ప్రియాణి, సప్త, హోత్రాః, సప్త+ధా, త్వా, యజన్తి, సప్త, యోనీః, ఆ, పృణస్వ, ఘృతేన, స్వాహా. (79)

పదార్థః :-(సప్త)సప్త సంఖ్యాకాని గాయత్ర్యాదీని ఛందాసి(తే)తవ(అగ్నే)తేజస్విన్ విద్వన్ (సమిధః) ప్రదీపకః (సప్త జిహ్వాః)కాల్యాదయః సప్త సంఖ్యాకా జ్వాలాః (సప్త ఋషయః) ప్రాణాదయః పఞ్చ దేవదత్తధనంజయౌ చ (సప్త ధామ) జన్మ నామ స్థాన ధర్మార్థ కామ మోక్షాఖ్యాని ధామాని (ప్రియాణి) (సప్త హోత్రాః) సప్త ఋత్విజః (సప్తధా) సప్తభిః ప్రకారైః (త్వా) త్వామ్ (యజన్తి) సంగచ్ఛేత (సప్తయోనీః) చితీః (ఆ) (పృణస్వ) సుఖీ భవ(ఘృతేన) ఆజ్యేన(స్వాహా) ॥౭౯॥ అన్వయః :—హే అగ్నే విద్వన్ ! యథాగ్నేః సప్త సమిధః సప్త జిహ్వాః సప్తర్షయః సప్తప్రియాణి ధామ సప్త హోత్రాశ్చ సన్తి తథా తే తవ సన్తు యథా విద్వాంస స్తమగ్నిం సప్తధా యజన్తి తథా త్వా యజన్తు యథాఽయమగ్ని ర్ఘృతేన స్వాహా సప్త యోనీ రాపృణతే తథా త్వమా పృణస్వ. ॥౭౯॥ భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథేన్ధనై రగ్ని ర్వర్ధతే తథా విద్యాదిశుభగుణైః సర్వే మనుష్యా వర్ధన్తామ్. యథా విద్వాంసోఽగ్నౌ ఘృతాదికం హుత్వా జగదుపకుర్వన్తి తథా వయ మపి కుర్యామ. ॥౭౯॥

పదార్థము :-అగ్నే = తేజస్వియైన విద్వాంసుడా ! ఎటుల అగ్నికి, సప్త సమిధః = ప్రజ్వలింప జేయునవి ఏడు, సప్తజిహ్వాః = కాలీ-కరాలీ అను ఏడు జ్వాలారూపజిహ్వాలు, సప్తఋషయః = సప్త ప్రాణములు, ప్రాణాపాన సమానోదాన వ్యాన దేవదత్త ధనంజయములు, సప్త ధామ ప్రియాణి = సప్త ప్రియ ధామములు జన్మ, స్థానము, నామము, ధర్మము, అర్థము, కామము, మోక్షము, సప్త హోత్రాః = ఋతువులందు యజ్ఞ మొనర్చు వారేడుగురు ఉన్నారో, అటులనే, తే = నీకును కలుగును గాక ! ఎటుల విద్వాంసులా యగ్నిని, సప్తధా = సప్త విధముల, యజంతి = పొందుచున్నారో, అటులనే, త్వా = నీకును లభించుగాక ! ఎటుల నీ యగ్ని, ఘృతేన = నేతితోను, స్వాహా = ఉత్తమ వాణితోను, సప్త యోనీః = సప్త సంచయములను సుఖముగ పొందుచున్నదో అటులనే నీవు, ఆపృణస్వ = సుఖముగ పొందుము. ॥౭౯॥

భావార్థము :— వాచక లుప్తోపమాలంకార మిందున్నది. అగ్ని ఇంధనములచే పెద్దది యగునటుల విద్యాది శుభ గుణములచే సకల మానవులు వృద్ధిజెందవలెను. విద్వాంసు లెటుల అగ్నియందు ఘృతాదులను హోమమొనర్చి జగదుపకార మొనర్చుచున్నారో అటులనే మేమును ఒనర్చెదముగాక !

౮౦ శుక్రజ్యోతి రిత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, ఆర్ష్యుష్ణిక్ ఛన్దః, నిషాదః స్వరః.
అథేశ్వరః కీదృశోఽస్తీత్యాహ. ఈశ్వరు డెట్టివాడు ?

శుక్రజ్యోతిశ్చ చిత్రజ్యోతిశ్చ సత్యజ్యోతిశ్చ జ్యోతిష్మాꣳశ్చ ।
శుక్రశ్చ ఋతపా శ్చాత్యꣳహాః ॥ ॥౮౦॥

శుక్రజ్యోతి రితి శుక్ర+జ్యోతిః, చ, చిత్రజ్యోతి రితి చిత్ర+జ్యోతిః, చ, సత్య జ్యోతి రితి సత్య+జ్యోతిః, చ, జ్యోతిష్మాన్, చ, శుక్రః, చ, ఋతపా ఇత్యృత

+ పాః, ఫ్త, అత్యంహా ఇత్యతి+అంహాః. (80)

పదార్థః :–(శుక్రజ్యోతిః) శుక్రం శుద్ధం జ్యోతి ర్యస్య సః(చ)(చిత్ర జ్యోతిః) చిత్రమద్భుత జ్యోతి ర్యస్య సః (చ) (సత్య జ్యోతిః) సత్యమవినాశి జ్యోతిః ప్రకాశో యస్య సః (చ) (జ్యోతిష్మాన్) బహూని జ్యోతింషి ప్రకాశా విద్యన్తే యస్య సః (చ) (శుక్రః) శీఘ్రకర్తా శుద్ధస్వరూపో వా (చ) (ఋతపాః) య ఋతం సత్యం పాతి (చ) (అత్యంహాః) అతిక్రాన్త మంహో దుష్కృతం యేన సః. ॥౮౦॥ అన్వయః :–హే మనుష్యాః యథా శుక్రజ్యోతిశ్చ చిత్రజ్యోతిశ్చ సత్యజ్యోతిశ్చ జ్యోతిష్మాంశ్చ శుక్రశ్చాత్యంహా ఋతపాశ్చేశ్వరోఽస్తి తథా యూయం భవత. ॥౮౦॥

భావార్థః :–అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథేహ విద్యుత్ సూర్యాదీన్ ప్రభాకరాన్ శుద్ధికరాన్ పదార్థాన్నిర్మాయేశ్వరేణ జగచ్ఛోధ్యతే తథైవ శుచి సత్యవిద్యోపదేశక్రియాభి ర్మనుష్యాదయో విద్వద్భిః శోధనీయాః,అత్రానేకేషాం చకారాణాం పాఠాత్ సర్వేషా ముపరి ప్రీత్యాదయోఽపి విధేయాః.

పదార్థము :–మానవులారా ! ఎటుల, శుక్రజ్యోతిః = శుద్ధమైన ప్రకాశము గలవాడు. చ = మఱియు, చిత్రజ్యోతిః = అద్భుతమైన ప్రకాశము గలవాడు, చ = మఱియు, సత్య జ్యోతిః = వినాశరహితమైన జ్యోతిగలవాడు, చ = మఱియు, జ్యోతిష్మాన్ = బహు ప్రకాశములు గలవాడు, చ = మఱియు, శుక్రః = శీఘ్రకర్త, శుద్ధ స్వరూపుడు, చ = మఱియు, అత్యంహాః = దుష్టకార్యమును దూర మొనర్చినవాడు, చ = మఱియు, ఋతపాః = సత్యమును రక్షించువాడును నై ఈశ్వరుడున్నాడో అటులనే మీరును గండు. ॥౮౦॥

భావార్థము :–వాచకలుప్తోప మాలంకార మిందున్నది. ఈలోకము విద్యుత్తు సూర్యాదులను ప్రభాకరములు, శుద్ధికరములు నగు పదార్థములను రచించి ఈశ్వరు డెటుల జగత్తును శుద్ధ మొనర్చెనో అటులనే శుద్ధి సత్య విద్యోపదేశాది క్రియలచేత విద్వాంసులు మానవులను శుద్ధమొనర్చ వలయును. ఈ మంత్రమం దనేక చకారము లుండుటచే అందరిపట్ల ప్రీత్యాదులను గూడ చూపవలయునని తెలియుచున్నది. ॥౮౦॥

---

౮౧ ఈదృఙ్ చేత్యస్య సప్తఋషయ ఋషయః. మరుతో దేవతాః, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున ర్విద్వాన్ కీదృశో భవే దిత్యాహ. మఱల విద్వాంసు డెటు లుండవలయును ?

ఈదృఙ్ చాన్యాదృఙ్ చ సదృఙ్ చ ప్రతి సదృఙ్ చ ।
మితశ్చ సంమితశ్చ సభరాః ॥ ॥౮౧॥

ఈదృఙ్, చ, అన్యాదృఙ్, చ, సదృఙ్ సదృఙితి స+దృఙ్, చ, ప్రతిసదృఙితి ప్రతి+సదృఙ్, చ, మితః, చ, సమ్మిత ఇతి సమ్+మితః, చ, సభరా ఇతి స+భరాః. (81)

పదార్థః :–(ఈదృఙ్)అన్యేన తుల్యః(చ) (అన్యాదృఙ్) అన్యేన సమానః (చ) (సదృఙ్) సమానం పశ్యతి స సదృఙ్(చ) (ప్రతిసదృఙ్) తం తం ప్రతి సదృశం పశ్యతి(చ)(మితః) మానం ప్రాప్తః (చ)(సమ్మితః) సమ్యక్(పరిమితః)(చ) (సభరాః) సమానం బిభ్రతీతి సభరాః. ॥౮౧॥

అన్వయః :–యే పురుషా ఈదృఙ్ చాన్యాదృఙ్ చ సదృఙ్ చ ప్రతిసదృఙ్ చ మితశ్చ సంమితశ్చ

సభరాశ్చ వర్తన్తే తే వ్యావహారికీం కార్యసిద్ధిం కర్తుం శక్నువన్తి. ॥౮౧॥ భావార్థః :— యో మనుష్య ఈశ్వరతుల్య ఉత్తమ స్తదనుకరణం కృత్వా సత్యం ధరత్యసత్యం త్యజతి స ఏవ యోగ్యోఽస్తి. ॥౮౧॥

పదార్థము :_ఏ పురుషులు, ఈదృఙ్ = ఇతని వలెను, చ = కూడ, అన్యాదృఙ్ = ఇతరునితో తుల్యముగను, చ = కూడ.సదృఙ్ = సమానముగ చూచువాడు, చ = కూడ, ప్రతిసదృఙ్ = వారివారి పట్ల సదృశ భావ ముంచువాడు, చ = కూడ, మితః = గౌరవమును పొందినవాడు, చ = కూడ, సంమితః = బాగుగ పరిమాణ మొనర్చబడినవాడు. చ = మఱియు, సభరాః = సమానధారణ మొనర్చువారగు నై యుందురో వారు వ్యవహార సంబంధమైన కార్యములను సాధించ గలుగుదురు.

భావార్థము :_ఏ మనుష్యుడు ఈశ్వరునివలె ఉత్తముడై, ఈశ్వరుని అనుకరణ మొనర్చి.సత్యమును ధరించియు అసత్యమును త్యజించునో అతడే యోగ్యుడు. ॥౮౧॥

---

౮౩౨ ఋతశ్చేత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, ఆర్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పునరీశ్వరః కీదృశోఽస్తీ త్యాహ. ఈశ్వరు డెట్టివాడు ?

ఋతశ్చ సత్యశ్చ ధ్రువశ్చ ధరుణశ్చ ధర్తా చ విధర్తా చ విధారయః ॥౮౨॥

ఋతః, చ, సత్యః, చ, ధ్రువః, చ, ధరుణః, చ, ధర్తా, చ, విధర్తేతి వి+ధర్తా, చ, విధారయ ఇతి వి+ధారయః. (82)

పదార్థః :-(ఋతః)సత్యజ్ఞానః(చ)(సత్యః)సత్సు సాధుః (చ)(ధ్రువః) దృఢనిశ్చయః(చ)(ధరుణః)ఆధారః(చ)(ధర్తా)(చ)(విధర్తా)(చ)(విధారయః)యో విశేషేణ ధారయతి సః. ॥౮౨॥ అన్వయః :— హే మనుష్యా ! య ఋతశ్చ సత్యశ్చ ధ్రువశ్చ ధరుణశ్చ ధర్తా చ విధర్తా చ విధారయః పరమాత్మాఽస్తి తమేవ సర్వ ఉపాసీరన్. ॥౮౨॥ భావార్థః :-యే మనుష్యా ! విద్యోత్సాహ సత్సఙ్గ పురుషార్థైః సత్యవిజ్ఞానే ధృత్వా సుశీలతాం ధరన్తి త ఏవ సుఖినో భవితు మన్యాంశ్చ కర్తుం శక్నువన్తి. ॥౮౨॥

పదార్థము :_మానవులారా ! ఋతః = సత్యము నెరుగువాడు, చ = మఱియు, సత్యః = శ్రేష్ఠులందు శ్రేష్ఠుడు, ధ్రువః = దృఢ నిశ్చయము గలవాడు. చ = మఱియు, ధరుణః చ = సర్వాధారుడును, ధర్తా చ = ధారణకర్తయు, విధర్తా చ = విశేషించి ధారణ మొనర్చువాడును, అనగా ధారకులకు ధారకుడును, విధారయః = విశేషించి సకల వ్యవహారముల ధరింపజేయువాడును నై యే పరమాత్మ యున్నాడో అతనినే అందరు ఉపాసించ వలయును. ॥౮౨॥

భావార్థము :-ఏ మానవులు విద్యోత్సాహము చేతను, సత్సాంగత్యము చేతను, పురుషార్థము చేతను సత్యవిజ్ఞానములను ధరించి సౌశీల్యమును ధరించుచున్నారో వారే సుఖులగుటకును, ఇతరులను సుఖులుగ నొనర్చుటకును సమర్థులగు చున్నారు. ॥౮౨॥ (౮౩౨)

---

౮౩౩ ఋతజిదిత్యస్య సప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, భురిగార్ష్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ విద్వాంసః కీదృశా భవేయు రిత్యుచ్యతే. విద్వాంసు లెటు లుందురు ?

ఋతజిచ్చ సత్యజిచ్చ సేనజిచ్చ సుషేణశ్చ । అన్తిమిత్రశ్చ దూరేఽఅమిత్రశ్చ గణః॥

ఋతజిదిత్యృత+జిత్, చ, సత్యజిదితి సత్య+జిత్, చ, సేనజిదితి సేన+జిత్, చ, సుషేణః, సుసేన ఇతి సు+సేనః, చ, అన్తిమిత్ర ఇత్యన్తి+మిత్రః, చ,దూరే అమిత్ర ఇతి దూరే+అమిత్రః, చ, గణః. (83)

పదార్థః :-(ఋతజిత్) య ఋతం విజ్ఞాన ముత్కర్షతి సః (చ) (సత్యం జిత్) సత్యం కారణం ధర్మం చోన్నయతి(చ)(సేనజిత్) యః సేనాం జయతి సః (చ) (సుషేణః) శోభనా సేనా యస్య సః(చ)(అన్తిమిత్రః)అన్తౌ సమీపే మిత్రాః సహాయకారిణో యస్య సః(చ) (దూరే అమిత్రః)దూరే అమిత్రాః శత్రవో యస్య సః(చ)(గణః) గణనీయః. ॥౮౩॥ అన్వయః :- య ఋతజిచ్చ సత్యజిచ్చ సేనజిచ్చ సుషేణ శ్చాన్తిమిత్రశ్చ దూరేఽఅమిత్రశ్చ భవేత్ స ఏవ గణో గణనీయో జాయతే. ॥౮౩॥ భావార్థః :-యే మనుష్యా విద్యాసత్యాదీని కర్మాణ్యున్నయేయు ర్మిత్రసేవినః శత్రుద్వేషిణ శ్చ భవేయు స్త ఏవ లోకే ప్రశంసనీయాః స్యుః. ॥౮౩॥

పదార్థము :-ఎవడు, ఋతజిత్ చ = విశేష జ్ఞానమును అభివృద్ధి పఱచు వాడును, సత్యజిత్ చ = కారణమును ధర్మమును ఉన్నతి యొనర్చు వాడును, సేనజిత్ చ = సేనను జయించు వాడును, సుషేణః చ = సుందరమైన సేనగలవాడును, అంతి మిత్రః చ = సమీపమున సహాయ మొనర్చు మిత్రుడు కలవాడును, దూరే అమిత్రః చ = దూరముగ తొలగి పోయిన శత్రువులు గలవాడును నై యున్నాడో అతడే, గణః = గణనీయు డగుచున్నాడు. ॥౮౩॥

భావార్థము :-ఏ మానవులు విద్యా సత్యాది కర్మల నభివృద్ధి పఱచుదురో, మఱియు మిత్రులకు సేవ, శత్రువులతో వైర మొనర్చెదరో అట్టి వారే లోకములో ప్రశంసా యోగ్యు లగుచున్నారు.

---

౮౪ ఈదృఙ్క్షాస ఇత్యస్య సప్తఋషయ ఋషయః. మరుతో దేవతాః, నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

ఈదృఙ్క్షాస ఏతాదృఙ్క్షాస ఊ షు ణః సదృఙ్క్షాసః ప్రతిసదృఙ్క్షాస ఏతన ।
మితాసశ్చ సమ్మితాసో నోఽఅద్య సభరసో మరుతో యజ్ఞేఽఅస్మిన్ ॥

ఈదృఙ్క్షాసః, ఏతాదృఙ్క్షాసః, ఊ౦ ఇత్యూ౦, సు, నః, సదృఙ్క్షాస ఇతి స+దృఙ్క్షాసః, ప్రతి సదృఙ్క్షాస ఇతి ప్రతి+సదృఙ్క్షాసః, ఆ, ఇతన, మితాసః, చ, సమ్మితాస ఇతి,సమ్+మితాసః, నః, అద్య, సభరస ఇతి స+భరసః,మరుతః,యజ్ఞే, అస్మిన్.

పదార్థః :-(ఈదృఙ్క్షాసః)ఏతల్లక్షణసహితాః (ఏతాదృఙ్క్షాసః)ఏతైః పూర్వోక్తైః స్సదృశాః(ఉ) వితర్కే (సు)సుష్ఠు (నః) అస్మాన్ (సదృఙ్క్షాసః) పక్షపాతం విహాయ సమానదృష్టయః (ప్రతిసదృఙ్క్షాసః)ఆప్తసదృశాః (ఆ)(ఇతన)సమన్తా త్ప్రాప్నుత (మితాసః) పరిమితవిజ్ఞానాః(చ) (సమ్మితాసః) తులావత్ సత్యవివేచకాః(నః)అస్మాన్(అద్య)(సభరసః) స్వసమానపోషకాః (మరుతః) ఋత్విజో

విద్వాంసః(యజ్ఞే)సంగంతవ్యే వ్యవహారే (అస్మిన్). ॥౬॥ అన్వయః :-హే మరుతో ! విద్వాంసో ! య ఈదృక్షాస ఏతాదృక్షాస సదృక్షాసః ప్రతిసదృక్షాసో నోఽస్మాన్ స్వేతన ఉ మితాసః సమ్మితాస శ్చాస్మిన్ యజ్ఞే సభరసో భవతాఽద్య నో రక్షత తాన్ వయ మపి సతతం సత్కుర్యామ. ॥౮॥ భావార్థః :-యదా ధార్మికా విద్వాంసః క్వాపి మిలేయు ర్యానుపాగచ్ఛేయు రధ్యాపయేయుః సుశిక్షేరం శ్చ తదేమే సర్వైః సత్కర్తవ్యాః. ॥౮॥

పదార్థము :-మరుతః = ప్రతి ఋతువునందు యజ్ఞమొనర్చు విద్వాంసులారా ! ఈదృక్షాసః = ఈయీ లక్షణములు గలవారు, ఏతాదృక్షాసః = పూర్వోక్త సదృశులు, సదృక్షాసః = పక్షపాతమును వీడి సమానమైన దృష్టిగలవారు, ప్రతిసదృక్షాసః = శాస్త్రముల జదివి సత్యమును జెప్పుధర్మాత్ములైన ఆప్తులకు తుల్యులు నగు వారెవరు, నః = మాకు, సు ఆ ఇతన = బాగుగ లభించెదరో, ఉ = లేక, మితాసః = పరిమిత విజ్ఞానము గలవారును, సంమితాసః = తులాసదృశముగ సత్యాసత్యములను వేరుపఱచు వారును, చ = మఱియు, అస్మిన్ యజ్ఞే = ఈ యజ్ఞమునందు,సభరసః = తనవలెనే ప్రాణులను పోషించు వారును నగు నెవరు, అద్య = నేడు, నః = మమ్ముల రక్షించెదరో వారిని మేము నిరంతరము సత్కరించెదము గాక ! ॥౮॥

భావార్థము :-ధార్మిక విద్వాంసు లెక్కడైనా కలసినను, ఎవరింటికైనా విచ్చేసినను, చదివించినను, శిక్షగఱపినను వారు వీరందరికి సత్కారార్హులగుచున్నారు. ॥౮॥ (౯౩౪)

౯౩౫ స్వతవానిత్యస్య సప్తర్షయ ఋషయః, చతుర్మాస్యా మరుతో దేవతాః, స్వరాడార్షీ గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

పున స్స విద్వాన్ కీదృశో భవే దిత్యాహ. విద్వాంసు డెటువంటి వాడు ?

స్వతవాఀశ్చ ప్రఘాసీ చ సాంతపనశ్చ గృహమేధీ చ । క్రీడీ చ శాకీ చో జ్జేషీ॥

స్వతవానితి స్వ+తవాన్, చ, ప్రఘాసీతి ప్ర+ఘాసీ, చ, సాన్తపన ఇతి సామ్+తపనః, చ, గృహమేధీతి, గృహమేధీ, చ,క్రీడీ, చ, శాకీ, చ, ఉజ్జేషీత్యుత్+జేషీ.

పదార్థః :-(స్వతవాన్) యః స్వాన్ తౌతి వర్ధయతి సః. అత్ర తు ధాతో రౌణాదిక ఆనిః ప్రత్యయః(చ)(ప్రఘాసీ)బహవః ప్రకృష్టా ఘాసా భోజ్యాని విద్యన్తే యస్య సః (చ) (సాన్తపనః) సమ్యక్ శత్రూన్ తాపయతి తస్యాయమ్ (చ) (గృహమేధి) ప్రశస్తో గృహే మేధః సంగమోఽస్యాస్తీతి సః(చ) (క్రీడీ) (చ) అవశ్యం క్రీడితుం శీలః (శాకీ)అవశ్యం శక్తుం శీలః (చ)(ఉజ్జేషీ) ఉత్కృష్టతయా జేతుం శీలః. ॥౯॥ అన్వయః :-యః స్వతవాంశ్చ ప్రఘాసీ చ సాన్తపనశ్చ గృహమేధీ చ క్రీడీ చ శాకీ చ భవేత్ స ఉజ్జేషీ స్యాత్. ॥౯॥ భావార్థః :-యో బహుబలాన్నసామర్థ్యో గృహస్థో భవతి స సర్వత్ర విజయ మాప్నోతి. ॥౯॥

పదార్థము :-స్వతవాన్ = స్వకీయులను వృద్ధియొనర్చువాడు, చ = మఱియు. ప్రఘాసీ = అపరిమిత భోజన సామాగ్రి గలవాడు, సాంతపనః = బాగుగా శత్రువులను తపింప జేయువాడు, చ = మఱియు, గృహమేధీ = గృహమందు ప్రశస్తమైన సంగమముగలవాడు, చ = మఱియు, క్రీడీ = క్రీడా స్వభావము కలిగియున్నవాడు, చ = మఱియు, శాకీ = అవశ్యముగ శక్తిజూపు శీలము గలవాడుగ నెవడున్నాడో అతను, ఉజ్జేషీ = మనస్సుతో నత్యంతముగ జయించు వాడగు చున్నాడు.

భావార్థము :—అధిక బలియు, అధికారిముగలిగి యున్నవాడును సమర్థుడును నైన గృహస్థుడు సర్వత్ర విజయమును పొందు చున్నాడు. ॥౮౫॥ (౯౩౭)

౯౩౮ ఇంద్రమిత్యస్య స ప్తఋషయ ఋషయః, మరుతో దేవతాః, నిచృచ్ఛక్వరీ ఛన్దః, ధైవతః స్వరః. పునా రాజప్రజాః కథం పరస్పరం వర్తే రన్నిత్యాహ. రాజు ప్రజలు పరస్పర మెటుల మెలగవలెను?

ఇన్ద్రం దైవీర్విశో మరుతోఽనువర్త్మానోఽభవన్యథేన్ద్రం దైవీ ర్విశో మరుతోఽనువర్త్మానోఽభవన్ । ఏవ మిమం యజమానం దైవీశ్చ విశో మానుషీశ్చానువర్త్మానో భవన్తు ॥ ॥౮౬॥

ఇన్ద్రమ్, దైవీః, విశః, మరుతః, అనువర్త్మాన ఇత్యనుఽవర్త్మానః, అభవన్, యథా, ఇన్ద్రమ్, దైవీః, విశః, మరుతః, అనువర్త్మాన ఇత్యనుఽవర్త్మానః, అభవన్, ఏవమ్, ఇమమ్, యజమానమ్, దైవీః, చ, విశః, మానుషీః, చ, అనువర్త్మాన ఇత్యనుఽవర్త్మానః, భవన్తు. (86)

పదార్థః :—(ఇంద్రమ్)పరమైశ్వర్యయుక్తం ధార్మికం రాజానమ్ (దైవీః) దేవానాం విదుషామిమాః (విశః)ప్రజాః (మరుతః) ఋత్విజో విద్వాంసః(అనువర్త్మనః)అనుకూలో వర్త్మ మార్గో యేషాం తే (అనుభవన్) భవన్తు (యథా)యేన ప్రకారేణ(ఇన్ద్రమ్)అఖిలైశ్వర్యమ్(దైవీః)(విశః) (మరుతః)ప్రాణా ఇవ ప్రియాః (అనువర్త్మనః)అనుకూలాచరణాః (అభవన్)(ఏవమ్) (ఇమమ్) (యజమానమ్)విద్యాసుశిక్షాభ్యాం సుఖదాతారమ్(దైవీః) (చ) (విశః) (మానుషీః) మానుషాణా మవిదుషా మిమాః(చ)(అనువర్త్మనః)(భవన్తు). ॥౮౬॥ అన్వయః :—హే రాజంస్త్వం తథా వర్తస్వ యథేమా దైవీ ర్విశో మరుత శ్చేన్ద్ర మనువర్త్మనోఽభవన్ యథా మరుతో దైవీర్దివ్యా విశశ్చేన్ద్ర మనువర్త్మానోఽభవన్. ఏవం దైవీశ్చ విశో మానుషీశ్చ విశ ఇమం యజమాన మనువర్త్మనో భవన్తు. ॥౮౬॥ భావార్థః :—అత్రోపమా వాచక లుప్తోపమాలంకారౌ. యథా ప్రజా రాజాదీనాం రాజపురుషాణా మనుకూలా వర్తేరం స్తథై తేఽపి ప్రజానుకూ లావర్తన్తామ్. యథా ధ్యాపకోప దేశకాః సర్వేషాం సుఖాయ ప్రయతేరం స్తథై వ సర్వ ఏతేషాం సుఖాయ ప్రయతన్తామ్.

పదార్థము :—రాజా ! నీవు ఈ విధముగ ప్రవర్తించుము. యథా = ఎటుల, దైవీః = విద్వాంసులకు సంబంధించిన, విశః = ప్రజలు, మరుతః = ప్రతిఋతువునందు యజ్ఞ మొనరించు విద్వాంసులు, ఇంద్రమ్ = పరమైశ్వర్యయుక్తుడగు రాజునకు, అనువర్త్మానః = అనుకూల మార్గమున నడచు వారుగ, అభవన్ = అగుదురో లేక ఎటుల, మరుతః = ప్రాణముతో సమానమగు ప్రియులు, దైవీః విశః = శాస్త్రజ్ఞులు దివ్యులు నగు ప్రజలు, ఇంద్రమ్ = సకలైశ్వర్య యుక్తుడగు పరమేశ్వరునకు, అనువర్త్మనః = అనుకూలముగ నాచరించు వార లగుదురో, ఏవమ్ = ఇటులనే. దైవీః = = శాస్త్రముల నభ్యసించినవారు, చ = మఱియు, మానుషీః = మూర్ఖులు, చ విశః = ఈ యిరువురు ప్రజలు, ఇమమ్ యజమానమ్ = విద్యా సుశిక్షల నొసగు నీ సజ్జనునికి, అనువర్త్మనః = అనుకూలముగ చరించు వారులై , భవన్తు = ఉందురో అటుల ప్రవర్తించుము. ॥౮౬॥

భావార్థము:—ఉపమా వాచక లుప్తోప మాలంకారము లిందున్నవి. ప్రజ లెటుల రాజుకు రాజపురు

షులకు అనుకూలముగ వర్తించుదురో అటులనే వారును ప్రజల కనుకూలముగ ప్రవర్తించ వలయును. ఎటుల అధ్యాపనోపదేశముల నొనరించువారు అందఱి సుఖము కొఱకు ప్రయత్నించెదరో అటులనే అందఱును వారి సుఖమునకై ప్రయత్నించ వలయును. ॥౮౬॥ (౯౨౨)

౯౨౩ ఇమమిత్యస్య వత్సప్రియ ఋషయః, అగ్నిర్ దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పున ర్మనుష్యైః కథం వర్తితవ్య మిత్యాహ. మానవు లెటుల మెలగ వలయును ?

ఇమꣳ స్తనమూర్జస్వన్తం ధయాపాం ప్రపీనమగ్నే సరిరస్య మధ్యే ।
ఉత్సం జుషస్వ మధుమన్తమర్వన్త్సముద్రియꣳ సదనమా విశస్వ ॥

ఇమమ్, స్తనమ్, ఊర్జస్వన్తమ్, ధయ, అపామ్, ప్రపీనమితి ప్ర+పీనమ్, అగ్నే, సరిరస్య, మధ్యే ఉత్సమ్, జుషస్వ, మధుమన్తమితి మధు+మన్తమ్, అర్వన్, సముద్రియమ్, సదనమ్, ఆ, విశస్వ. (87)

పదార్థః :—(ఇమమ్) (స్తనమ్)దుగ్ధాధారమ్(ఊర్జస్వన్తమ్) ప్రశస్త బలకారకమ్ (ధయ) పిబ (అపామ్) జలానామ్ (ప్రపీనమ్) ప్రకృష్టతయా స్థూలమ్ (అగ్నే) పావక ఇవ వర్తమాన (సరిరస్య) బహోః. సరిర ఇతి బహు నా. . నిఘం. ౩.౧. (మధ్యే) (ఉత్సమ్) ఉన్దన్తి యేన తం కూపమ్. ఉత్సమితి కూప నా. నిఘం. ౩.౨౩. (జుషస్వ) సేవస్వ (మధుమన్తమ్) ప్రశస్తం మధు మాధుర్యం విద్యతే యస్మింస్తమ్ (అర్వన్) అశ్వ ఇవ వర్తయన్ (సముద్రియమ్) సాగరే భవమ్ (సదనమ్)సీదన్తి గచ్ఛన్తి యత్తత్ (ఆ)(విశస్వ) అత్ర వ్యత్యయే నాత్మనేపదమ్. ॥౮౭॥

అన్వయః :-హే అగ్నే ! పాలక! త్వం ప్రపీనం స్తనమి వేమ మూర్జస్వన్త మపాం రసం ధయ. సరిరస్య మధ్యే మధుమంత ముత్సం జుషస్వ. హే అర్వం స్త్వం సముద్రియం సదన మావిశస్వ.॥౮౭॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా బాలకా వత్సాశ్చ స్తనదుగ్ధం పీత్వా వర్ధన్తే యథా వాశ్వః శీఘ్రం ధావతి తథా మనుష్యా యుక్తాహారేణ వర్ధమానా వేగేన గచ్ఛన్తు యథా ఒద్భిః పూర్ణే సముద్రే నౌకాయాం స్థిత్వా గచ్ఛన్తః సుఖేన పారావారే యాన్తి తథైవ సుసాధనై ర్వ్యవహారస్య పారావారౌ ప్రాప్నువన్తు. ॥౮౭॥

పదార్థము :—అగ్నే = అగ్నివలెనున్న పురుషుడా ! నీవు, ప్రపీనమ్ = మంచి పాలతో నిండి యున్న, స్తనమ్ = స్తనమువలె, ఇమమ్ ఊర్జస్వంతమ్ = ఈ ప్రశంసిత బలమొసగు, అపామ్ = జలముల రసమును, ధయ = పాన మొనర్చుము. సరిరస్య మధ్యే = అనేకుల మధ్య, మధుమంతమ్ = ప్రశంసిత మధురాది గుణయుక్తమగు పదార్థములను, ఉత్సమ్ = ఆర్ద్రమొనర్చు కూపమును, జుషస్వ = సేవించుము.లేక,అర్వన్ = అశ్వమువలె ప్రవర్తించు మానవుడా! నీవు, సముద్రియమ్ సదనమ్ = సముద్రములో పోవుట కాధారమగు సదనమున[ఓడలో]ఆ విశస్వ = చక్కగ ప్రవేశించుము.

భావార్థము :-వాచక లుప్తోపమాలంకార మిందున్నది. బాలకులు దూడలు ఎటుల స్తన్యపాన మొనర్చి పెరుగుచున్నవో, అశ్వమెటుల వేగముగ పరుగెత్తు చున్నదో, అటులనే మానవులు యథా యోగ్య భోజన శయన విశ్రామాదులచే వృద్ధిపొంది వేగముతో నడువవలయును. ఎటుల జలములతో

నిండియున్న సముద్రము మధ్య నౌకయందు స్థితులై వెళ్ళుచు సుఖముగ పారావారము అనగ ఈ తటమునుండి ఆ తటమునకు చేరుచున్నారో అటులనే సుసాధనముచేత వ్యవహారము యొక్క పారావారములు పొందవలయును. ॥౧౭౪॥ (౯౩౭)

---

౧౭౮ ఘృత మిత్యస్య గృత్సమద ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
పునర్మనుష్యై రగ్నిః క్వ క్వాన్వేషణీయ ఇత్యాహ. మానవు లగ్నిని ఎచ్చటెచ్చట అన్వేషించ వలెను?

ఘృతం మిమిక్షే ఘృతమస్య యోనిర్ఘృతే శ్రితో ఘృతమ్వస్య ధామ ।
అనుష్వధ మావహ మాదయస్వ స్వాహాకృతం వృషభ వక్షి హవ్యమ్ ॥

ఘృతమ్, మిమిక్షే, ఘృతమ్, అస్య, యోనిః, ఘృతే, శ్రితః, ఘృతమ్, ఊ౦ ఇత్యూ౦, అస్య, ధామ, అనుష్వధమ్, అనుస్వధమిత్యను+స్వధమ్, ఆ, వహ, మాదయస్వ, స్వాహాకృతమితి స్వాహా+కృతమ్, వృషభ, వక్షి, హవ్యమ్.

పదార్థః :—(ఘృతమ్) ఉదకమ్ (మిమిక్షే) సిఞ్చతు మిచ్ఛ (ఘృతమ్)జలమ్ (అస్య) (యోనిః) గృహమ్ (ఘృతే) (శ్రితః) (ఘృతమ్) ఉదకమ్ (ఉ) వితర్కే (అస్య)పావకస్య (ధామ) అధికరణమ్ (అనుష్వధమ్) స్వధాన్నస్యానుకూలమ్ (ఆ) (వహ) ప్రాపయ (మాదయస్వ) హర్షయస్వ (స్వాహాకృతమ్) వేదవాణీ నిష్పాదితమ్(వృషభ)యో వర్షతి తత్సమ్బుద్ధౌ (వక్షి) కామయసే ప్రాప్నోషి వా (హవ్యమ్) హోతు మాదాతు మర్హమ్. ॥౭౮॥ అన్వయః :—హే సముద్రయాయిన: త్వం ఘృతం మిమిక్షే ఉ అస్యాగ్నే ర్ఘృతం యోని రస్తి. యో ఘృతే శ్రితో ఘృత మస్య ధామ తమగ్ని మనుష్వధ మావహ. హే వృషభ! త్వం యతః స్వాహాకృతం హవ్యం వక్షి తేనాస్మాన్ మాదయస్వ. ॥౭౮॥ భావార్థః :—యావా నగ్ని ర్జలేఽస్తి తావాన్ జలాధికరణ ఉచ్యతే యథాజ్యేన వహ్ని ర్వర్ధతే తథా జలేన సర్వే పదార్థా వర్ధన్తే. అన్న మనుకూల మాజ్యం చానన్దకారి జాయతే తస్మా త్సర్వై రేతత్కమనీయమ్. ॥౭౮॥

పదార్థము :- సముద్రమున పయనించు మానవా! నీవు, ఘృతమ్ = జలమును, మిమిక్షే = సించన మొనర్ప గోరుము, ఉ = లేక. అస్య ఘృతమ్ = ఈ అగ్నికి నేయి. యోనిః = గృహమై యున్నది. ఏది, ఘృతే = నేతియందు, శ్రితః = ఆశ్రయమును పొందుచున్నదో, లేక, ఘృతమ్ = జలము, అస్య = ఈ యగ్నికి, ధామ = ధామము—అధికరణమో అనగా ఉండుటకు స్థానమో, ఆ యగ్నిని నీవు, అనుష్వధమ్ = అన్నముయొక్క అనుకూలమునకు, ఆవహ = చేర్పించుము, వృషభ = వర్షించు జనుడా! నీవు, స్వాహాకృతమ్ = వేదవాణిచే సిద్ధమొనర్చబడిన, హవ్యమ్ = తీసుకొనదగిన పదార్థమును, వక్షి = కోరుచున్నావు లేక పొందుచున్నావు. కనుక మమ్ము, మాదయస్వ = ఆనందింపజేయుము. ॥౭౮॥

భావార్థము :- జలములలో నెంత అగ్ని యున్నదో అదంతయు జలాధికరణ మనగా జలము నందుండునది యని అనబడును. అజ్యముచే వహ్ని వృద్ధి యగుచున్నటుల జలముచే సకలపదార్థములు

శ్యామాకాః చ, మే, నీవారాః, చ, మే, గోధూమాః, చ, మే, మసూరాః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (12)

పదార్థః :–(వ్రీహయః)తణ్డులాః(చ)షష్టికాః(మే)(యవాః)(చ)అథక్యః(మే)[మాషాః][చ] కలాయః[మే][తిలాః][చ]నారికేలాః[మే][ముద్గాః][చ]తత్సంస్కారాః [మే] [ఖల్వాః] చణకాః [చ]తత్సాధనమ్[మే][ప్రియఙ్గవః]ధాన్యవిశేషాః [చ] అన్యాని క్షుద్రాన్నాని [మే] [అణవః] సూక్ష్మ తణ్డులాః[చ]తత్పాకః[మే][శ్యామాకాః][చ][మే)[నీవారాః] వినా వపనేనోత్పన్నాః [చ]ఏతత్సం స్కారణమ్[మే][గోధూమాః][చ]ఏతత్సంస్కరణమ్[మే][మసూరాః][చ]ఏతత్సంబన్ధి[మే][య జ్ఞేన]సర్వాన్నప్రదేన పరమాత్మనా[కల్పన్తామ్]. ॥౧౨॥ అన్వయః :– మే వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చ మే ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే ప్రియఙ్గవశ్చ మేఽణవశ్చ మే శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే గోధూమాశ్చ మే మసూరాశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౨॥ భావార్థః :– మనుష్యై ర్వ్రీహ్యాదిభ్యః సుసంస్కృతానోదనాదీన్ సంపాద్య తేఽగ్నౌ హోతవ్యా భోక్తవ్యా అన్యే భోజయితవ్యాశ్చ. ॥౧౨॥

పదార్థము :–మే వ్రీహయః = నా వడ్లు, చ = అరువది దినములకు బండు షష్టికా ధాన్యములు, మే యవాః = నా యవలు, చ = కందులు, మే మాషాః = నా మినుములు, చ = బఠానీలు, మే తిలాః = నా నువ్వులు, చ = నారికేళములు, మే ముద్గాః = నా పెసలు. చ = వానిచే తయారయినవి, మే ఖల్వాః = నా సెనగలు, చ = తత్సాధనము, మే ప్రియంగవః = నా ఆరుగలు. చ = ఇతర క్షుద్ర ధాన్యములు, మే అణవః = నా సన్న వరిధాన్యము, చ = వాని పాకము, మే శ్యామాకాః = నా సామ[ధాన్యము]లు, చ = ఇతర అల్పధాన్యములు, మేనీవారాః = వి త్తకుండ మొలచు నీవారధాన్యములు, చ = వాని పాకము, మే గోధూమాః = నా గోధుమలు, చ = వాని పాకము, మే మసూరాః = నా మసూర [చిఱు సెనగలు] ధాన్యములు, చ = దానికి సంబంధించిన యితర ధాన్యములు, ఇవి యన్నియు, యజ్ఞేన = సకలాన్న దాతయగు పరమేశ్వరునిచే,కల్పన్తామ్ = సమృద్ధములగుగాక!

భావార్థము :– మానవులు ధాన్యాదులచే సు సంస్కృతములగు అన్నాదుల నొనర్చి, వాని నగ్ని యందు వ్రేల్చి, భుజించవలయును. ఇతరులకు తినిపించవలయును. ॥౧౨॥ (కాఽ౧)

---

కాఽ౨ అశ్మా చేత్యస్య దేవా ఋషయః, రత్నవాన్ ధనవానాత్మా దేవతా, భురిగతి శక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః. పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

అశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ మే సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మే ఽయశ్చ మే శ్యామం చ మే లోహం చ మే సీసం చ మే త్రపు చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౩॥

అశ్మా; చ, మే, మృత్తికా, చ, మే, గిరయః, చ, మే, పర్వతాః, చ, మే, సికతాః, చ, మే, వనస్పతయః, చ, మే, హిరణ్యమ్, చ, మే, అయః, చ, మే,

శ్యామమ్, చ, మే, లోహమ్, చ, మే, సీసమ్, చ, మే, త్రపు, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్.

పదార్థః :— (అశ్మా) పాషాణః (చ) హీరకాదీని రత్నాని (మే) (మృత్తికా) ప్రశంసితా మృత్ (చ) సాధారణా మృత్ (మే) (గిరయః) మేఘాః (చ) అన్నాది (మే) (పర్వతాః) హ్రస్వా మహాన్తః శైలాః (చ) సర్వధనమ్ (మే) (సికతాః) (చ) తత్రస్థాః పదార్థాః సూక్ష్మా బాలుకాః (మే) (వనస్పతయః) వటాదయః (చ) ఆమ్రాదయో వృక్షాః (మే) (హిరణ్యమ్) (చ) రజతాది (మే) (అయః) (చ) శస్త్రాణి (మే) (శ్యామమ్) శ్యామ మణిః (చ) శుక్త్యాది (మే) (లోహమ్) సువర్ణమ్. లోహమితి సువర్ణ నా . . . నిఘం. ౧. ౨. (చ) కాన్తి సారాదిః (మే) (సీసమ్) (చ) జతు (మే) (త్రపు) (చ) రజ్గమ్ (మే) (యజ్ఞేన) సంగతి కరణయోగ్యేన (కల్పన్తామ్). ॥౧౩॥ అన్వయః :— మేఽశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ మే సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మేఽయశ్చ మే శ్యామం చ మే లోహం చ మే సీసం చ మే త్రపు చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౩॥ భావార్థః :— మనుష్యాః పృథివీస్థాన్ పదార్థా న్సుపరీక్ష్య తేభ్యో రత్నాని ధాతూంశ్చ ప్రాప్య సర్వహితాయో పయుఞ్జీరన్. ॥౧౩॥

పదార్థము :— మే అశ్మా = నా రాయి, చ = వజ్రాది రత్నములు, మే మృత్తికా = నా మంచి మట్టి, చ = సాధారణ మట్టి, మే గిరయః = నా మేఘాదులు, చ = చిన్న మబ్బులు, మే పర్వతాః = నా చిన్న పెద్ద పర్వతములు, చ = పర్వతము లందుత్పన్నములగు పదార్థములు, మే సికతాః = నా గండ్ర యిసుక, చ = సన్న ఇసుక, మే వనస్పతయః = నా వటాది వృక్షములు, చ = మామిడి మొదలైన చెట్లు, మే హిరణ్యమ్ = అన్ని విధముల నా ధనము. చ = వెండి మొదలైనవి, మే అయః = నా లోహము. చ = శస్త్రములు, మే శ్యామమ్ = నా నీలమణులు. చ = చన్ద్రకాంతమణీ. ముత్యములు, మే లోహమ్ = నా సువర్ణము. చ = కాంతి సారము, మే సీసమ్ = నా సీసము, చ = లక్క, మే త్రపు = నా తగరము, చ = ఇత్తడి మొదలైనవి, ఇవి యన్ని, యజ్ఞేన = సంగతి యోగ్యములగు వ్యవహారములచే, కల్పన్తామ్ = సమర్థము లగు గాక ! ॥౧౩॥

భావార్థము :— మానవులు పృథివీస్థ పదార్థములను బాగుగ పరీక్ష జేసి వానినుండి రత్నములను ధాతువులను పొంది సర్వుల హితమునకై ఉపయోగించవలయును. ॥౧౩॥ ౯౬౨

---

౯౬౩ అగ్నిశ్చేత్యస్య దేవా ఋషయః, అగ్న్యాదియుక్త ఆత్మా దేవతా, భురిగష్టి శ్ఛన్దః, మధ్యమః స్వరః. పే

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

అగ్నిశ్చ మేఽఆపశ్చ మే వీరుధశ్చ మ ఓషధయశ్చ మే కృష్టపచ్యాశ్చ మేఽకృష్టపచ్యాశ్చ మే గ్రామ్యాశ్చ మే పశవ ఆరణ్యాశ్చ మే విత్తం చ మే విత్తిశ్చ మే భూతం చ మే భూతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౪॥

అగ్నిః, చ మే, ఆపః, చ, మే, వీరుధః, చ, మే, ఓషధయః, చ, మే, కృష్టపచ్యా ఇతి కృష్ట+పచ్యాః, చ, మే, అకృష్టపచ్యా ఇత్యకృష్ట+పచ్యాః,

చ, మే, గ్రామ్యాః, చ, మే, పశవః, ఆరణ్యాః, చ, మే, విత్తమ్, చ, మే, విత్తిః, చ మే, భూతమ్, చ, మే, భూతిః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (14)

పదార్థః :– (అగ్నిః)వహ్నిః(చ) విద్యుదాదిః(మే)(ఆపః)జలాని(చ)జలరత్నాని(మే)(వీరుధః)గుల్మ విశేషాః (చ)తృణశాకాది(మే)(ఓషధయః) యవసోమలతాద్యాః(చ)సర్వౌషధాది(మే)(కృష్టపచ్యాః) యా కృష్టేషు క్షేత్రేషు పచ్యన్తే తాః (చ)ఉత్తమాని శస్యాదీని(మే)(అకృష్టపచ్యాః) యా అకృష్టేషు జంగలాదిషు పచ్యన్తే తాః (చ) పర్వతాదిషు పక్తవ్యాః (మే) (గ్రామ్యాః) గ్రామే భవాః(చ)నగరస్థాః (మే) (పశవః) గవాద్యాః (ఆరణ్యాః) అరణ్యే వనే భవాః మృగాదయః (చ) సింహాదయః (మే)(విత్తమ్) లబ్ధమ్(చ)సర్వం ధనమ్ (మే) (విత్తిః) ప్రాప్తిః (చ) ప్రాప్తవ్యమ్ (మే) (భూతమ్)రూపమ్(చ) నానావిధమ్(మే) (భూతిః) ఐశ్వర్యమ్ (చ) ఏతత్సా ధనమ్ (మే) (యజ్ఞేన) సంగతి కరణయోగ్యేన కల్పన్తామ్. ॥౧౪॥ అన్వయః :– మేఽగ్నిశ్చ మే ఆపశ్చ మే వీరుధశ్చ మ ఓషధయశ్చ మే కృష్టపచ్యాశ్చ మేఽకృష్టపచ్యాశ్చ మే గ్రామ్యాశ్చ మే ఆరణ్యాశ్చ పశవో మే విత్తం చ మే విత్తిశ్చ మే భూతం చ మే భూతిశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౪॥భావార్థః :–యే మనుష్యాః ! పావకాది విద్యయా సంగంతవ్యం శిల్పయజ్ఞం సాధ్నువన్తి త ఐశ్వర్యం లభన్తే ॥౧౪॥

పదార్థము :– మే అగ్నిః = నా అగ్ని. చ = విద్యుత్తాదులు, మే ఆపః = నా జలములు, చ = మఱియు జలములందుండు రత్నముక్తాదులు, మే వీరుధః = నా లతా గుల్మములు, చ = శాకాదులు, మే ఓషధయః = నా సోమలతాద్యోషధులు, చ = ఫలపుష్పాదులు, మే కృష్టపచ్యాః = నా పొలములలో పండు ధాన్యములు, చ = ఉత్తమాన్నములు, మే అకృష్టపచ్యాః = అడవులందు పండు ధాన్యములు, చ = పర్వతాది స్థానములందు ఫలించు ధాన్యములు, మే గ్రామ్యాః = నా గవాది గ్రామ్య జంతువులు, చ = నగరమందుండునవి, మే ఆరణ్యాః = వనము నందుండు మృగములు, చ = సింహాదులు, పశవః = పశువులు, మే విత్తమ్ = నేను పొందిన పదార్థములు, చ = సకల ధనము, మే విత్తిః = నా ప్రాప్తి, చ = పొందదగినవి, మే భూతమ్ = నా రూపము, చ = నానా విధములైన పదార్థములు, మే భూతిః = నా ఐశ్వర్యము, చ = మఱియు దాని సాధనములు, ఇవి యన్ని, యజ్ఞేన = మేళవింపదగు శిల్పవిద్యచే, కల్పన్తామ్ = సమర్థములగుగాక ! ॥౧౪॥

భావార్థము :– ఏ మానవులు పావకాది విద్యలచే సంగతి యొనర్చదగు శిల్పవిద్యా రూప యజ్ఞమును సాధించుదురో వారైశ్వర్యమును పొందగలుగుదురు. ॥౧౪॥ ౧౮౩

---

౧౮౪ వసుచేత్యస్య దేవా ఋషయః, ధనాదియుక్త ఆత్మా దేవతా, నిచృదార్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

వసు చ మే వసతిశ్చ మే కర్మ చ మే శక్తిశ్చ మేఽర్థశ్చ మ ఏమశ్చ
మఽఇత్యా చ మే గతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౫॥

వసు, చ, మే, వసతిః, చ, మే, కర్మ, చ, మే, శక్తిః, చ, మే, అర్థః, చ, మే, ఏమః,

చ, మే, ఇత్యా, చ, మే, గతిః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (15)

పదార్థః :—(వసు)వస్తు(చ)ప్రియమ్ (మే) (వసతిః) యత్ర వసన్తి సా (చ)సాధనాని (మే) (కర్మ)అభీప్సితతమా క్రియా(చ)కర్తా(మే)(శక్తిః)సామర్థ్యమ్(చ)ప్రేమ (మే)(అర్థః) సకలపదార్థ సంచయః(చ)సంచేతా(మే)(ఏమః)ఏతి యేన స ప్రయత్నః(చ)బోధః (మే) (ఇత్యా) ఏతి జానాతి యయా రీత్యా సా(చ)యుక్తిః(మే)(గతిః)గమనమ్(చ)ఉత్క్షేపణాది కర్మ(మే) (యజ్ఞేన) పురుషార్థానుష్ఠానేన(కల్పన్తామ్). ॥౧౫॥ అన్వయః :—మే వసు చ మే వసతిశ్చ మే కర్మ చ మే శక్తిశ్చ మేఽర్థశ్చ మ ఏమశ్చ మ ఇత్యా చ మే గతిశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౫॥ భావార్థః :— హే మనుష్యాః ! యే జనాః సర్వం సామర్థ్యాదికం సర్వహితాయైవ కుర్వన్తి త ఏవ ప్రశంసితా భవన్తి.

పదార్థము :— మే వసు = నా వస్తువు, చ = ప్రియపదార్థములు, ప్రియమైన కార్యములు, మే వసతిః = నా వసతి (బస్తీ) ప్రదేశము, చ = భృత్యులు, మే కర్మ = నా యభీప్సితతమకర్మలు, చ = కర్త. మే శక్తిః = నా సామర్థ్యము. చ = ప్రేమ, మే అర్థః = సకల పదార్థముల సంచయము. చ = సంచయ మొనర్చువాడు. మే ఏమః = నా సుయత్నములు, చ = బుద్ధి. మే ఇత్యా = నా సువ్యవహారముల నెఱుగు రీతి, చ = యుక్తి, మే గతిః = నా నడక, చ = ఎగురుట దుముకుట మొదలగు క్రియలు, ఇవి యన్నియు, యజ్ఞేన = పురుషార్థానుష్ఠానముచే కల్పంతామ్ = సమర్థములగుగాక !

భావార్థము :- మానవులారా ! ఎవరు తన సమస్త సామర్థ్యాదులను సర్వహితార్థము వినియోగించెదరో వారే ప్రశంసనీయు లగుచున్నారు, ॥౧౫॥ (కా౦౪)

---

కా౦౬ అగ్నిశ్చేత్యస్య దేవా ఋషయః, అగ్న్యాదివిద్యావిదాత్మా దేవతా, నిచృదతి శక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

అగ్నిశ్చ మఽఇన్ద్రశ్చ మే సోమశ్చ మఽఇన్ద్రశ్చ మే సవితా చ మఽ
ఇన్ద్రశ్చ మే సరస్వతీ చ మఽఇన్ద్రశ్చ మే పూషా చ మఽఇన్ద్రశ్చ మే
బృహస్పతిశ్చ మఽఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౬॥

అగ్నిః, చ, మే, ఇన్ద్రః, చ, మే, సోమః, చ, మే, ఇన్ద్రః, చ, మే,సవితా, చ, మే, ఇన్ద్రః, చ, మే, సరస్వతీ, చ, మే, ఇన్ద్రః, చ, మే, పూషా, చ, మే, ఇన్ద్రః, చ, మే, బృహస్పతిః చ, మే, ఇన్ద్రః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్.

పదార్థః :—(అగ్నిః)సూర్యః ప్రసిద్ధస్వరూపః(చ)భౌమః(మే)(ఇన్ద్రః)విద్యుత్ (చ) వాయుః (మే)(సోమః)సోమ్యగుణసమ్పన్నో జనః పదార్థో వా(చ)వృష్టిః(మే) (ఇన్ద్రః) అన్యాయవిదారకః సభేశః(చ)సభ్యాః(మే)(సవితా)ఐశ్వర్యయుక్తః(చ)ఏతత్సాధనాని(మే)(ఇన్ద్రః)సకలాఽవిద్యాచ్ఛేదకో ఽధ్యాపకః(చ)విద్యార్థినః(మే)(సరస్వతీ) ప్రశస్తబోధః శిక్షాయుక్తా వాణీ వా (చ) సత్యవక్తా (మే) (ఇన్ద్రః)విద్యార్థినో జాడ్యవిచ్ఛేదక ఉపదేశకః(చ)శ్రోతారః(మే)(పూషా)పోషకః(చ) యుక్తాహార విహారౌ(మే)(ఇన్ద్రః)యః పుష్టికరణవిద్యాయాం రమతే (చ) వైద్యః(మే) (బృహస్పతిః) బృహతాం

వ్యవహారాణాం రక్షకః(చ)రాజా(మే)(ఇన్ద్రః)సకలైశ్వర్యవర్ధకః(చ)సేనేశః(మే)(యజ్ఞేన) విద్యైశ్వర్యోన్నతికరణేన(కల్పన్తామ్). ॥౧౬॥ అన్వయః :—మేఽగ్నిశ్చ మ ఇన్ద్రశ్చ మే సోమశ్చ మ ఇన్ద్రశ్చ మే సవితా చ మ ఇన్ద్రశ్చ మే సరస్వతీ చ మ ఇన్ద్రశ్చ మే పూషా చ మ ఇన్ద్రశ్చ మే బృహస్పతిశ్చ మ ఇన్ద్రశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౬॥ భావార్థః :—హే మనుష్యాః యుష్మాభిః సువిచారేణ స్వకీయాః సర్వే పదార్థాః శ్రేష్ఠపాలనాయ దుష్టశిక్షణాయ చ సతతం యోజనీయాః. ॥౧౬॥

పదార్థము :- మే అగ్నిః = నా ప్రసిద్ధమగు సూర్య రూపాగ్ని, చ = భూమి మీద లభించు భౌతికాగ్ని, మే ఇన్ద్రః = నా విద్యుద్రూపాగ్ని, చ = పవనము. మే సోమః = నా శాంతి గుణము గల పదార్థము లేక సోమ్య గుణులు, చ = వృష్టి, మే ఇన్ద్రః = అన్యాయమును తొలగించు సభాపతి, చ = సభాసదులు, మే సవితా = నా ఐశ్వర్య యుక్త కార్యములు, చ = తత్సాధనములు, మే ఇన్ద్రః = సమస్త అవిద్యలను నశింపజేయు అధ్యాపకుడు, చ = మఱియు విద్యార్థి, మే సరస్వతీ నా ప్రశంసిత బోధ, శిక్షాపూర్ణవాణి, చ = సత్యవక్త, మే ఇన్ద్రః = విద్యార్థుల మౌఢ్యమును హరింప జేయు నుపదేశకుడు, చ = శ్రోతలు, మే పూషా = నా పోషకుడు, చ = యుక్తాహార విహార నిద్రాదులు, మే ఇంద్రః = నాయొక్క పుష్టికర విద్యయందు రమించువాడు, చ = వైద్యుడు, మే బృహస్పతిః = నాయొక్క పెద్ద పెద్ద వ్యవహారములను రక్షించువాడు, చ = రాజు మఱియు, మే ఇంద్రః = నా సమస్తైశ్వర్యమును వృద్ధిపఱచువాడు, చ = సేనాపతి ఇవి యన్నియు, యజ్ఞేన = విద్యైశ్వర్యముల యున్నతి యొనర్చుటచే, కల్పన్తామ్ = సమర్థములగుగాక ! ॥౧౬॥

భావార్థము :—మానవులారా ! మీరు మంచి ఆలోచనతో మీకున్న సకల పదార్థములను శిష్ట రక్షణ దుష్టశిక్షణలకై సతతము వినియోగించవలయును. ॥౧౬॥ (౯౬౫)

---

౯౬౬. మిత్రశ్చేత్యస్య దేవా ఋషయః, మిత్రైశ్వర్యసహిత ఆత్మా దేవతా, స్వరాట్ శక్వరీ ఛన్దః, ధైవతః స్వరః. పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

> మిత్రశ్చ మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మఽఇన్ద్రశ్చ మే ధాతా చ మఽ
> ఇన్ద్రశ్చ మే త్వష్టా చ మ ఇన్ద్రశ్చ మే మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే
> విశ్వే చ మే దేవా ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౭॥

మిత్రః, చ, మే, ఇంద్రః, చ, మే, వరుణః, చ, మే, ఇంద్రః, చ, మే, ధాతా, చ, మే, ఇంద్రః, చ, మే, త్వష్టా, చ, మే, ఇంద్రః, చ, మే, మరుతః, చ, మే, ఇంద్రః, చ, మే,విశ్వే, చ,మే,దేవాః,ఇంద్రః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్.

పదార్థః :—(మిత్రః)ప్రాణః(చ)సమానః(మే)(ఇన్ద్రః)విద్యుత్(చ) తేజః (మే) (వరుణః) ఉదానః. ప్రాణోదానౌ మిత్రావరుణౌ. శ. ౩.౧.౧౩. (చ)వ్యానః(మే)(ఇన్ద్రః)సూర్యః (చ) ధృతిః (మే)(ధాతా)ధర్తా(చ)ధైర్యమ్(మే)(ఇన్ద్రః)పరమైశ్వర్యప్రాపకః(చ)న్యాయః(మే) (త్వష్టా)విచ్ఛేదకోఽగ్నిః(చ)పురుషార్థః(మే)(ఇన్ద్రః)శత్రువిదారకో రాజా(చ)శిల్పమ్(మే)(మరుతః)బ్రహ్మాణ్డస్థా

అన్యే వాయవః(చ)శారీరా ధాతవః(మే)(ఇన్ద్రః)సర్వాభివ్యాపికా విద్యుత్ (చ) ఏతత్ప్రయోగః (మే)(విశ్వే)సర్వే(చ)సర్వస్వమ్(మే)(దేవాః)దివ్యగుణాః పృథివ్యాదయః(ఇన్ద్రః)పరమైశ్వర్యదాతా (చ) ఏతదుపయోగః(మే)(యజ్ఞేన)వాయువిద్యావిధానేన(కల్పన్తామ్). ॥౧౭॥ అన్వయః :–మే మిత్రశ్చ మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మ ఇన్ద్రశ్చ మే ధాతా చ మ ఇన్ద్రశ్చ మే త్వష్టా చ మ ఇన్ద్రశ్చ మే మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే విశ్వే చ దేవా మ ఇన్ద్రశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౭॥

భావార్థః :–మనుష్యాః ప్రాణవిద్యుద్విద్యాం విజ్ఞాయైతయోః సర్వత్రాభివ్యాప్తిం చ జ్ఞాత్వా దీర్ఘ జీవనం సమ్పాదయేయుః. ॥౧౭॥

పదార్థము :–మే మిత్రః = హృదయము నందుండు ప్రాణవాయువు, చ = నాభిస్థ సమాన వాయువు, మే ఇంద్రః = నా విద్యుద్రూపాగ్ని, చ = తేజస్సు, మే వరుణః = ఉదాన మను కంఠ స్థ పవనము, చ = శరీరమంతట విహరించు వాయువు, మే ఇంద్రః = నా సూర్యుడు, చ = ధార ణాకర్షణములు, మే ధాతా = నన్ను ధారణ చేయునట్టివాడు, చ = ధైర్యము, మే ఇంద్రః = నాకు పరమైశ్వర్యమును లభింపజేయువాడు, చ = న్యాయయుక్త పురుషార్థము, మే త్వష్టా = పదార్థము ములను ఛిన్న భిన్న మొనర్చు నగ్ని, చ = శిల్పము, మే ఇంద్రః = శత్రువులను విదీర్ణ మొనర్చు రాజు, చ = చేతిపని, మే మరుతః = ఈ బ్రహ్మాండములో నున్నవారు, మఱియు వాయు వులు, చ = శరీరధాతువులు, మే ఇంద్రః = సర్వత్ర వ్యాపకమైయున్న నా విద్యుత్. చ = దాని కార్యము, మే విశ్వే = నా సమస్త పదార్థములు. చ = సర్వస్వము. దేవాః = ఉత్తమ గుణయుక్తము లగు పృథివ్యాదులు, మే ఇంద్రః = నా పరమైశ్వర్య దాత, చ = అతని ఉపయోగము ఇవి యన్నియు. యజ్ఞేన = పవన విద్యా విధానముచే. కల్పంతామ్ = సమర్థములగు గాక ! ॥౧౭॥

భావార్థము :–మానవుడు ప్రాణ విద్యను, విద్యుద్విద్యను గ్రహించి. అవి యంతటను అన్ని వైపులను వ్యాప్తములని యెఱిగి దీర్ఘ జీవనమును సంపాదించవలయును. ॥౧౭॥ (౯౬౬)

---

౯౬౭. పృథివీ చేత్యస్య దేవా ఋషయః, రాజ్యైశ్వర్యాదియుక్తాత్మా, దేవతా, భురిక్ శక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

పృథివీ చ మ ఇన్ద్రశ్చ మేఽన్తరిక్షం చ మ ఇన్ద్రశ్చ మే ద్యౌశ్చ మ ఇన్ద్రశ్చ మే సమాశ్చ మ ఇన్ద్రశ్చ మే నక్షత్రాణి చ మ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౮॥

పృథివీ. చ, మే, ఇన్ద్రః, చ, మే, అన్తరిక్షమ్, చ, మే, ఇంద్రః, చ, మే, ద్యౌః చ, మే, ఇంద్రః, చ, మే, సమాః, చ, మే, ఇంద్రః, చ, మే, నక్షత్రాణి, చ, మే, ఇంద్రః, చ, మే, దిశః,చ, మే, ఇంద్రః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్.

పదార్థః :–(పృథివీ)విస్తీర్ణా భూమిః(చ)అత్రస్థాః పదార్థాః(మే)(ఇన్ద్రః)విద్యుత్క్రియా(చ) బలప్రదా(మే)(అన్తరిక్షమ్)అక్షయమాకాశకమ్(చ) అత్రస్థాః పదార్థాః(మే)(ఇన్ద్రః)సర్వైశ్వర్యాధా రః)(చ) ఏతత్ప్రయోగః(మే)(ద్యౌః)ప్రకాశకర్మ(చ)ఏతత్సాధకాః పదార్థాః(మే)(ఇన్ద్రః)సకల

పదార్థవిచ్ఛేత్తా (చ) విచ్ఛేద్యాః పదార్థాః(మే)(సమాః) సంవత్సరాః (చ) క్షణాదయః (మే) (ఇన్ద్రః) కాలజ్ఞాననిమిత్తః (చ)గణితమ్(మే)(నక్షత్రాణి)యాని కారణరూపేణ న క్షీయన్తే తాని భువనాని (చ)ఏతత్సమ్బన్ధినః (మే) (ఇన్ద్రః)లోకలోకాన్తరస్థా విద్యుత్(చ)(మే) (దిశః) పూర్వాద్యాః (చ) ఏతత్స్థాని వస్తూని(మే) (ఇన్ద్రః)దిగ్జ్ఞాపకః (చ) ధ్రువతారా (మే) (యజ్ఞేన) పృథివీకాలవిజ్ఞాపకేన (కల్పన్తామ్). ॥౧౮॥ అన్వయః :—మే పృథివీ చ మ ఇన్ద్రశ్చ మేఽన్తరిక్షం చ మ ఇన్ద్రశ్చ మే ద్యౌశ్చ మ ఇన్ద్రశ్చ మే సమాశ్చ మ ఇన్ద్రశ్చ మే నక్షత్రాణి చ మ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్రశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౮॥ భావార్థః :—మనుష్యాః పృథివ్యాదిపదార్థాం స్తత్రస్థాం విద్యుతం చ యావన్న జానన్తి తావదైశ్వర్యం నహ్యాప్నువన్తి. ॥౧౮॥

పదార్థము :—మే పృథివి = నా విస్తారమైన భూమి, చ = అందున్న పదార్థములు, మే ఇన్ద్రః = నా విద్యుత్క్రియ, చ = బల మొసగు వ్యాయామాది క్రియలు, మే అంతరిక్షమ్ = వినాశ రహితమగు నాకాశము, చ = ఆకాశమున నుండు సకల పదార్థములు, మే ఇంద్రః = నా సకలైశ్వర్యాధారము, చ = దాని ప్రయోగము, మే ద్యౌః = నా ప్రకాశ కర్మ, చ = దానిని సాధించు పదార్థములు. మే ఇంద్రః = నా సకల పదార్థములను ఛిన్న భిన్న మొనర్చు సూర్యుడు, చ = భేదనీయ పదార్థములు, మే సమాః = నా సంవత్సరములు, చ = క్షణ పల విపల ఘటీ దినాదులు, మే ఇంద్రః = నా కాలజ్ఞానము యొక్క నిమిత్తము, చ = గణిత విద్య, మే నక్షత్రాణి = కారణ రూపమున స్థిరములై నశించని లోకములు, చ = వానితో సంబంధముంచు ప్రాణులు, మే ఇంద్రః = లోక లోకాంతరములలో నుండు నా విద్యుత్తు, చ = విద్యుత్తుతో సంయోగ మొనర్చుచు నా యా లోకములందుండు పదార్థములు, మే దిశః = నా పూర్వాది దిశలు, చ = తత్రస్థ వస్తువులు, మే ఇంద్రః = నా దిక్కుల జ్ఞాపకము, చ = ధ్రువ నక్షత్రము ఇవన్నియు, యజ్ఞేన = పృథివీ జ్ఞానమును కలిగించు కర్మచేతను, సమయజ్ఞానమును కలిగించు కర్మచేతను, కల్పంతామ్ = సమర్థము లగుగాక ! ॥౧౮॥

భావార్థము :—మానవులు పృథివ్యాది పదార్థములను, అందుండు విద్యుత్తును గ్రహించనంత వరకు ఐశ్వర్యవంతులు కాజాలరు. ॥౧౮॥ (౯౬౭)

---

౬౬౮ అంశుశ్చేత్యస్య దేవా ఋషయః, పదార్థవిదాత్మా దేవతా, నిచృదత్యష్టి శ్ఛన్దః, గాంధారః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

అంశుశ్చ మే రశ్మిశ్చ మేఽదాభ్యశ్చ మేఽధిపతిశ్చ మ ఉపాంశుశ్చ మేఽన్తర్యామశ్చ మ ఐన్ద్రవాయవశ్చ మే మైత్రావరుణశ్చ మ ఆశ్వినశ్చ మే ప్రతిప్రస్థానశ్చ మే శుక్రశ్చ మే మన్థీ చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౧౯॥

అంశుః, చ, మే, రశ్మిః, చ, మే, అదాభ్యః, చ, మే, అధిపతి రిత్యధి+పతిః, చ, మే, ఉపాంశురిత్యుపఽఅంశుః,చ,మే,అన్తర్యామ ఇత్యన్తః+యామః, చ, మే, ఐన్ద్రవాయవః, చ, మే, మైత్రావరుణః, చ, మే, ఆశ్వినః, చ, మే,

ప్రతిప్రస్థాన ఇతి ప్రతి + ప్రస్థానః, చ, మే, శుక్రః, చ, మే, మన్థీ, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (19)

పదార్థః :-(అంశుః)వ్యాప్తిమాన్ సూర్యః. అశౌశౌఙ్ వ్యాప్తా విత్యస్మాద్ బాహులకేనౌణా దిక ఉః ప్రత్యయో నుగాగమశ్చ (చ)ప్రతాపః(మే)(రశ్మిః)యేనాశ్నాతి సః. అశ్ భోజనే ధాతో ర్బాహులకాన్ మిః ప్రత్యయో రశాదేశశ్చ. ఉ ౪.౪౬.(చ)వివిధమ్(మే)(అదాభ్యః)ఉపక్షయరహితః (చ)రక్షకః(మే)(అధిపతిః)అధిష్ఠాతా(చ)అధ్యస్తమ్(మే)(ఉపాంశుః) ఉపగతా అంశవో యత్ర స ఉపాంశు ర్జపః(చ)రహస్యవిచారః(మే)(అన్తర్యామః)యోఽన్తర్మధ్యే యాతి స వాయుః (చ)బలమ్ (మే)(ఐన్ద్రవాయవః)ఇన్ద్రో విద్యుద్వాయుశ్చ తయో రయం సంబన్ధీ(చ)జలమ్(మే)(మైత్రావరుణః) ప్రాణోదానయో రయం సహచారీ(చ) వ్యానః (మే) (ఆశ్వినః)అశ్వినోః సూర్యాచన్ద్రమసో రయం మధ్యవర్తీ(చ)ప్రభావః(మే)(ప్రతిప్రసానః)యః ప్రప్రస్థానం గమనం ప్రతి వర్తతే సః(మే)(శుక్రః)శుద్ధస్వరూపః(చ)వీర్యకరః(మే)(మన్థీ)మథితుం శీలః(చ)పయః కాష్ఠాదిః(మే)(యజ్ఞేన)అగ్నిపదార్థోపయోగేన కల్పన్తామ్. ॥౧౯॥ అన్వయః :—మేఽంశుశ్చ మే రశ్మిశ్చ మేఽదాభ్యశ్చ మేఽధిపతిశ్చ మ ఉపాంశుశ్చ మేఽన్తర్యామశ్చ మ ఐన్ద్రవాయవశ్చ మే మైత్రావరుణశ్చ మ ఆశ్వినశ్చ మే ప్రతిప్రస్థానశ్చ మే శుక్రశ్చ మే మన్థీ చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౧౯॥ భావార్థః :-యది మనుష్యాః సూర్యప్రకాశాదిభ్యోఽప్యుపకారం గృహ్ణీయు స్తర్హి విద్వాంసో భూత్వా క్రియకౌశలం కుతో న ప్రాప్నుయుః? ॥౧౯॥

పదార్థము :—మే అంశు = నా వ్యాప్తిమంతుడగు సూర్యుడు, చ = అతని ప్రతాపము, మే రశ్మిః = నాభోజన కర్మ, చ = పలురకముల భోజనము, మే అదాభ్యః = నా వినాశ రహితుడు, చ = రక్షకుడు, మే అధిపతిః = నా స్వామి, చ = అధిష్ఠానము, మే ఉపాంశుః = నా మానసిక జపము, చ = ఏకాంత విచారణ, మే అన్తర్యామః = మధ్యను వెళ్లు పవనము, చ = మఱియు బలము, ఐంద్రవాయవః = విద్యుత్పవనములతోపాటు సంబంధముంచు కార్యము. చ = జలము, మే మైత్రావరుణః = ప్రాణోదానములతో నడచు వాయువు, చ = వ్యాన వాయువు, మే ఆశ్వినః = సూర్య చంద్రుల మధ్య నున్న తేజము, చ = ప్రభావము, మే ప్రతిప్రస్థానః = నడక నడకలకు సంబంధించి వర్తించువాడు, చ = భ్రమణము, మే శుక్రః = నా శుద్ధ స్వరూపము, చ = వీర్య కరము, మే మన్థీః = నా మథన మొనర్చువాడు, చ = పాలు లేక పుల్లలు మొదలగు సమస్త పదార్థములు, యజ్ఞేన = అగ్నియొక్క ఉపయోగముచే, కల్పన్తామ్ = సమర్థములగును గాక !

భావార్థము :-మానవుడు సూర్యప్రకాశాదులచే నుపకారములను గ్రహించుచో విద్వాంసులై క్రియా కుశలత్వము నెందుకు పొందలేరు ? ॥౧౯॥ (౯౭౮)

---

౯౭౯ ఆగ్రయణశ్చేత్యస్య దేవా ఋషయః, యజ్ఞానుష్ఠానాత్మా దేవతా, స్వరాడతి ధృతి శ్ఛన్దః, షడ్జః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

ఆగ్రయణశ్చ మే వైశ్వదేవశ్చ మే ధ్రువశ్చ మే వైశ్వానరశ్చ మ ఐన్ద్రాగ్నశ్చ మే మహావైశ్వదేవశ్చ మే మరుత్వతీయాశ్చ మే నిష్కేవల్యశ్చ

మే సావిత్రశ్చ మే సారస్వతశ్చ మే పాత్నీవతశ్చ మే హారియోజనశ్చ
మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౨౦॥

ఆగ్రయణః, చ మే, వైశ్వదేవ ఇతి వైశ్వ+దేవః, చ, మే, ధ్రువః, చ, మే, వైశ్వానరః, చ, మే, ఐన్ద్రాగ్నః. చ, మే, మహావైశ్వదేవ ఇతి మహా+వైశ్వదేవః, చ మే, మరుత్వతీయాః, చ, మే, నిష్కేవల్యాః. నిః+కేవల్య ఇతి నిః+కేవల్యాః. చ, మే, సావిత్రః, చ, మే, సారస్వతః చ, మే, పాత్నీవత ఇతి పాత్నీ+వతః, చ, మే, హారియోజన ఇతి హారి+యోజనః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (20)

పదార్థః :-(ఆగ్రయణః) మార్గశీర్షాది మాసనిష్పన్నో యజ్ఞవిశేషః (చ) (మే) (వైశ్వదేవః) విశ్వేషాం దేవానామయం సమ్బంధీ (చ) (మే) (ధ్రువః) నిశ్చలః (చ)(మే) (వైశ్వానరః) విశ్వేషాం సర్వేషాం నరాణామయం సత్కారః (చ)(మే) (ఐన్ద్రాగ్నః) ఇన్ద్రో వాయురగ్ని ర్విద్యుచ్చ తాభ్యామ్ నిర్వృత్తః (చ) (మే) (మహావైశ్వదేవః) మహతాం విశ్వేషాం సర్వేషామయం వ్యవహారః (చ) (మే) (మరుత్వతీయాః) మరుతాం సమ్బన్ధినో వ్యవహారాః (చ) (మే) (నిష్కేవల్యాః) నితరాం కేవలం సుఖం యస్మిం స్తస్మిన్ భవః (చ) (మే) (సావిత్రః) సవితుః సూర్యస్యాయం ప్రభావః (చ) (మే) (సారస్వతః) సరస్వత్యా వాణ్యా అయం సమ్బన్ధీ (చ) (మే) (పాత్నీవతః) ప్రశస్తా పత్నీ యజ్ఞసంబంధినీ తద్వతోఽయమ్ (చ) (మే) (హారియోజనః) హరీణా మశ్వానాం యోజయితా తస్యాయ మనుక్రమః (చ)(మే) (యజ్ఞేన)సంగతికరణేన (కల్పన్తామ్). ॥౨౦॥ అన్వయః :- మ ఆగ్రయణశ్చ మే వైశ్వదేవశ్చ మే ధ్రువశ్చ మే వైశ్వానరశ్చ మ ఐన్ద్రాగ్నశ్చ మే మహావైశ్వదేవశ్చ మే మరుత్వతీయాశ్చ మే నిష్కేవల్యశ్చ మే సావిత్రశ్చ మే సారస్వతశ్చ మే పాత్నీవతశ్చ మే హారియోజనశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౨౦॥ భావార్థః :-యే మనుష్యా స్స్వామయికీం క్రియాం విద్వత్సంగం చాశ్రిత్య వివాహితస్త్రీవ్రతా భవేయు స్తే పదార్థవిద్యాం కుతో న జానీయుః ?

పదార్థము :-మే ఆగ్రయణః = మార్గశిర మాసాదులందు నిష్పన్నమైన నా యజ్ఞము, చ = దాని సామగ్రి, మే వైశ్వదేవః = నాయొక్క సమస్త విద్వాంసులతో సంబంధమున్న భావము, చ = దాని ఫలము. మే ధ్రువః = నానిశ్చల వ్యవహారము. చ = దాని సాధనములు. మే వైశ్వానరః = నాదు సకల మానవ సత్కారము. చ = సత్కరించువాడు. మే ఐంద్రాగ్నః = పవన విద్యుత్తులచే సిద్ధమైన కార్యము. చ = మరియు దాని సాధనములు. మే మహావైశ్వదేవః = నా ప్రాచీనుల వ్యవహారము. చ = వారి సాధనములు. మే మరుత్వతీయాః = పవనములతో సంబంధముండు వ్యవహారములు చ = వానిఫలితము, మే నిష్కేవల్యః = నిరంతరము సుఖములు కలుగు నా కార్యము. చ = దాని సాధనములు. మే సావిత్రః = నా సూర్యుని ప్రభావము. చ = దాని ఉపకారము. మే సారస్వతః = వాణీ సంబంధ వ్యవహారము. చ = దాని ఫలము. మే పాత్నీవతః = మే ప్రశంసనీయురాలైన యజ్ఞ సంబంధపు భార్య యొక్క కార్యము. చ = దాని సాధనములు, మే హారియోజనః = గుర్రములను రథమున పూన్చుట, చ = దాని సామగ్రి యజ్ఞేన = పదార్థములను మేళవింపజేయుటచే, కల్పంతామ్ = సమర్థములగుగాక ! ॥౨౦॥

భావార్థము :—ఏ మానవులు కార్యకాలోచిత కర్మను, విప్రశాస్త్రగత్యమును ఆశ్రయించియు, వివాహితస్త్రీ వ్రతులును అయ్యెదరో వారు పదార్థ విద్యను ఏల ఎఱుగజాలరు ? ॥౨౦॥ (క్కా-క)

---

౨౧. స్రుచశ్చేత్యస్య దేవా ఋషయః, యజ్ఞాఙ్గవానాత్మా దేవతా, విరాడ్ ధృతి శ్ఛన్దః, ఋషభః స్వరః.

పున స్తమేవాహ. మఱల నా విషయమే.

స్రుచశ్చ మే చమసాశ్చ మే వాయవ్యాని చ మే ద్రోణకలశశ్చ మే
గ్రావాణశ్చ మేఽధిషవణే చ మే పూతభృచ్చ మఽఆధవనీయశ్చ మే
వేదిశ్చ మే బర్హిశ్చ మేఽవభృథశ్చ మే స్వగాకారశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥

స్రుచః, చ, మే, చమసాః, చ, మే, వాయవ్యాని, చ, మే, ద్రోణకలశ ఇతి ద్రోణ+కలశః, చ, మే, గ్రావాణః, చ, మే, అధిషవణే, అధిసవనేఇత్యధి+సవనే, చ, మే, పూతభృదితి పూత+భృత్, చ మే, ఆధవనీయ ఇత్యా+ధవనీయః, చ, మే, వేదిః, చ, మే, బర్హిః, చ, మే, అవభృథ ఇత్యవ+భృథః, చ, మే, స్వగాకార ఇతి స్వగా+కారః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (21)

పదార్థః :—(స్రుచః) జుహ్వాదయః (చ) తచ్ఛుద్ధిః (మే) (చమసాః) హోమభోజనపాత్రాణి (చ) ఉపకరణాని (మే) (వాయవ్యాని) వాయుషు సాధూని (చ) పవనశుద్ధికరాణి (మే) (ద్రోణకలశః) ద్రోణశ్చాసౌ కలశశ్చ పాత్రవిశేషః (చ) పరిమాణవిశేషాః (మే) (గ్రావాణః)శిలాఫలకాదయః (చ) ముశలోలూఖలే (మే) (అధిషవణే) సోమలతాద్యోషధిసాధకే (చ) కుట్టనపేషణక్రియా (మే) (పూతభృత్) యేన పూతం బిభర్తి తచ్ఛుద్ధికరం సూర్యాదికమ్ (చ) మార్జన్యాదికమ్ (మే) (ఆధవనీయః) ఆధవనసాధనపాత్రవిశేషః (చ) మల్లికాదయః (మే) (వేదిః) యత్ర హూయతే (చ) చతుష్కాదిః (మే) (బర్హిః) ఉపవర్ధకో దర్భసమూహః (చ) తద్యోగ్యమ్ (మే) (అవభృథః)యజ్ఞాన్తః స్నానాదికమ్ (చ) సుగన్ధ లేపనమ్ (మే) (స్వగాకారః) యేన స్వాన్ పదార్థాన్ గాతే తే కరోతీతి (చ) పవిత్రీకరణమ్ (మే) (యజ్ఞేన) హవనాదినా (కల్పన్తామ్) సమర్థయన్తు ॥౨౧॥ అన్వయః :— మే స్రుచశ్చ మే చమసాశ్చ మే వాయవ్యాని చ మే ద్రోణకలశశ్చ, మే గ్రావాణశ్చ మేఽధిషవణే చ మే పూతభృచ్చ మ ఆధవనీయశ్చ మే వేదిశ్చ బర్హిశ్చ మేఽవభృథశ్చ మే స్వగాకారశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౨౧॥ భావార్థః :—త ఏవ మనుష్యా యజ్ఞం కర్తుం శక్నువన్తి యే సాధనోపసాధన సామగ్రీ రలం కుర్వన్తి. ॥౨౧॥

పదార్థము :— మే స్రుచః = నా స్రువాదులు, చ = వాని శుద్ధి, మే చమసాః = యజ్ఞము లేక పాకముచేయు పాత్రలు, చ = వాని పదార్థములు, మే వాయవ్యాని = నా పవనములలోని మంచి పదార్థములు, చ = పవనములను శుద్ధియొనర్చు కార్యములు, మే ద్రోణకలశః = నా యజ్ఞక్రియాకలశము, చ = దాని పరిమాణము, మే గ్రావాణః = నాకు చెందిన సాన సన్నికల్లు మొదలగు రాళ్లు, చ =

ద్రోలు ద్రోకళ్లు, మే అధిషవణే = నాకు చెందిన సోమలతాద్యోషధములను నూరు సాధనములు, చ = నూరుట రుబ్బుట, మే పూతభృత్ = పవిత్రమును లభింపజేయు చేట, చ = చీపురు మొదలైనవి, మే ఆధవనీయః = నాకు చెందిన మంచిగా శుభ్రపఱచుటకు సాధనభూతములైన పాత్రలు, చ = నళికాది యంత్రములు అనగా నక్షత్రాదులను వీక్షించుట కుపయోగించు వెదురు గొట్టములు, మే వేది = నా హోమకుండము, చ = చతుష్కోణాదులు, మే బర్హిః = త్వరలో వృద్ధిని కలిగించు కుశ సమూహము, చ = యజ్ఞ సమయమునకు యోగ్యములగు పదార్థములు, మే అవభృథః = నా యజ్ఞాంత స్నానము, చ = చందనాద్యను లేపనము, మే స్వగాకారః = సొంత పదార్థములను లభింపజేయుట కుపయోగపడు సాధనములను నిర్మించువాడు, చ = పవిత్రీకరణము, ఇవి యన్నియు. యజ్ఞేన హోమ మొనర్చు క్రియచే, కల్పంతామ్ = సమర్థములగు గాక ॥ ॥౨౧॥

భావార్థము :—సాధనోప సాధనములను సమకూర్చగలవారే యజ్ఞమొనరించుటకు సమర్థులు.

---

౯౨౨ అగ్నిశ్చేత్యస్య దేవా ఋషయః, యజ్ఞవానాత్మా దేవతా, భురిక్ శక్వరీ ఛన్దః, ధైవతః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

అగ్నిశ్చ మే ఘర్మశ్చ మేఽర్కశ్చ మే సూర్యశ్చ మే ప్రాణశ్చ మేఽ
శ్వమేధశ్చ మే పృథివీ చ మేఽదితిశ్చ మే దితిశ్చ మే ద్యౌశ్చ మేఽ
ఙ్గులయః శక్వరయో దిశశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౨౨॥

అగ్నిః, చ, మే, ఘర్మః, చ, మే, అర్కః, చ, మే, సూర్యః, చ, మే, ప్రాణః, చ, మే, అశ్వమేధః, చ, మే, పృథివీ, చ, మే, అదితిః, చ, మే, దితిః, చ, మే, ద్యౌః, చ, మే, అఙ్గులయః, శక్వరయః, దిశః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (22)

పదార్థః :— (అగ్నిః) పావకః (చ)తత్ప్రయోగః (మే)(ఘర్మః) తాపః (చ) శాన్తిః (మే) (అర్కః) పూజనీయ సామగ్రివిశేషః (చ) ఏతచ్ఛుద్ధికరో వ్యవహారః (మే) (సూర్యః) సవితా (చ) జీవికాహేతుః (మే) (ప్రాణః) జీవనహేతుః (చ) బాహ్యో వాయుః (మే) (అశ్వమేధః) రాష్ట్రమ్ (చ) రాజనీతిః (మే) (పృథివీ) భూమిః (చ)ఏతత్స్థాః సర్వపదార్థాః (మే) (అదితిః) అఖణ్డితా నీతిః (చ) జితేన్ద్రియత్వమ్ (మే) (దితిః) అఖణ్డితా సామగ్రీ (చ) అనిత్యం జీవనం శరీరాదికం వా (మే) (ద్యౌః) ధర్మప్రకాశః (చ) అహర్నిశమ్ (మే) (అంగులయః) అఙ్గన్తి ప్రాప్నువన్తి యాభి స్తాః (శక్వరయః) శక్తయః (దిశః) (చ) (ఉపదిశః) (మే)(యజ్ఞేన) సంగతికరణయోగ్యేన పరమాత్మనా (కల్పన్తామ్) ॥౨౨॥ అన్వయః :—మేఽగ్నిశ్చ మే ఘర్మశ్చ మేఽర్కశ్చ మే సూర్యశ్చ మే ప్రాణశ్చ మేఽశ్వమేధశ్చ మే పృథివీ చ మేఽదితిశ్చ మే దితిశ్చ మే ద్యౌశ్చ మేఽఙ్గులయః శక్వరయో దిశశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౨౨॥ భావార్థః :—యే ప్రాణిసుఖాయ యజ్ఞ మను తిష్ఠన్తి తే మహాశయాః సన్తీతి వేద్యమ్. ॥౨౨॥

పదార్థము :— మే అగ్నిః = నా భౌతికాగ్ని, చ = దానిని ఉపయోగించుట, మే ఘర్మః = నా ఎండ, చ = శాంతి, మే అర్కః = నాకు చెందిన సత్కరించుటకు వలయు సామగ్రి విశేషము, చ = దానిని శుద్ధిజేయు వ్యవహారము, మే సూర్యః = నా సూర్యుడు, చ = జీవికా హేతువు, మే ప్రాణః = నా జీవన హేతువగు ఆయువు, చ = బాహ్యాపవనము, మే అశ్వమేధః = నా రాజ్య దేశము, చ = రాజనీతి. మే పృథివి = నా భూమి, చ = తత్రస్థ సకల పదార్థములు, మే అదితిః = నా అఖండ నీతి, చ = జితేంద్రియత్వము, మే దితిః నా ఖండిత సామగ్రి, చ = అనిత్య జీవనము లేక శరీరాదులు, మే ద్యౌః = నా ధర్మ ప్రకాశము, చ = దివారాత్రములు, మే అంగులయః = నా వ్రేళ్లు, శక్వరయః = శక్తులు, దిశః = పూర్వపశ్చిమ దక్షిణాది దిక్కులు, చ = ఈశాన్య వాయవ్య నైరృత్య ఆగ్నేయా ద్యుపదిశలు ఇవి యన్నియు, యజ్ఞేన = సంగతికరణ యోగ్యుడగు పరమాత్మునిచే, కల్పంతామ్ = సమర్థములగుగాక ! ॥౨౨॥

భావార్థము :—ప్రాణుల సుఖమునకై యజ్ఞమొనర్చువారు మహాశయులగుదు రని గ్రహించ వలెను.

---

౹౩౨ వ్రతం చేత్యస్య దేవా ఋషయః, కాలవిద్యావిదాత్మా దేవతా, పంక్తి శ్ఛందః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

వ్రతం చ మఽఋతవశ్చ మే తపశ్చ మే సంవత్సరశ్చ మేఽహోరాత్రేఽ ఊర్వష్ఠీవే బృహద్రథన్తరే చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౨౩॥

వ్రతమ్, చ, మే, ఋతవః, చ, మే, తపః, చ, మే, సంవత్సరః, చ, మే, అహోరాత్రే ఇత్యహోరాత్రే, ఊర్వష్ఠీవే ఇత్యూర్వష్ఠీవే, బృహద్రథన్తరే ఇతి బృహత్ + రథన్తరే, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (23)

పదార్థః :— (వ్రతమ్) సత్యాచరణ నియమపాలనమ్ (చ) సత్యకథనం సత్యోపదేశశ్చ (మే) (ఋతవః) వసన్తాద్యాః (చ) అయనమ్ (మే) (తపః) ప్రాణాయామో ధర్మానుష్ఠానం వా (చ) శీతోష్ణాది ద్వన్ద్వ సహనమ్ (మే) (సంవత్సరః) ద్వాదశభి ర్మాసై రలంకృతః (చ)కల్ప మహా కల్పాది (మే) (అహోరాత్రే)(ఊర్వష్ఠీవే) ఊరూచాష్ఠీవన్తౌ చ తే. అత్ర అచతుర వి . . . అ. ౫.౪.౭౭. ఇతి నిపాతః (బృహద్రథన్తరే) బృహచ్చ రథన్తరం చ తే (చ) వోఢ్యాన్ (మే) (యజ్ఞేన) కాల చక్రజ్ఞాన ధర్మాద్యనుష్ఠానేన (కల్పన్తామ్). ॥౨౩॥ అన్వయః :— మే వ్రతం చ మ ఋతవశ్చ మే తపశ్చ మే సంవత్సరశ్చ మేఽహోరాత్రే ఊర్వష్ఠీవే బృహద్రథన్తరే చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౨౩॥ భావార్థః :—యే నియతసమయే కార్యాణి సతతం ధర్మం చాచరన్తి తేఽభీష్ట సిద్ధి మాప్నువన్తి. ॥౨౩॥

పదార్థము :—మే వ్రతమ్ = నా సత్యాచరణ నియమ పాలనము, చ = సత్య భాషణము సత్యోపదేశము, మే ఋతవః = నా వసంతాద్యృతువులు, చ = ఉత్తరాయణ దక్షిణాయనములు, మే తపః = నా ప్రాణాయామము, చ = ధర్మాచరణము, శీతోష్ణాది ద్వంద్వములను సహించుట, మే సంవత్సరః = నా సంవత్సరము, చ = కల్పమహా కల్పములు, మే అహోరాత్రే = నా రాత్రింబవళ్లు, ఊర్వష్ఠీవే = తొడలు, అష్ఠీవంతములు [మోకాళ్లు], బృహద్రథంతరే = పెద్ద వస్తువులు,

అత్యంత రమణీయ రథములు. మఱియు, చ = అశ్వవృషభములు, యజ్ఞేన = ధర్మ జ్ఞానాదుల ఆచరణము వలనను, కాలచక్రభ్రమణానుష్ఠానము చేతను, కల్పంతామ్ = సమర్థములగుగాక ॥౨౩॥

భావార్థము :- నియమిత సమయమున ఆయా కార్యములు, సతతము ధర్మము నాచరించు మానవులు అభీష్టసిద్ధిని పొందుదురు. ॥౨౩॥ (౯౮౨)

---

ఏకాచేత్యస్య దేవా ఋషయః, విషమాఙ్కగణితవిద్యావిదాత్మా దేవతా, పూర్వార్ధస్య సంకృతిశ్ఛన్దః, ఏక వింశతి శ్చేత్యుత్తరస్య విరాట్ సంకృతి శ్ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ గణితవిద్యాయా మూల ముపదిశ్యతే. గణితవిద్య మూల ముపదేశించ బడుచున్నది.

ఏకా చ మే తిస్రశ్చ మే తిస్రశ్చ మే పఞ్చ చ మే పఞ్చ చ మే సప్త చ మే సప్త చ మే నవ చ మే నవ చ మఽఏకాదశ చ మ ఏకాదశ చ మే త్రయోదశ చ మే త్రయోదశ చ మే పఞ్చదశ చ మే పఞ్చదశ చ మే సప్తదశ చ మే సప్తదశ చ మే నవదశ చ మే నవదశ చ మఽఏకవిꣳశతిశ్చ మఽఏకవిꣳశతిశ్చ మే త్రయోవిꣳశతిశ్చ మే త్రయోవిꣳశతిశ్చ మే పఞ్చవిꣳశతిశ్చ మే పఞ్చవిꣳశతిశ్చ మే సప్తవిꣳశతిశ్చ మే సప్తవిꣳశతిశ్చ మే నవవిꣳశతిశ్చ మే నవవిꣳశతిశ్చమఽఏకత్రిꣳశచ్చ మఽఏకత్రిꣳశచ్చ మే త్రయస్త్రిꣳశచ్చ మే యజ్ఞేన కల్పన్తామ్. (౨౪)

ఏకా, చ, మే, తిస్రః, చ, మే, తిస్రః, చ, మే, పఞ్చ, చ, మే, పఞ్చ, చ, మే, సప్త, చ, మే, సప్త, చ, మే, నవ, చ, మే, నవ, చ, మే, ఏకాదశ, చ, మే, ఏకాదశ, చ, మే, త్రయోదశేతి త్రయః+దశ, చ, మే, త్రయోదశేతి త్రయః+దశ, చ, మే, పఞ్చదశేతి పఞ్చ+దశ, చ, మే, పఞ్చదశేతి పఞ్చదశ, చ, మే, సప్తదశేతి, సప్త+దశ, చ, మే, సప్తదశేతి సప్త+దశ, చ, మే, నవదశేతి నవ+దశ, చ, మే, నవదశేతి నవ+దశ, చ, మే, ఏకవిꣳశతి రిత్యేక+విꣳశతిః, చ, మే, ఏకవిꣳశతి రిత్యేక + విꣳశతిః, చ, మే, త్రయోవిꣳశతిరితి త్రయః విꣳశతిః, చ, మే, త్రయోవిꣳశతిరితి త్రయః+విꣳశతిః, చ, మే, పఞ్చ+విꣳశతిరితి పఞ్చ+విꣳశతిః, చ, మే, పఞ్చవిꣳశతిరితి పఞ్చ+విꣳశతిః,

చ, మే, సప్త వింశతిశ్చేతి సప్త+వింశతిః, చ, మే, సప్త వింశతిశ్చేతి సప్త+వింశతిః, చ, మే, నవ వింశతిశ్చేతి నవ+వింశతిః, చ, మే, నవ వింశతిశ్చేతి నవ+వింశతిః, చ, మే, ఏకత్రింశదిత్యేక+త్రింశత్, చ, మే, ఏకత్రింశదిత్యేక+త్రింశత్, చ, మే, త్రయస్త్రింశదితి త్రయః+త్రింశత్, చ మే, యజ్ఞేన, కల్పన్తామ్. (24)

పదార్థః :—(ఏకా)ఏకత్వ విశిష్టా సంఖ్యా(చ)(మే)(తిస్రః)త్రిత్వవిశిష్టా సంఖ్యా (చ) (మే) (తిస్రః)(చ)(మే)(పఞ్చ)పఞ్చత్వవిశిష్టా గణనా(చ)(మే)(పఞ్చ)(చ) (మే) (సప్త)సప్తత్వవిశిష్టా గణనా (చ)(మే)(సప్త)(చ)(మే)(నవ) నవత్వ విశిష్టాసంఖ్యా(చ)(మే)(నవ)(చ)(మే)(ఏకాదశ) ఏకాధికాదశ (చ)(మే)(ఏకాదశ)(చ)(మే) (త్రయోదశ)త్ర్యధికా దశ(చ)(మే)(త్రయోదశ)(చ)(మే) (పఞ్చదశ)పఞ్చోత్తరా దశ(చ)(మే)(పఞ్చదశ)(చ)(మే) (సప్తదశ) సప్తాధికా దశ (చ)(మే)(సప్తదశ)(చ)(మే)(నవదశ)నవోత్తరా దశ(చ)(మే)(నవదశ) (చ) (మే) (ఏకవింశతిః) ఏకాధికా వింశతిః (చ)(మే) (ఏకవింశతిః) (చ) (మే) (త్రయోవింశతిః) త్ర్యధికా వింశతిః(చ)(మే)(త్రయోవిశంతిః)(చ)(మే)(పఞ్చవింశతిః)పఞ్చాధికా వింశతిః(చ)(మే)(పఞ్చవింశతిః)(చ)(మే) (సప్తవింశతిః)సప్తాధికా వింశతిః(చ)(మే)(సప్తవింశతిః) (చ) (మే) (నవవింశతిః) నవాధికా వింశతిః(చ)(మే)(నవవింశతిః)(చ)(మే) (ఏకత్రింశత్)ఏకాధికాత్రింశత్(చ)(మే) (ఏకత్రింశత్)(చ) (మే) (త్రయస్త్రింశత్)త్ర్యధికాత్రింశత్(చ) (మే)(చ) (మే) (యజ్ఞేన) సంగతికరణేన యోగేన దానేన వియోగేన వా (కల్పన్తామ్). ॥౨౪॥

అన్వయః :-యజ్ఞేన సజతికరణేన మ ఏకా సంఖ్యా చ - ద్వే మే తిస్రః, చ-పునర్మే తిస్రశ్చ -ద్వే మే పఞ్చ, చ-పునర్మే పఞ్చ చ—ద్వే మే సప్త. చ—పునర్మే సప్త చ-ద్వే మే నవ, చ-పునర్మే నవ చ ద్వే మే ఏకాదశ, చ-పునర్మే ఏకాదశ చ-ద్వే మే త్రయోదశ, చ-పునర్మే త్రయోదశ చ—ద్వే మే పఞ్చదశ, చ—పునర్మే పఞ్చదశ చ—ద్వే మే సప్తదశ, చ-పునర్మే సప్తదశ చ-ద్వే మే నవదశ, చ-పునర్మే నవదశ చ—ద్వే మ ఏకవింశతిః, చ-పునర్మే ఏకవింశతిశ్చ-ద్వే మే త్రయో వింశతిః, చ—పునర్మే త్రయోవిశంతిశ్చ—ద్వే మే పఞ్చవింశతిః, చ—పునర్మే పఞ్చవింశతిశ్చ—ద్వే మే సప్తవింశతిః, చ-పునర్మే సప్తవింశతిశ్చ-ద్వే మే నవవింశతిః,చ—పునర్మే నవవింశతిశ్చ ద్వే మ ఏకత్రింశచ్చ-పునర్మ ఏకత్రింశచ్చ - ద్వే మే త్రయస్త్రింశచ్చాదగ్రేప్యేవం సంఖ్యాః కల్పన్తామ్ ॥ ఇత్యేకో యోగపక్షః.

అథ ద్వితీయ పక్షః :-యజ్ఞేన యోగతో విపరీతేన దానరూపేణ వియోగమార్గేణ విపరీతాః సంగృహీతాశ్చాన్యాన్యా సంఖ్యా ద్వయో ర్వియోగేన యథా మే కల్పన్తాం తథా మే త్రయస్త్రింశచ్చ ద్వయోర్దానేన వియోగేన మ ఏకత్రింశత్, చ-పునర్మే మమైకత్రింశచ్చ-ద్వయోర్వియోగేన మే నవవింశతిః.చ-పునర్మే నవవింశతిశ్చ-ద్వయోర్వియోగేన మే సప్తవింశతి రేవం—సర్వత్ర ఇతి వియోగేనాన్తరేణ ద్వితీయః పక్షః.

అథ తృతీయః :-మ ఏకా చ మే తిస్రశ్చ, మే తిస్రశ్చ మే పఞ్చ చ, మే పఞ్చ చ మే సప్త చ, మే

సప్త చ మే నవ చ. మే నవ చ మే ఏకాదశ చైవం విధాః సంఖ్యాః అగ్రేపి యజ్ఞేన ఉక్త పునః పునర్యోగ్యేన గుణనేన కల్పన్తాం సమర్థా భవన్తు. ఇతి గుణనవిషయే తృతీయః పక్షః. ||౨౪||

భావార్థః :-అస్మిన్మన్త్రే యజ్ఞేనేతి పదేన యోగవియోగౌ గృహ్యేతే కుతో యజ ధాతోర్హి యః సఙ్గతికరణార్థస్తేన సఙ్గతిఃకరణం కస్యాశ్చిత్ సంఖ్యాయాః కయాచిద్యోగకరణం యశ్చ దానార్థస్తేనైవం సమ్భావ్యం కస్యాశ్చిద్ హ్రాసం వ్యవకలనమిదమేవాన్తరమేవం గుణన భాగ వర్గ వర్గమూల ఘన ఘనమూల భాగజాతి ప్రభాగజాతి ప్రభృతయో యే గణితభేదాః సన్తి తే యోగవియోగాభ్యామేవోత్పద్యన్తే కుతః కాంచిత్ సంఖ్యాం కయాచిత్ సంఖ్యయా సకృత్ సంయోజయేత్ స యోగో భవతి యథా ౨ + ౪ = ౬ ద్వయోర్మధ్యే చత్వారో యుక్తాః షట్సంపద్యన్తే. ఇత్థమనేకవారం చేత్ సంఖ్యాయాం సంఖ్యాం యోజయేత్తర్హి తద్గుణనమాహుః. యథా ౨ × ౪ = ౮. అర్థాత్ ద్విరూపాం సంఖ్యాం చతుర్వారం పృథక్ పృథగ్ యోజయేద్వా ద్విరూపాం సంఖ్యాం చతుర్భిర్గుణయేత్తదాష్టౌ జాయన్తే. ఏవం చత్వారశ్చతుర్వారం యుక్తా వా. చతుర్భిర్గుణితాస్తదా చతుర్ణాం వర్గః షోడశ సంపద్యన్తే ఇత్థమన్తరేణ భాగ-వర్గమూల-ఘనమూలాద్యాః క్రియా నిష్పద్యన్తే. అర్థాత్ యస్యాం కస్యాం చిత్సంఖ్యాం కాంచిత్ సంఖ్యాం యోజయేద్వా కేన చిత్ప్రకారాన్తరేణ వియోజయేదిత్యనేనైవ యోగేన వియోగేన వా బుద్ధిమతాం యథామతి కల్పనయా వ్యక్తావ్యక్తతరాః సర్వా గణితక్రియా నిష్పద్యన్తేఽత్ర మన్త్రే ద్వయో ర్ద్వయోర్యోగేనోత్తరోత్తరా ద్వయో ర్వియోగేన వా పూర్వా పూర్వా విషమ సంఖ్యా ప్రదర్శితా, తథా గుణనస్యాపి కశ్చిత్ప్రకారః ప్రదర్శిత ఇతి వేదితవ్యమ్. ||౨౪||

పదార్థము :-యజ్ఞేన = మేళవించుటచే ననగా యోగ [కూడిక]మొనర్చుటచే, మే ఏకా = నా ఒకటి, చ = ఇంకొక రెండు, మే తిస్రః = నా మూడు; చ = అటులనే, మే తిస్రః = నా మూడు, చ = మఱియు రెండు, మే పంచ = నా అయిదు; చ = అటులనే, మే పంచ = నా అయిదు, చ = మఱియు రెండు, మే సప్త = నా యేడు, చ = మఱియు, మే సప్త = నా యేడు, చ = మఱియు రెండు, మే నవ = నా తొమ్మిది, చ = మఱల, మే నవ చ = నా తొమ్మిదియు మఱియు రెండు, మే ఏకాదశ = నా పదునొకండు చ = మఱల, మే ఏకాదశ చ = నా పదునొకండు మఱియురెండు, మే త్రయోదశ = నా పదమూడు, చ = మఱల, మే త్రయోదశ చ = నా పదమూడు మఱియు రెండు, మే పఞ్చదశ = నా పదిహేను, చ మే పఞ్చదశ చ = మఱల, నా పదిహేను మఱియు రెండు, మే సప్తదశ = నా పదియేడు. చ = మరల, మే సప్తదశ చ = నా పదియేడు మఱియు రెండు, మే నవదశ = నా పందొమ్మిది, చ = మరల, మే నవదశ చ = నా పందొమ్మిది మఱియు రెండు, మే ఏకవింశతిః = నా ఇరువది యొకటి, చ = మఱల, మే ఏకవింశతిః చ = నా ఇరువది యొకటి మఱియు రెండు, మే త్రయోవింశతిః = నా ఇరువది మూడు, చ = మఱల. మే త్రయోవింశతిః చ = నా ఇరువది మూడు మఱియు రెండు, మే పంచ వింశతిః = నా ఇరువది యైదు, చ = మఱల, మే పంచవింశతిః చ = నా యిరువది యైదు మఱియు రెండు, మే సప్తవింశతిః = నా యిరువదియేడు, చ = మరల, మే సప్తవింశతిః చ = నా యిరువదియేడు మఱియు రెండు, మే నవవింశతిః = నా యిరువది తొమ్మిది, చ = మఱల, మే నవవింశతిః చ = నా యిరువది తొమ్మిది మఱియు రెండు, మే ఏకత్రింశత్ = నా ముప్పది యొకటి, చ = మరల, మే ఏకత్రింశత్ చ = నా ముప్పదియొకటి మఱియు రెండు, మే త్రయస్త్రింశత్ = నా ముప్పదిమూడు, చ = ఆ తర్వాతగూడ నిదేవిధముగ సంఖ్యలు, కల్పంతామ్ = సమర్థములగుగాక ! ఇదియోగ పక్షార్థము.

రెండవ పక్షము :—యజ్ఞేన = యోగమునకు విపరీతము వియోగము [తీసివేత] చేత-విపరీత మార్గముచే సంగృహీతమై, చ = రెండు వియోగముచే అనగా రెండు తగ్గించుటచే నెటుల, మే కల్పంతామ్ = నాకు సమర్థమగునో, అటులనే, మే త్రయస్త్రింశత్ = నా ముప్పది మూడునుండి, చ = రెండు నిచ్చుటచే, మే ఏకత్రింశత్ = నా ముప్పది యొకటి, చ మే ఏకత్రింశత్ చ = మరల నా ముప్పది యొక్కటినుండి రెండు తగ్గించుటచే, మే నవవింశతిః = నా ఇరువది తొమ్మిది, చ మే నవవింశతిః చ = మరల నా ఇరువది తొమ్మిది నుండి రెండు తగ్గించుటచే మే సప్తవింశతిః = నా ఇరువది యేడు, సంపన్నమగు గాక ! ఇటులనే అన్ని సంఖ్యలందు గ్రహించ వలయును. ఇది వియోగపక్షమున ద్వితీయార్థము.

మూడవ పక్షము :—మే ఏకా = నా ఒకటి, చ = మరియు, మే తిస్రః = నా మూడు, చ = పరస్పర గుణము గలవియై, మే తిస్రః = నా మూడు, చ = మరియు, మే పఞ్చ = నా అయిదు, చ = పరస్పర గుణితములై, మే పంచ = నా అయిదు, చ = మరియు, మే సప్త చ = నా యేడు పరస్పర గుణితములై, మే సప్త చ మే నవ చ = నా యేడు మరియు నా తొమ్మిది పరస్పరగుణిత ములై, మే నవ చ = నా తొమ్మిదియు, మే ఏకాదశ చ = నా పదునొకండును పరస్పర గుణిత ములై ఇటులనే యితర సంఖ్యలుకూడ, యజ్ఞేన = పై రీతి మాటి మాటికి కూడుటచేతనో లేక హెచ్చు వేయుట చేతనో, కల్పంతామ్ = సమర్థము లగుగాక : ఇది గుణన పక్షమున మూడవ యర్థము.

భావార్థము :—ఈ మంత్రమునందు "యజ్ఞేన" పదముచే కూడుట తీసివేయుట అను అర్థములు గ్రహించబడుచున్నవి. ఏలయన యజధాతువున కర్థము సంగతికరణము అనగా ఒకానొక సంఖ్యను మరొక సంఖ్యతో కలుపుట అనియు, యజ ధాతువునకు దానార్థ ముండుటచే మరొక అర్థమునుగూడ తీసుకొనవచ్చును, అదేదనగా :—ఒకసంఖ్యను దానమొసగుటయు, వ్యయమొనర్చుటయు, తీసివేయు టయే యగును. ఇదియే[వాని]అంతరమన బడును. ఇవేవిధముగ గుణనము, భాగాహారము, వర్గము, వర్గమూలము, ఘనము, ఘనమూలము, భాగజాతి, ప్రభాగజాతి మొదలైనవన్నియు సంఖ్యల యోగ వలననో అంతరము వలననో కలిగించుచున్నవి. ఎటులనగా:—ఒక సంఖ్యను ఒక సంఖ్యతో నొకసారి కలుపుచో యోగము[కూడిక] అనియందుము. ఉదా :—౨ + ౪ = ౬అనగా రెంటికి నాలుగు జేర్చిన ఆరు అగుచున్నది. ఇటులనే సంఖ్యను అనేక పర్యాయములు కలుపుచో గుణన మగును ఉదా:—౨ × ౪ = ౮అనగా రెండును నాలుగు సారులు వేరువేరుగ కలిపినను, లేక నాలుగుచేత గుణించినను ౮ అగును. నాలుగును నాలుగురెట్లు చేయగా వర్గము ౧౬ అగుచున్నది. ఇటులనే అంతరముచే భాగా హారము. వర్గమూలము, ఘనమూలము మొదలగునవి నిష్పన్నములగు చున్నవి. ఒక సంఖ్యలో నొక సంఖ్యను కలుపుటగాని, ఏదో విధముగ తగ్గించుటగాని జరుగును. ఇటుల యోగవియోగముచే బుద్ధిమంతులు యథామతి కల్పన యొనర్చి వ్యక్తములు — అవ్యక్తములనగు అంక బీజగణితము లాది సమస్త గణితక్రియలను గ్రహించ గలుగుచున్నారు. కావున నీ మంత్రమునందు రెంటిని కలుపుటచే నేర్పడు ఉత్తరోత్తర సంఖ్య. రెండు తగ్గించుటచే నేర్పడు పూర్వ పూర్వ సంఖ్య విష మాంకముచే నిర్దేశింప బడినదని అటులనే గుణన పద్ధతియు కొద్దిగ సూచింప బడినదనియు గ్రహించ వలయును. ॥౨౪॥ (౯౭౩)

---

౯౭౪ చతస్రశ్చేత్యస్య పూర్వదేవా ఋషయః. సమాజ్యగణితవిద్యావిదాత్మా దేవతా, పంక్తిశ్ఛన్దః, చతుర్విర్ంశతి శ్చేత్యుత్తరస్యాకృతి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథ సమాఙ్కగణిత విషయ మాహ. సమ సంఖ్యల గణితము జెప్పెను.

చత॑స్రశ్చ మే॒ఽష్టౌ చ॑ మే॒ఽష్టౌ చ॑ మే॒ ద్వాద॑శ చ మే॒ ద్వాద॑శ చ మే॒ షో॑డశ చ మే॒ షో॑డశ చ మే వింశ॒తిశ్చ॑ మే వింశ॒తిశ్చ॑ మే॒ చతు॑ర్వింశతిశ్చ మే చతు॑ర్వింశతిశ్చ మే॒ఽష్టావిం॑శతిశ్చ మే॒ఽష్టావిం॑శతిశ్చ మే॒ ద్వాత్రిం॑శచ్చ మే॒ ద్వాత్రిం॑శచ్చ మే॒ షట్త్రిం॑శచ్చ మే॒ షట్త్రిం॑శచ్చ మే॒ చత్వారిం॑శచ్చ మే॒ చత్వారిం॑శచ్చ మే॒ చతు॑శ్చత్వారింశచ్చ మే॒ చతు॑శ్చత్వారింశచ్చ మే॒ఽష్టాచ॑త్వారింశచ్చ మే॒ య॒జ్ఞేన॑ కల్పన్తామ్ ॥ ॥౨౫॥

చత॑స్రః, చ॒, మే॒, అ॒ష్టౌ, చ॒, మే॒, అ॒ష్టౌ, చ॒, మే॒, ద్వాద॑శ, చ॒, మే॒, ద్వాద॑శ, చ॒, మే॒, షో॑డశ, చ॒, మే॒, షో॑డశ, చ॒, మే॒, వి॒ంశ॒తిః, చ॒, మే॒, వి॒ంశ॒తిః, చ॒, మే॒, చతు॑ర్వింశతి॒ రితి॒ చతుః+ర్వింశతిః, చ॒, మే॒, చతు॑ర్వింశతి॒ రితి॒ చతుః+వింశతిః, చ॒, మే॒, అ॒ష్టావిం॑శతి॒ రిత్య॒ష్టావింశతిః, చ॒, మే॒, అ॒ష్టావిం॑శతి॒ రిత్య॒ష్టా+వింశతిః, చ॒, మే॒, ద్వా॒త్రిం॑శత్, చ॒, మే॒, ద్వా॒త్రిం॑శత్, చ॒, మే॒, షట్త్రిం॑శ॒దితి॒ షట్ త్రిం॑శత్, చ॒, మే॒, షట్త్రిం॑శ॒దితి॒ షట్ త్రిం॑శత్, చ॒, మే॒, చ॒త్వా॒రిం॒శత్, చ॒, మే॒, చ॒త్వా॒రిం॒శత్, చ॒, మే॒, చతు॑శ్చత్వారిం॑శ॒దితి॒ చతుః+చత్వారింశత్, చ॒, మే॒, చతు॑శ్చత్వారిం॑శ॒దితి॒ చతుః+చత్వారింశత్, చ॒, మే॒, అ॒ష్టాచ॑త్వారిం॑శ॒దిత్య॒ష్టా+చత్వారింశత్, చ॒, మే॒, య॒జ్ఞేన॑, క॒ల్ప॒న్తా॒మ్. (25)

పదార్థః :-(చతస్రః)చతుష్ట్వవిశిష్టాసంఖ్యా(చ)(మే) (అష్టౌ)అష్టత్వవిశిష్టా సంఖ్యా(చ)(మే)(అష్టౌ)(చ)(ద్వాదశ)ద్వ్యధికా దశ(చ)(మే)(ద్వాదశ)(చ)(మే)(షోడశ)షడధికా దశ(చ)(మే)షోడశ చ మే(వింశతిః)(చ)(మే)(వింశతిః)(చ)(మే)(చతుర్వింశతిః)చతురధికా వింశతిః(చ)(మే(చతుర్వింశతిః)(చ)(మే)(అష్టావింశతిః)అష్టాధికావింశతిః(చ)(మే)అష్టావింశతిః చ మే(ద్వాత్రింశత్ ద్వ్యధికాత్రింశత్(చ)(మే)(ద్వాత్రింశత్)(చ)(మే)(షట్ త్రింశత్)షడుత్తరా త్రింశత్(చ)(మే)(షట్త్రింశత్)(చ)(మే)(చత్వారింశత్)(చ)(మే)(చతుశ్చత్వారింశత్) చతురధికాచత్వారింశత్(చ)(మే)(చతుశ్చత్వారింశత్)(చ)(మే)(అష్టాచత్వారింశత్)అష్టాధికా చత్వారింశత్(చ)(మే)(యజ్ఞేన) యోగేన వియోగేన వా(కల్పన్తామ్)సమర్థా భవన్తు. ॥౨౫॥ అన్వయః :-యజ్ఞేన సఙ్గతికరణేన మే చతస్రః-చతుఃసంఖ్యా చ-చతస్రో మేఽష్టౌ, చ-పునర్మే అష్టౌ-చ - చతస్రో మే ద్వాదశ, చ-పున ర్మే ద్వాదశ చ-చతస్రో మే షోడశ. చ - పునర్మే షోడశ, చ-చతస్రో మే వింశతిః, చ-పున ర్మే వింశతిశ్చ-చతస్రో మే చతుర్వింశతిః, చ-పున ర్మే చతుర్వింశతిశ్చ - చతస్రో మేఽష్టావింశతిః,

చ-పునర్మే౽ష్టావింశతిశ్చ- చతస్రో మే ద్వాత్రింశత్, చ - పునర్మే ద్వాత్రింశచ్చ - చతస్రో మే షట్త్రింశచ్చ-పునర్మే షట్త్రింశచ్చ-చతస్రో మే చత్వారింశత్, చ - పునర్మే చత్వారింశచ్చ చతస్రో మే చతుశ్చత్వారింశత్. చ పున ర్మే చతుశ్చత్వారింశచ్చ - చతస్రో మే౽ష్టాచత్వారింశత్ చాదగ్రే౽పి పూర్వోక్తవిధినా సంఖ్యా కల్పన్తామ్. ఇత్యేకో యోగ పక్షః. ॥౨౫॥

అథ ద్వితీయః :—యజ్ఞేన యోగతో విపరీతేన దానరూపేణ వియోగమార్గేణ విపరీతాః సంగృహీతాశ్చాన్యాన్యాసంఖ్యా చతుర్ణాం వియోగేన యథా మే కల్పన్తాం తథా మే౽ష్టాచత్వారింశచ్చ చతుర్ణాం దానేన వియోగేన మే చతుశ్చత్వారింశత్ చ - పున ర్మే చతుశ్చత్వారింశచ్చ - చతుర్ణాం వియోగేన మే చత్వారింశత్ చ - పున ర్మే చత్వారింశచ్చ-చతుర్ణాం వియోగేన మే షట్త్రింశత్, చ - పున ర్మే షట్త్రింశచ్చ-చతుర్ణాం వియోగేన మే ద్వాత్రింశదేవం ప్రత్యుత్ర. ఇతి వియోగేన ద్వితీయః పక్షః.

అథ తృతీయః :—మే చతస్రశ్చ మే౽ష్టౌ చ, మే౽ష్టౌ చ, మే ద్వాదశ చ, మే ద్వాదశ చ మే షోడశ చ, మే షోడశ చ మే వింశతి శ్చైవం విధాః సంఖ్యా అగ్రే౽పి యజ్ఞేన ఉక్త పునః పున ర్యోగేన గుణనేన కల్పన్తాం సమర్థా భవన్తు. ఇతి గుణన విషయేణ తృతీయః పక్షః. ॥౨౫॥

భావార్థః :—పూర్వస్మిన్మన్త్రే౽కాం సంఖ్యాం సంగృహ్య ద్వయో ర్యోగవియోగాభ్యాం విషమాః సంఖ్యాః ప్రతిపాదితాః. అతః పూర్వత్ర క్రమేణాగతైకద్విత్రిసంఖ్యా విహాయాత్ర మన్త్రే చతస్రూణాం యోగేన వియోగేన వా చతుఃసంఖ్యా మారభ్య సమసంఖ్యాః ప్రతిపాదితాః. అనేన మంత్రద్వయేన విషమసంఖ్యానాం సమసంఖ్యానాఞ్చ భేదాన్ విజ్ఞాయ యథా బుద్ధికల్పనయా సర్వా గణిత విద్యా విజ్ఞాతవ్యాః. ॥౨౫॥

పదార్థము:-యజ్ఞేన = మేళవించుటచే,అనగాకలుపుటచే,మే చతస్రః చ = నానాలుగు మఱియు నాలుగు,మే అష్టౌ = నా ఎనిమిది.చ మే అష్టౌ చ = మఱల నా ఎనిమిది ఇంక నాలుగు, మే ద్వాదశ = నా పండ్రెండు, చ మే ద్వాదశ చ = మఱల నా పండ్రెండు మఱియు నాలుగు, మే షోడశ = నా పదునారు, చ = మఱల. మే షోడశ చ = నా పదునారు మఱియు నాలుగు, మే వింశతిః = నా యిరువది, చ మే వింశతిః చ = మఱల నా యిరువది మఱియు నాలుగు, మే చతుర్వింశతిః = నా నా యిరువది నాలుగు, చ మే చతుర్వింశతిః చ = మఱల నా యిరువది నాలుగు మఱియు నాలుగు, మే అష్టావింశతిః = నా యిరువది యెనిమిది. చ మే అష్టావింశతిః చ = మఱల నా యిరువది యెనిమిది మరియు నాలుగు, మే ద్వాత్రింశత్ = నా ముప్పది రెండు. చ మే ద్వాత్రింశత్ చ = మఱల నా ముప్పది రెండు మరియు నాలుగు. మే షట్త్రింశత్ = నా ముప్పదియారు, చ మే షట్త్రింశత్ చ = మఱల నా ముప్పదియారు మరియు నాలుగు, మే చత్వారింశత్ = నా నలువది, చ మే చత్వారింశత్ చ = మఱల నా నలుబది మరియు నాలుగు. మే చతుశ్చత్వారింశత్ = నా నలుబది నాలుగు, చ మే చతుశ్చత్వారింశత్ చ = మఱల నా నలుబది నాలుగు మఱియు నాలుగు, మే అష్టాచత్వారింశత్ = నా నలుబది యెనిమిది, చ = ముందును ఉక్తవిధిచే సంఖ్యలు, కల్పన్తామ్ = సమర్థము లగుగాక ! ఇది యోగపక్షమున అర్థము. ॥౨౫॥

ద్వితీయ పక్షము :—యజ్ఞేన = యోగమునకు విపరీతమగు దాన రూప వియోగముచే విపరీతముగ సంగృహీత మొనర్చబడినవై , చ = ఆయా సంఖ్యలు నాలుగుతగ్గించుటచే నెటుల, మే = నాకు, కల్పంతామ్ = సమర్థములగునో, అటులనే, మే అష్టాచత్వారింశత్ చ = నా నలుబది యెనిమిది

నుండి నాలుగు తగ్గించుట చే. మే చతుశ్చత్వారింశత్ = నా నలుబది నాలుగు. చ మే చతుశ్చత్వారింశత్ చ = మఱల నా నలుబది నాలుగునుండి నాలుగు తగ్గించుటచే. మే చత్వారింశత్ = నా నలుబది. చ మే చత్వారింశత్ చ = మఱల నా నలుబదినుండి నాలుగు తగ్గించుటచే. మే షట్త్రింశత్ = నా ముప్పది యారు. చ మే షట్త్రింశత్ చ = మఱల నా ముప్పదియారు నుండి నాలుగు తగ్గించుటచే. మే ద్వాత్రింశత్ = నా ముప్పదిరెండు. ఇటుల సకల సంఖ్యలను ఎఱుగ వలయును. ఇది తీసివేతచే ద్వితీయ పక్షము. ॥౨౫॥

తృతీయ పక్షము :—మే చతస్రః = నా నాలుగు, చ = మరియు, మే అష్టౌ = నా ఎనిమిది, చ = పరస్పర గుణితములై, మే అష్టౌ చ మే ద్వాదశ చ = నా ఎనిమిది మఱియు నా పండ్రెండు పరస్పర గుణితములై, మే ద్వాదశ చ మే షోడశ చ = నా పండ్రెండు మఱియు నా పదునారు పరస్పర గుణితములై. మే షోడశ చ మే వింశతిః చ = నా పదునారు మరియు నా ఇరువది పరస్పర గుణితములై, ఇటులనే తర్వాత సంఖ్యలుకూడ. యజ్ఞేన = పదేపదే గుణన మొనర్చుటచే. కల్పంతామ్ = సమర్థ వంతములగుగాక : ఇది గుణన విషయమున మూడవ పక్షము. ॥౨౫॥

భావార్థము :—పూర్వ మంత్రమందు ఒకటి నుండి రెంటిని కలుపుచు, తీసివేయుచు విషమ సంఖ్యలు చెప్పబడినవి. కనుక అట వచ్చిన ఒకటి రెండు మూడు సంఖ్యలను వదలి ఈ మంత్రము నందు నాలుగు కలుపుచు నాలుగు తీసివేయుచు నాలుగును గ్రహించు సమసంఖ్య ప్రతిపాదించబడినది. ఈ రెండు మంత్రములచే విషమసంఖ్యల సమసంఖ్యల భేదము నెఱిగి బుద్ధిని బట్టి కల్పన యొనర్చుకొని సమస్తగణిత విద్యను ఎఱుగవలయును. ॥౨౫॥ ౯౭౪

---

౯౭౫ త్ర్యవిశ్చేత్యస్య దేవా ఋషయః, పశువిద్యావిదాత్మా దేవతా, బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ పశుపాలన విషయ మాహ. పశుపాలనము గుఱించి.

త్ర్యవిశ్చ మే త్ర్యవీ చ మే దిత్యవాట్ చ మే దిత్యౌహీ చ మే పఞ్చావిశ్చ మే పఞ్చావీ చ మే త్రివత్సశ్చ మే త్రివత్సా చ మే తుర్యవాట్ చ మే తుర్యౌహీ చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ ॥౨౬॥

త్ర్యవిరితి త్రి + అవిః, చ, మే, త్ర్యవీతి త్రి+అవీ, చ, మే, దిత్యవాడితి దిత్య+వాట్, చ, మే, దిత్యౌహీ, చ, మే, పఞ్చావిరితి పఞ్చ+అవిః, చ, మే, పఞ్చావీతి పఞ్చ+అవీ, చ, మే, త్రివత్స ఇతి త్రి+వత్సః, చ, మే, త్రివత్సేతి త్రి+వత్సా, చ, మే, తుర్యవాడితి తుర్య+వాట్, చ, మే, తుర్యౌహీ, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (26)

పదార్థః :—(త్ర్యవిః)తిస్రోఽవయో యస్య సః(చ)అతో భిన్నా సామగ్రీ(మే)(త్ర్యవీ)తిస్రో అవయో యస్యాః సా(చ)ఏతజ్జన్యం ఘృతాది (మే) (దిత్యవాట్) దితౌ ఖణ్డితాయాం క్రియాయాం భవా దిత్యాస్తాన్యో వహతి పృథక్ కరోతి సః(చ)ఏతత్పాలనమ్(మే)(దిత్యౌహీ) తత్ స్త్రీ(చ)అన్యదపి

(మే)(పఞ్చావిః)పఞ్చావయో యస్య సః(చ)ఏతద్రక్షణమ్(మే)(పఞ్చావీ)స్త్రీ(చ)ఏతత్పాలనమ్(మే)(త్రివత్సః)త్రయో వత్సా యస్య సః(చ)ఏతచ్ఛిక్షణమ్(మే) (త్రివత్సా)త్రయో వత్సా యస్యాః సా (చ)ఏతస్యా రక్షా(మే)(తుర్యవాట్)యస్తుర్యం చతుర్థం వర్షం వహతి ప్రాప్నోతి స వృషభాదిః యస్య త్రీణి వర్షాణి పూర్ణాని జాతాని చతుర్థః ప్రవిష్టః స ఇత్యర్థః(చ) అస్య శిక్షణమ్ (మే)(తుర్యౌహీ)పూర్వోక్తసదృశీ గౌః(చ)అస్యాః శిక్షా(మే)(యజ్ఞేన)పశుపాలనవిధినా(కల్పన్తామ్)సమర్థయన్తు. ॥౨౬॥ అన్వయః :—మే త్ర్యవిశ్చ మే త్ర్యవీ చ మే దిత్యవాట్ చ మే దిత్యౌహీ చ మే పఞ్చావిశ్చ మే త్రివత్సశ్చ మే త్రివత్సా చ మే తుర్యవాట్ చ మే తుర్యౌహీ చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౨౬॥ భావార్థః :—అత్ర గోఽజావిగ్రహణ ముపలక్షణార్థమ్. యే మనుష్యాః పశూన్ వర్ధయన్తి తే రసాఢ్యా జాయన్తే. ॥౨౬॥

పదార్థము :—మే త్ర్యవిః = మూడు మగ గొఱ్ఱెలు గలవాడు, చ = తద్భిన్న సామగ్రి, మే త్ర్యవీ = మూడురకములఆడ గొఱ్ఱెలు గలస్త్రీ, చ = వానినుండి కలిగిన ఘృతాదులు, మే దిత్యవాట్ = నా ఖండిత క్రియలందు కలిగిన విఘ్నములను వేఱుపఱచు వాడు, చ = అతనికి సంబంధించినది, మే దిత్యౌహీ = ఆక్రియలనే లభింపజేయు గోవులు, చ = వాని రక్షణ, మే పంచావిః = నా ఐదు రకముల గొఱ్ఱెల వాడు, చ = అతని ఘృతాదులు, మే పంచావీ = ఐదురకముల ఆడ గొఱ్ఱెలుగలస్త్రీ, చ = వాని పాలనము, మే త్రివత్సః = నా మూడు దూడలుగలవాడు, చ = వానిశిక్షణము, మే త్రివత్సా = నా మూడు దూడలుగల ఆవు, చ = దాని రక్షణ-ఘృతాదులు, మే తుర్యవాట్ = మూడుసంవత్సరములు నిండి నాలుగవ సంవత్సరము వచ్చిన నా యెద్దు, చ = దాని పనినేర్పు, మే తుర్యౌహీ = నాల్గవ సంవత్సరమువచ్చిన నా ఆవు, చ = దానిశిక్షణ, ఈ పదార్థము లన్నియు, యజ్ఞేన = పశుపాలన విధానముచే, కల్పంతామ్ = సమర్థము లగుగాక ; ॥౨౬॥

భావార్థము :—ఈ మంత్రమందు గోవు, మేక, గొఱ్ఱెలయొక్క ఉప లక్షణముచే అన్యపశువులు కూడ గ్రహించ బడుచున్నవి. పశువులను పెంపొంద చేయువారు వాని రసముచే ఆఢ్యులుగా గలుగు చున్నారు. ॥౨౬॥ (౯౨౫)

---

పష్ఠవాట్ చేత్యస్య దేవా ఋషయః, పశుపాలనవిద్యావిదాత్మా దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః. పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

పష్ఠవాట్ చ మే పష్ఠౌహీ చ మ ఉక్షా చ । మే వశా చ మ ఋషభశ్చ మే వేహచ్చ మేఽనడ్వాఞ్శ్చ మే ధేనుశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥౨౭॥

పష్ఠవాడితి పష్ఠ+వాట్, చ, మే, పష్ఠౌహీ, చ, మే, ఉక్షా, చ, మే, వశా, చ, మే, ఋషభః, చ, మే, వేహత్, చ, మే, అనడ్వాన్, చ, మే, ధేనుః, చ, మే, యజ్ఞేన, కల్పన్తామ్. (27)

పదార్థః :—(పష్ఠవాట్)యః పృష్ఠేన పృష్ఠేన వహతి సో హస్త్యుష్ట్రాదిః (చ) తత్సమ్బన్ధీ (మే)(పష్ఠౌహీ)బడవాదిః(చ)హస్తిన్యాదిభి రుత్థాపితాః పదార్థాః(మే)(ఉక్షా)వీర్యసేచకః(చ)వీర్యధారి

కా॰(మే)(వశా)వన్ధ్యా గౌః[చ]వీర్యహీనః[మే][ఋషభః)బలిష్ఠః[చ]బలవతీ[మే][వేహత్] యస్య వీర్యం యస్యా గర్భో వా విహన్యతే న సా చ[చ]సామర్థ్యహీనః[మే)(అనడ్వాన్]హలశకటాదివహనసామర్థః[చ)శకటవాహీ జనః(మే)(ధేనుః)దుగ్ధదాత్రీ(చ)దోగ్ధా(మే)(యజ్ఞేన)పశుశిక్షేణ (కల్పన్తామ్)సమర్థయన్తు.॥౨౭॥ అన్వయః :-మే పష్ఠవాట్ చ మే పష్ఠౌహీ చ మే ఉక్షా చ మే వశా చ మ ఋషభశ్చ మే వేహాశ్చ మేఽనడ్వాంశ్చ మే ధేనుశ్చ యజ్ఞేన కల్పన్తామ్. ॥౨౭॥ భావార్థః :- యే పశూన్ సుశిక్ష్య కార్యేషు సంయుఞ్జతే తే సిద్ధార్థా జాయన్తే. ॥౨౭॥

పదార్థము :-మే పష్ఠవాట్ = వీపుచే భారవహన మొనర్చు ఒంటె మున్నగునవి, చ = వానికి సంబంధించినవి, మే పష్ఠౌహీ = వీపుతో భారవహనమొనర్చు ఆడ యేనుగు, ఆడ యొంటెలు మొద లగునవి, చ = అవి మోయు పదార్థములు, మే ఉక్షా = నాకు చెందిన వీర్య సేచన సమర్థమైన వృషభము, చ = వీర్యమును ధారణ మొనర్చుగోవు,మే వశా = నా గొడ్డుబోతు ఆవు, చ = వీర్యహీన వృషభము, మే ఋషభః = నా బలిష్ఠ బలీవర్ధము, చ = బలసిన ఆవు, మే వేహత్ = నా ఈసుక పోవు ఆవు, వీర్యము చెడిపోయిన ఎద్దు, చ = సామర్థ్య హీనములైన గోవృషభములు, మే అనడ్వాత్ = హల శకటాదులను లాగు ఎద్దు, చ = బండితోలువాడు, మే ధేనుః = నాకుచెందిన క్రొత్తగా యీనిన పాడియావు, చ = పాలుపితుకు వాడు, వీరందరు-ఇవియన్నియు, యజ్ఞేన = పశుశిక్షారూప యజ్ఞముచే, కల్పంతామ్ = సమర్థము లగుగాక । ॥౨౭॥

భావార్థము :-పశువులకు మంచి శిక్షణ నొసగి కార్యములందు వినియోగపఱచువారు స్వప్రయోజనములను సాధించుకొని సుఖులగు చున్నారు. ॥౨౭॥ (౯౭౬).

౯౭౭ వాజాయేత్యస్య దేవా ఋషయః, సంగ్రామే విదాత్మా దేవతా, పూర్వస్య నిచృదతి శక్వరీ ఛన్దః, పఞ్చమః స్వరః ఇయ మిత్యుత్తరస్యార్చీ బృహ్యతీ ఛన్దః-ఋషభః స్వరః.

అథ కీదృశీ వాక్ స్వీకార్యేత్యాహ. ఇప్పు డెటువంటి వాణిని స్వీకరించ వలయును ?

వాజా॒య స్వాహా॑ ప్రస॒వా॒య స్వాహా॑ పి॒జా॒య స్వాహా॑ క్రత॑వే॒ స్వాహా॑ వస॑వే॒ స్వాహా॑ హ॒ర్పత॑యే॒ స్వాహాహ్నే॑ ము॒గ్ధాయ॒ స్వాహా॑ ము॒గ్ధాయ॑ వై॒నꣳ శి॒నా॒య స్వాహా॑ వి॒న॒ꣳశిన॑ ఆన్త్యాయ॒నా॒య స్వాహా॑ న్త్యా॑య భౌవ॒నా॒య స్వాహా॑ భువ॑నస్య॒ పత॑యే॒ స్వాహాధి॑పత॒యే స్వాహా॑ ప్ర॒జాప॑త॒యే స్వాహా॑ । ఇ॒యం తే॒ రాణ్మి॒త్రాయ॑ య॒న్తాసి॒ యమ॑న ఊ॒ర్జే త్వా॒ వృష్ట్యై॑ త్వా ప్ర॒జానాం॒ త్వాధి॑పత్యాయ ॥౨౮॥

వాజాయ, స్వాహా. ప్రసవాయేతి ప్ర+సవాయ, స్వాహా, అపిజాయ, స్వాహా, క్రతవే, స్వాహా, వసవే, స్వాహా, అహర్పతయే, స్వాహా, అహ్నే, ముగ్ధాయ, స్వాహా, ముగ్ధాయ, వైనꣳశినాయ, స్వాహా, వినꣳశిన ఇతి వినꣳశినే, ఆన్త్యాయనాయ, స్వాహా, ఆన్త్యాయ, భౌవనాయ, స్వాహా, భువనస్య, పతయే, స్వాహా, అధిపతయ ఇత్యధి+పతయే, స్వాహా, ప్రజాపతయ ఇతి ప్రజా + పతయే,

స్వాహా, ఇయమ్, తే, రాట్, మిత్రాయ, యన్తా, అసి, యమనః, ఊర్జే, త్వా, వృష్ట్యై, త్వా, ప్రజానామితి ప్ర+జానామ్, త్వా, అధిపత్యాయేత్యాధి—పత్యాయ.

*పదార్థః* :—(వాజాయ)సంగ్రామాయ (స్వాహా) సత్యా క్రియా (ప్రసవాయ) ఐశ్వర్యాయ సన్తానోత్పాదనాయ వా(స్వాహా)పురుషార్థబలయుక్తా సత్యా వాక్(అపిజాయ) స్వీకారాయ(స్వాహా) సాధ్వీ క్రియా (క్రతవే) విజ్ఞానాయ (స్వాహా) యోగాభ్యాసాదిక్రియా (వసవే) వాసాయ (స్వాహా) ధన ప్రాపికా క్రియా (అహర్పతయే) అహ్నాం పాలకాయ (స్వాహా) కాలవిజ్ఞాపితా క్రియా (అహ్నే) దినాయ (ముగ్ధాయ) ప్రాపితమోహాయ (స్వాహా) వైరాగ్య యుక్తా క్రియా (ముగ్ధాయ) మోహం ప్రాప్తాయ (వైనంశినాయ) వినష్టం శీలం యస్య తస్యాయం బోధస్తస్మై (స్వాహా) సత్యోపదేశికా వాక్ (వినంశినే) వినష్టం శీలాయ (అన్త్యాయనాయ) అన్తే భవ మయనం యస్య స అన్త్యాయనః స ఏవ తస్మై (స్వాహా) సత్యా వాణీ (అన్త్యాయ) అన్తే భవాయాన్త్యాయ (భౌవనాయ) భువనానా మయం సమ్బన్ధీ తస్మై [స్వాహా] సుష్ఠూపదేశః [భువనస్య] భవన్తి భూతాని యస్మిన్నస్య [పతయే] స్వామినే [స్వాహా] ఉత్తమా వాక్ [అధిపతయే] పతీనాం పాలికానామధిష్ఠాత్రే [స్వాహా] రాజవ్యవహారసూచికా క్రియా[ప్రజాపతయే]ప్రజారక్షకాయ[స్వాహా]రాజధర్మద్యోతికా నీతిః [ఇయమ్]నీతిః[తే]తవ[రాట్]యా రాజతే సా[మిత్రాయ]సుహృదే[యన్తా]నియామకః[అసి][యమనః] య స్సద్ గుణాన్ యచ్ఛతి సః[ఊర్జే]పరాక్రమాయ[త్వా]త్వామ్[వృష్ట్యై]పర్షణాయ[త్వా]త్వామ్ (ప్రజానామ్]పాలనీయానామ్[త్వా]త్వామ్[ఆధిపత్యాయ] అధిష్ఠాతృత్వాయ. ॥౨౮॥ *అన్వయః* :— యేన విదుషా వాజాయ స్వాహా ప్రసవాయ స్వాహా పిజాయ స్వాహా క్రతవే స్వాహా వసవే స్వాహాఽహర్పతయే స్వాహాఽహ్నే ముగ్ధాయ స్వాహా ముగ్ధాయ వైనంశినాయ స్వాహా వైనంశిన ఆన్త్యాయనాయ స్వాహాఽఽన్త్యాయ భౌవనాయ స్వాహా భువనస్య పతయే స్వాహాఽధిపతయే స్వాహా ప్రజాపతయే స్వాహా స్వీక్రియతే యస్య తే తవేయం రాడస్తి యో యమనస్త్వం మిత్రాయ యన్తాసి తం త్వా త్వా మూర్జే త్వా వృష్ట్యై త్వా ప్రజానామాధిపత్యాయ చ వయం స్వీకుర్వీమహి. ॥౨౮॥
*భావార్థః* :—యే మనుష్యాః ధర్మ్యవాక్క్రియాభ్యాం సహ ప్రవర్తన్తే తే సుఖాని లభన్తే య జితేన్ద్రియాస్తే రాజ్యం రక్షితుం శక్నువన్తి. ॥౨౮॥

పదార్థము :—ఏ విద్వాంసునిచే, వాజాయ = సంగ్రామమునకై, స్వాహా = సత్యక్రియ, ప్రసవాయ = ఐశ్వర్యోత్పత్తికై లేక సంతానోత్పత్తికై, స్వాహా = పురుషార్థము బలము కలగిన సత్య వాణి, అపిజాయ = గ్రహణ మొనర్చుటకై; స్వాహా = ఉత్తమక్రియ, క్రతవే = విజ్ఞానమునకై, స్వాహా = యోగాభ్యాసాది క్రియ, వసవే = నివాసస్థానమునకై, స్వాహా = ధనప్రాప్తికలిగించు క్రియ, అహర్పతయే = దినములను పాలించువానికై, స్వాహా = కాలవిజ్ఞానము నొసగు క్రియ, అహ్నే = దినమునకై లేక, ముగ్ధాయ = మూఢునికై, స్వాహా = వైరాగ్యయుక్త క్రియ, ముగ్ధాయ = మోహప్రాప్తుని కొఱకై, వైనంశినాయ = వినాశమొందు వాని కొనర్చబడు బోధకై, స్వాహా = సత్యహితోప దేశమొనర్చు వాణి, వినంశినే = వినాశము పొందు స్వభావమునకై, ఆంత్యాయ నాయ = చివరయిల్లు గలవానికై, స్వాహా = సత్యవాణి, అన్త్యాయ = నీచవర్ణమునం దుత్పన్న మైనవానికై, భౌవనాయ = భువన సంబంధికై, స్వాహా = ఉత్తమోపదేశము, భువనస్య = ప్రాణి మాత్రము ఉత్పన్నమగు భువనము యొక్క, పతయే = స్వామికై, స్వాహా = ఉత్తమ, వాణి, అధి

పతయే = పాలించువారిలో అధిష్ఠాతకై, స్వాహా = రాజ వ్యవహారమును తెలియ జేయు క్రియ మఱియు, ప్రజాపతయే = ప్రజలను పాలించు వాని కొఱకు, స్వాహా = రాజధర్మమును ప్రకాశ మొనర్చు నీతి స్వీకరించబడు చున్నదో మరియు, తే = ఏ నీ యొక్క, ఇయం రాట్ = ఈ రాజిల్లు విశేష నీతియున్నదో మఱియు, యమనః = సుగుణములను గ్రహించు నే నీవు, మిత్రాయ = మిత్రునికై, యన్తా అసి = ఉచిత సత్కార మొనర్చు వాడవై యున్నావో, త్వా = అట్టి నిన్ను, ఊర్జే = పరాక్రమముకొఱకు, త్వా = నిన్ను, వృష్ట్యై = వర్షమునకై, మఱియు, త్వా = నిన్ను, ప్రజానామ్ = పాలించదగు ప్రజల యొక్క, ఆధి పత్యాయ = అధిపతి యగుటకై, స్వీకరించుచున్నాము. ॥౨౮॥

భావార్థము :—ధర్మయుక్తవాణితోను ధార్మికక్రియతోను కూడియున్నవారు సుఖములను పొందు చున్నారు. జితేంద్రియులైనవారు రాజ్యపాలనమునకై సమర్థు లగుచున్నారు. ॥౨౮॥ (౯౭౨)

౯౭౩ ఆయుర్యజ్ఞేనేత్యస్య దేవా ఋషయః, యజ్ఞానుష్ఠాతాత్మా, దేవతా, పూర్వస్య స్వరాడ్వికృతిశ్ఛన్దః, పఞ్చమః స్వరః. స్తోమశ్చేత్యస్య బ్రాహ్మ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

అథ కిం కిం యజ్ఞసిద్ధయే నియోజనీయ మిత్యాహ. యజ్ఞసిద్ధికై ఏమేమి యొనర్చ వలయును ?

ఆయు ర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతాం చక్షుర్యజ్ఞేన కల్పతాం శ్రోత్రం యజ్ఞేన కల్పతాం వాగ్యజ్ఞేన కల్పతాం మనో యజ్ఞేన కల్పతా మాత్మా యజ్ఞేన కల్పతాం బ్రహ్మా యజ్ఞేన కల్పతాం జ్యోతి ర్యజ్ఞేన కల్పతాం స్వర్యజ్ఞేన కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన కల్పతామ్ । స్తోమశ్చ యజుశ్చఋక్చ సామ చ బృహచ్చ రథన్తరం చ । స్వర్దేవా అగన్మామృతా అభూమ ప్రజాపతేః ప్రజా అభూమ వేట్ స్వాహా ॥ ॥౨౯॥

ఆయుః, యజ్ఞేన కల్పతామ్, ప్రాణః యజ్ఞేన, కల్పతామ్, చక్షుః, యజ్ఞేన, కల్పతామ్, శ్రోత్రమ్, యజ్ఞేన, కల్పతామ్, వాక్, యజ్ఞేన, కల్పతామ్, మనః, యజ్ఞేన, కల్పతామ్, ఆత్మా, యజ్ఞేన, కల్పతామ్, బ్రహ్మా, యజ్ఞేన, కల్పతామ్, జ్యోతిః, యజ్ఞేన, కల్పతామ్, స్వః, యజ్ఞేన, కల్పతామ్, పృష్ఠమ్, యజ్ఞేన, కల్పతామ్, యజ్ఞః, యజ్ఞేన కల్పతామ్, స్తోమః, చ, యజుః, చ, ఋక్, చ, సామ, చ, బృహత్ చ, రథన్తరమితి రథమ్ + తరమ్, చ, స్వః, దేవాః, అగన్మ, అమృతాః, అభూమ, ప్రజాపతేరితి ప్రజా + పతేః ప్రజా ఇతి ప్ర + జాః, అభూమ, వేట్, స్వాహా.

పదార్థః :-(ఆయుః)ఏతి జీవనం యేన తత్(యజ్ఞేన)పరమేశ్వరస్య విదుషాం చ సత్కారేణ (కల్పతామ్) సమర్థం భవతు(ప్రాణః)జీవనహేతుః (యజ్ఞేన) సంగతికరణేన (కల్పతామ్) (చక్షుః)నేత్రమ్ (యజ్ఞేన)(కల్పతామ్)(శ్రోత్రమ్) శ్రవణేన్ద్రియమ్ (యజ్ఞేన) (కల్పతామ్) (వాక్) వక్తి యయా సా వాణీ(యజ్ఞేన) (కల్పతామ్)(మనః)అన్తఃకరణమ్(యజ్ఞేన)(కల్పతామ్)(ఆత్మా) అతతి శరీరమిన్ద్రియాణి ప్రాణాంశ్చ వ్యాప్నోతి సః(యజ్ఞేన)(కల్పతామ్)(బ్రహ్మా)చతుర్వేదవిద్విద్వాన్(యజ్ఞేన కల్పతామ్) (జ్యోతిః) న్యాయ ప్రకాశః(యజ్ఞేన కల్పతామ్)(స్వః)సుఖమ్(యజ్ఞేన)(కల్పతామ్)(పృష్ఠమ్) జ్ఞాతు మిచ్ఛా (యజ్ఞేన)అధ్యయనాఖ్యేన (కల్పతామ్) (యజ్ఞః)సఙ్గన్తవ్యో ధర్మః(యజ్ఞేన) సత్యవ్యవహారేణ (కల్పతామ్)(స్తోమః) స్తువన్తి యస్మిన్ సోఽథర్వవేదః (చ) (యజుః) యజతి యేన స యజుర్వేదః (చ)(ఋక్)ఋగ్వేదః(చ)(సామ)సామవేదః(చ)(బృహత్)మహత్(చ)(రథన్తరమ్) సామస్తోత్రవిశేషః(చ)(స్వః)మోక్షసుఖమ్(దేవాః)విద్వాంసః(అగన్మ)ప్రాప్నుయామ(అమృతాః)జన్మమరణ దుఃఖరహితాః సన్తః(అభూమ)భవేమ(ప్రజాపతేః)సకలసంసారస్య స్వామినో జగదీశ్వరస్య (ప్రజాః)పాలనీయాః(అభూమ)భవేమ(వేట్)సత్క్రియయా(స్వాహా)సత్యయా వాణ్యా. ॥౨౯॥

అన్వయః :-హే మనుష్య! తే తవ ప్రజానా మాధిపత్యాయాయు ర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతాం చక్షు ర్యజ్ఞేన కల్పతాం శ్రోత్రం యజ్ఞేన కల్పతామ్ వాగ్ యజ్ఞేన కల్పతాం మనో యజ్ఞేన కల్పతాం మాత్మా యజ్ఞేన కల్పతాం బ్రహ్మా యజ్ఞేన కల్పతాం జ్యోతిర్యజ్ఞేన కల్పతాం స్వర్యజ్ఞేన కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతామ్ యజ్ఞో యజ్ఞేన కల్పతాం స్తోమశ్చ యజుశ్చ ఋక్ చ సామ చ బృహచ్చ రథన్తరం చ యజ్ఞేన కల్పతామ్. హే! దేవా విద్వాంసో యథా వయ మమృతాః స్వరగన్మ ప్రజాపతేః ప్రజా అభూమ వేట్ స్వాహాయుక్తాశ్చ భూమ తథా యూయమపి భవత. ॥౨౯॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. పూర్వమన్త్రాత్(తే)(ఆధిపత్యాయ)ఇతి పదద్వయ మనువర్తతే, మనుష్యా ధార్మికవిద్వదనుకరణేన యజ్ఞాయ సర్వం సమర్ప్యపరమేశ్వరం న్యాయాధీశం రాజానం చ మత్వా సతతం న్యాయపరాయణా భూత్వా సుఖినః స్యుః. ॥౨౯॥

పదార్థము :-మానవులారా! మీ ప్రజలకు అధిపతి యగుటకు, ఆయుః = జీవన వయస్సు, యజ్ఞేన = పరమేశ్వర పూజచే, మహాత్ముల సత్కారముచే, కల్పతామ్ = సమర్థమగు గాక! ప్రాణః = జీవనహేతువగు ప్రాణవాయువు, యజ్ఞేన = సంగమొనర్చుటచే, కల్పతామ్ = సమర్థమగు గాక! చక్షుః = నేత్రము, యజ్ఞేన = పరమేశ్వర పూజచే లేక విద్వాంసుని సత్కారముచే, కల్పతామ్ = సమర్థమగునుగాక! శ్రోత్రమ్ = చెవులు. యజ్ఞేన = ఈశ్వరుని లేక విద్వాంసుని సత్కారముచే, కల్పతామ్ = సమర్థము లగుగాక! వాక్ = వాణి, యజ్ఞేన = ఈశ్వర విద్వాంసుల సత్కారముచే, కల్పతామ్ = సమర్థమగు గాక! మనః = సంకల్ప వికల్ప మొనర్చు మనస్సు, యజ్ఞేన = ఈశ్వర విద్వాంసుల సత్కారముచే, కల్పతామ్ = సమర్థమగు గాక! ఆత్మా = శరీరేంద్రియ ప్రాణాది వాయువులందు వ్యాప్తమగుచున్న ఆత్మ,యజ్ఞేన = ఈశ్వర విద్వాంసుల సత్కారముచే, కల్పన్తామ్ = సమర్థమగు గాక! బ్రహ్మా = నాలుగు వేదముల నెఱుగు విద్వాంసుడు. యజ్ఞేన = పరమాత్మ విద్వాంసుల సత్కారముచే, కల్పంతామ్ = సమర్థమగుగాక! జ్యోతిః = న్యాయప్రకాశము, యజ్ఞేన = దేవపండిత సత్కారముచే, కల్పతామ్ = సమర్థమగుగాక! స్వః = సుఖము, యజ్ఞేన కల్పతామ్ = దేవపండిత సత్కారములచే సమర్థమగుగాక! పృష్ఠమ్ = జిజ్ఞాస, యజ్ఞేన = పఠనరూప యజ్ఞముచే, కల్పతామ్ = సమర్థమగుగాక! యజ్ఞః = పొందదగు ధర్మము, యజ్ఞేన = సత్యవ్యవహార

ముచే, కల్పతామ్ = సమర్థమగు గాక ! స్తోమః = స్తుతియున్న యథర్వవేదము, చ = మరియు, యజుః = జీవము సత్కార్యములాది యొనర్చు యజుర్వేదము. చ = మరియు. ఋక్ = స్తుతి సాధక మగు ఋగ్వేదము, చ = మరియు.సామ = సామవేదము, చ = మరియు, బృహత్ = అత్యంత గొప్పవస్తువు, చ = మరియు సామవేదముయొక్క. రథన్తరమ్ చ = రథంతరమను స్తోత్రము కూడ ఈశ్వర విద్వాంసుల సత్కారిములచే సమృద్ధములగు గాక ! దేవాః = విద్వాంసులారా ! మే మెటుల, అమృతాః = జన్మ మరణదుఃఖ రహితులమై, స్వః = మోక్ష సుఖమును, అగన్మ = పొందు దుమో, లేక ప్రజాపతేః = సమస్త లోకముల కధిపతియగు జగదీశ్వరునికి. ప్రజాః = పాలించదగిన ప్రజలము, అభూమ = అగుదుమో మరియు. వేట్ = ఉత్తమ క్రియావంతులము, స్వాహా = సత్య వాణీయుతులము, అభూమ = అగుదుమో అటులనే మీరును గండు. ॥౨౯॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది, ఇట పూర్వమంత్రము నుండి "తే, ఆధిపత్యాయ" అను రెండు పదములు యనువృత్తి వచ్చినది.మానవులు ధార్మికవిద్వాం సుల యనుకరణముచే యజ్ఞమునకై సర్వము సమర్పించి పరమేశ్వరుని- రాజును న్యాయాధీశులుగ భావించి న్యాయపరాయణులై నిరంతరము సుఖులు కావలయును. ॥౨౯॥ (౯౩౯)

---

౯౪౦ వాజస్యేత్యస్య దేవా ఋషయః, రాజ్యవానాత్మా దేవతా, స్వరాడ్జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పునర్మనుష్యైఃకస్య కథముపాసనా కార్యేత్యాహ. మానవు లెటుల ఎవనిని ఉపాసించ వలయును.

వాజస్య ను ప్రసవే మాతరం మహీమదితిం నామ వచసా కరామహే ।
యస్యామిదం విశ్వం భువనమావివేశ తస్యాన్నో దేవః సవితా ధర్మ సావిషత్ ॥

వాజస్య, ను, ప్రసవ, ఇతి ప్ర+సవే, మాతరమ్, మహీమ్, అదితిమ్, నామ, వచసా, కరామహే, యస్యామ్, ఇదమ్, విశ్వమ్, భువనమ్, ఆవివేశేత్యా+ వివేశ, తస్యామ్, నః, దేవః, సవితా, ధర్మ, సావిషత్. (30)

పదార్థః:-(వాజస్య)వివిధోత్తమస్యాన్నస్య(ను)ఏవ(ప్రసవే)ఉత్పాదనే (మాతరమ్)మాన్యని మిత్తమ్(మహీమ్)మహతీం భూమిమ్(అదితిమ్) కారణరూపేణ నిత్యామ్ (నామ)ప్రసిద్ధా (వచసా) వచనేన(కరామహే)కుర్యామ్,అత్ర వికరణవ్యత్యయేన శప్(యస్యామ్) పృథివ్యామ్(ఇదమ్)ప్రత్యక్ష మ్(విశ్వమ్)సర్వమ్(భువనమ్)భవన్తి యస్మింస్తత్ స్థూలం జగత్(ఆవివేశ)ఆవిష్టమస్తి (తస్యామ్) (నః)అస్మాకమ్(దేవః)శుద్ధస్వరూపః(సవితా)సకలైశ్వర్యయుక్త ఈశ్వరః (ధర్మ) ధారణామ్ (సావి షత్)సువతు. ॥౩౦॥ అన్వయః :-వాజస్య ప్రసవే ను వర్తమానా వయం మాతర మదితిం మహీం నామ వచసా కరామహే యస్యా మిదం విశ్వం భువన మావివేశ తస్యాం సవితా దేవో నో ధర్మ సావిషత్. ॥౩౦॥ భావార్థః :-యేన జగదీశ్వరేణ సర్వస్యాధికరణం యా భూమి ర్ని ర్మితా సా సర్వం ధరతి స ఏవ సర్వై ర్మనుష్యై రుపాసనీయః. ॥౩౦॥

పదార్థము :-వాజస్య = వివిధప్రకారముల ఉత్తమఅన్నమును, ప్రసవే ను = ఉత్పన్న మొన ర్చుటలోనే తత్పరులమైయున్న మేము, మాతరమ్ = మాన్యహేతువు. అదితిమ్ = కారణరూపమున నిత్యమునగు, మహీమ్ = భూమిని, నామ = ప్రసిద్ధి యందు, వచసా కరామహే = వాణిచే యుక్త

మొనర్చెదము. యస్యామ్ = ఏ పృథివిలో, ఇదమ్ విశ్వమ్ భువనమ్ = ఈ సకల జగత్తు, ఆవివేశ = వ్యాప్తమైయున్నదో, తస్యామ్ = ఆ పృథివియందు, సవితా = సకలైశ్వర్య వంతుడు, దేవః = శుద్ధస్వరూపుడు నగు ఈశ్వరుడు. సః ధర్మ = మా యుత్తమకర్మల ధారణమును, సావిషత్ = ఉత్పన్న మొనర్చును గాక ॥ ॥౩౦॥

భావార్థము :—ఏ జగదీశ్వరుడు సకలాధారములను నే గూడని నిర్మించెనో, మఱియు నెయ్యది సర్వమును ధారణ మొనర్చుచున్నదో, ఆ యీశ్వరుడే సకలమానవుల కుపాసించ దగినవాడు. ॥౩౦॥

---

౫౭౦ విశ్వే అద్యేత్యస్య దేవా ఋషయః, విశ్వేదేవా దేవతాః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథ ప్రాణినాం కర్తవ్య ముపదిశ్యతే. ప్రాణుల కర్తవ్య ముపదేశించబడు చున్నది.

విశ్వేఽఅద్య మరుతో విశ్వఽఊతీ విశ్వే భవన్త్వగ్నయః, సమిద్ధాః ।

విశ్వే నో దేవా అవసా గమన్తు విశ్వమస్తు ద్రవిణం వాజోఽఅస్మే ॥ ॥౩౧॥

విశ్వే, అద్య, మరుతః, విశ్వే, ఊతీ, విశ్వే, భవన్తు, అగ్నయః, సమిద్ధా ఇతి సమ్ ఇద్ధాః, విశ్వే, నః, దేవాః, అవసా, ఆ, గమన్తు, విశ్వమ్, అస్తు, ద్రవిణమ్, వాజః, అస్మే, ఇత్యస్మే. (31)

పదార్థః :—(విశ్వే)సర్వే(అద్య)(మరుతః)వాయవః(విశ్వే)(ఊతీ) ఊత్యా రక్షణాదినా సహ. అత్ర సుపాం సు లుగితి పూర్వసవర్ణాదేశః(విశ్వే)(భవన్తు)(అగ్నయః)పావకా ఇవ(సమిద్ధాః)సమ్యక్ ప్రదీప్తాః(విశ్వే)(నః)అస్మాకం(దేవాః)విద్వాంసః(అవసా) పాలనాదినా (ఆ)సమన్తాత్ (గమన్తు) గచ్ఛన్తు. అత్ర బహులం ఛన్దసీతి శపో లుక్(విశ్వమ్)అఖిలమ్(అస్తు)ప్రాప్తం భవతు(ద్రవిణమ్) ధనమ్(వాజః)అన్నమ్(అస్మే)అస్మభ్యమ్. ॥౩౧॥అన్వయః :—అస్యాం పృథివ్యా మద్య విశ్వే మరుతో విశ్వప్రాణినః పదార్థాశ్చ విశ్వే సమిద్ధా అగ్నయ ఇవ న ఊతీ భవన్తు విశ్వే దేవా అవసాఽఽగమన్తు యతోఽస్మే విశ్వం ద్రవిణం వాజశ్చాస్తు. ॥౩౧॥ భావార్థః :—యే మనుష్యా ఆలస్యం విహాయ విదుషః సంగత్య పృథివ్యా ప్రయతన్తే తే సమగ్రానుత్తమాన్ పదార్థాన్ ప్రాప్నువన్తి.

పదార్థము :—ఈ పృథివియందు, అద్య = నేడు, విశ్వే మరుతః = సమస్త పవనములు, విశ్వే = సమస్తప్రాణులు పదార్థములు, విశ్వే సమిద్ధాః అగ్నయః = బాగుగ ప్రజ్వలించు సమస్తాగ్నులనుబోలు మానవులు, నః ఊతీ = మా రక్షాదులచే,భవన్తు = ప్రసిద్ధు లగుదురుగాక ॥ విశ్వే దేవాః = సకల విద్వాంసులు, అవసా = పాలనాదులతో, ఆ గమన్తు = విచ్చేయుదురు గాక ॥ వచ్చి మమ్ము రక్షించుదురు గాక ॥ దానిచే, అస్మే = మాకు, విశ్వమ్ ద్రవిణమ్ = సమస్త ధనము, వాజః = అన్నము, అస్తు = ప్రాప్తించు గాక ॥ ॥౩౧॥

భావార్థము :—ఆలస్యమును వదలి విద్వత్సంగ మొనర్చి యీ పృథివియందు ప్రయత్న మొనర్చువారు సకల శ్రేష్ఠ పదార్థములను పొందుచున్నారు. ॥౩౧॥ (౫౭౦)

---

౫౭౧ వాజో న ఇత్యస్య దేవా ఋషయః, అన్నవాన్ విద్వాన్ దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

అథ విద్వాన్ ప్రజాశ్చ కథం వర్తేరన్నిత్యాహ. విద్వాంసులు ప్రజలు ఎటుల మెలగ వలయును ?

వాజో నః స॒ప్త ప్ర॒దిశ॒శ్చత॑స్రో వా పరా॒వతః ।

వాజో నో॒ విశ్వై॒ర్దేవై॒ర్ధన॑సాతా వి॒హావ॑తు ॥ ॥౩౨॥

వాజః, నః, స॒ప్త, ప్ర॒దిశ॒ ఇతి ప్ర॒దిశః, చత॑స్రః, వా, ప॒రా॒వత॒ ఇతి పరా+వతః, వాజః, న॒, వి॒శ్వైః, దే॒వైః, ధనసాతా॒విత్రి ధన + సాతౌ, ఇ॒హ, అ॒వ॒తు ॥

పదార్థః :-(వాజః)అన్నాదిః (నః)అస్మాన్ (సప్త) (ప్రదిశః) ప్రదిశ్యన్తే తాః (చతస్రః) పూర్వాద్యా దిశః(వా)చార్థే(పరావతః)దూరస్థాః (వాజః)శాస్త్రబోధో, వేగో వా (నః) అస్మాకమ్(విశ్వైః)అఖిలైః(దేవైః)విద్వద్భిః(ధనసాతౌ)ధనానాం సంవిభక్తౌ(ఇహ)అస్మింల్లోకే (అవతు) రక్షతు ప్రాప్నోతు వా. ॥౩౨॥ అన్వయః :-హే విద్వాంసో ! యథా విశ్వైర్దేవైః సహ వర్తమానో వాజ ఇహ ధనసాతౌ నోఽవతు వా నో వాజః సప్త ప్రదిశః పరావత శ్చతస్రో దిశోఽవతు తథైతా యూయం సతతం రక్షత. ॥౩౨॥ భావార్థః :-మనుష్యైః పుష్కలాన్నేన స్వేషాం పాలన మస్యాం పృథివ్యాం సర్వాసు దిక్షు సత్కీర్తిః స్యాదితి సజ్జనా ఆదర్తవ్యాః. ॥౩౨॥

పదార్థము :-విద్వాంసులారా ! ఎటుల, విశ్వైః దేవైః = సకల విద్వాంసులతో పాటు,వాజః = అన్నాదులు, ఇహ = ఈ లోకమున,ధనసాతౌ = ధనమును విభజించుటలో,నః = మాకు, అవతు = లభించునో ! వా = లేక, నః = మాయొక్క, వాజః = శాస్త్రజ్ఞానము, వేగము, సప్త ప్రదిశః = చక్కగ బోధించబడిన యేడు లోక లోకాంతరములను, పరావతః = దూర దూరముగనున్న, చతస్రః = పూర్వాది చతుర్దిశలను పాలించునో ! అనగా ఉత్తమ పదార్థము లన్నిటిని రక్షించునో, అటులనే వీని రక్షణ మీరును నిరంతర మొనర్చుడు. ॥౩౨॥

భావార్థము :-మానవులు పుష్కలాహార పదార్థములతో స్వరక్షణ ఒనర్చవలయును, మఱియు నీ జగత్తు నందంతట సత్కీర్తి లభించునటుల సత్పురుషులను సమ్మానించ వలయును. ॥౩౨॥

---

౮౯౨ వాజో న ఇత్యస్య దేవా ఋషయః, అన్నపతిర్ దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున ర్మనుష్యైః కిం కిమభీప్సితవ్య మిత్యాహ. మఱల మానవులు ఏమేమి కోరదగును ?

వాజో నో॒ఽఅ॒ద్య ప్ర సు॑వాతి॒ దాన॑ం వాజో దే॒వాఁ ౨॥ఋతుభిః కల్పయాతి ।

వాజో హి మా సర్వ॑వీరం జజా॒న విశ్వా॒ ఆశా॒ వాజ॑పతి ర్జయేయమ్ ॥౩౩॥

వాజః, నః, అ॒ద్య, ప్ర, సు॒వా॒తి॒, దాన॑మ్, వాజః, దే॒వాన్, ఋ॒తుభి॒రి॒త్యృతు+భిః, క॒ల్ప॒యా॒తి॒, వాజః, హి, మా, సర్వ॑వీర॒మి॒తి సర్వ+వీరమ్, జ॒జాన, విశ్వాః, ఆశాః, వాజపతి॒ రితి॒ వాజ+పతిః, జ॒యే॒య॒మ్. (33)

పదార్థః :-(వాజః)అన్నమ్(నః)అస్మభ్యమ్(అద్య)అస్మిన్దినే(ప్ర)(సువాతి)ప్రేరయేత్ (దానమ్) (వాజః)(దేవాన్)విదుషో దివ్యాన్గుణాన్ వా(ఋతుభిః)వసంతాదిభిః(కల్పయాతి)సమర్థయేత్ (వాజః)

(హి)ఖలు(మా) మామ్ (సర్వవీరమ్)సర్వే వీరా యస్మాత్ తమ్(జజాన)జనయతు. అత్ర లోడర్థే లిట్ (విశ్వాః)సమగ్రాః(ఆశాః) దిశః(వాజపతిః)అన్నాద్యధిష్ఠాతా(జయేయమ్)ఉత్కర్షేయమ్. ॥౩౩॥
అన్వయః :–హే మనుష్యా ! యథాఽద్య యద్వాజో నో దానం ప్రసువాతి వాజ ఋతుభి ర్దేవాన్ కల్పయాతి యద్ధి వాజః సర్వవీరం మా జజాన తేనాహం వాజపతి ర్భూత్వా విశ్వా ఆశా జయేయమ్. తథా యూయ మపి జయత. ॥౩౩॥ భావార్థః :–యావ న్తీహ ఖలు వస్తూని సంతి తావతా మన్న మేవ శ్రేష్ఠ మ స్తి యతోఽన్నవాన్ సర్వత్ర విజయీ జాయతే. ॥౩౩॥

పదార్థము :–మానవులారా ! ఎటుల, అద్య = నేడు, వాజః = ఏ యన్నము, నః = మమ్ము, దానమ్ వితరణమునకై, ప్రసువాతి = ప్రేరేపించు చున్నదో, వాజః = వేగరూప గుణము, ఋతుభిః = వసంతాది ఋతువులచే, దేవాన్ = మంచి గుణములను, [విద్వాంసులను]. కల్పయాతి = పొందుటకు సమర్థ మొనర్చు చున్నదో, లేక, హి వాజః = ఏ అన్న మైతే, సర్వవీరమ్ = సకల వీరులను కలిగి యున్న బలవంతుడనగు, మా = నన్ను, జజాన = ప్రసిద్ధ మొనర్చునో, దానిచే నేను, వాజపతిః = అన్నాదుల కధిష్ఠాతనై, విశ్వాః ఆశాః జయేయమ్ = సకల దిశలను జయించెదను గాక ; అటులనే మీరును జయించుడు. ॥౩౩॥

భావార్థము :–ఈ పృథివి మీదనున్న పదార్థములన్నిటిలో అన్నమే ప్రశంసించ దగినదై యున్నది. ఏలయన అన్నముగల పురుషుడే సర్వస్థలములందు విజయము పొందు చున్నాడు. ॥౩౩॥

౩౪ వాజః పురస్తాదిత్యస్య దేవా ఋషయః, అన్నపతిర్ దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః, అన్న మేవ సర్వాన్ పాలయతీత్యాహ. అన్న మే అందఱిని రక్షించుచున్నది.

వాజః, పురస్తాదుత మధ్యతో నో వాజో దేవాన్ హవిషా వర్ధయాతి ।
వాజో హి మా సర్వవీరం చకార సర్వా ఆశా వాజపతి ర్భవేయమ్ ॥

వాజః, పురస్తాత్, ఉత, మధ్యతః, నః, వాజః, దేవాన్, హవిషా, వర్ధయాతి, వాజః, హి, మా, సర్వవీరమితి సర్వ+వీరమ్, చకార, సర్వాః, ఆశాః, వాజపతిరితి వాజ+పతిః, భవేయమ్. (34)

పదార్థః:–(వాజః)అన్నమ్(పురస్తాత్)ప్రథమతః(ఉత)అపి(మధ్యతః)(నః)అస్మాన్(వాజః) అన్నమ్(దేవాన్)దివ్యాన్ గుణాన్(హవిషా)దానేనాదానేన చ(వర్ధయాతి)వర్ధయేత్(వాజః) (హి) కిల (మా)మామ్(సర్వవీరమ్)సర్వే వీరా యస్య తమ్(చకార)కరోతి(సర్వాః)(ఆశాః) దిశః (వాజపతిః) అన్నాదిరక్షకః(భవేయమ్). ॥౩౪॥ అన్వయః :–యద్వాజో హవిషా పురస్తాదుత మధ్యతో నో వర్ధయాతి యద్వాజో దేవాంశ్చ వర్ధయాతి యద్ధి వాజో మా సర్వవీరం చకార తేనాహం వాజపతి ర్భవేయం సర్వా ఆశా జయేయం చ. ॥౩౪॥ భావార్థః :–అన్న మేవ సర్వాన్ ప్రాణినో వర్ధయతి. అన్నేనైవ ప్రాణినః సర్వాసు దిక్షు భ్రమ న్త్యన్నేన వినా కిమపి కర్తుం న శక్నువ న్తి.

పదార్థము :–వాజః = ఏ అన్నము, హవిషా = దానగ్రహణముల వలన, భుజించుట వలన, పురస్తాత్ ఉత మధ్యతః = పూర్వము మఱియు మధ్య, నః వర్ధయాతి = మమ్ము వర్ధింప జేయు చు

న్నదో, మఱియు, వాజః = ఏ యన్నము, దేవాన్ = దివ్యగుణములను వర్ధింప జేయునో, హి వాజః = ఏ యన్నమైతే, మా = నన్ను, సర్వవీరమ్ = సమస్త వీరులను కలిగి యున్న వానినిగ, చకార = చేయుచున్నదో దానిచే నేను, వాజపతిః = అన్నాది పదార్థముల రక్ష యొనర్చువానినిగ, భవేయమ్ = అగుదును గాక ! మఱియు, సర్వాః ఆశాః = సకల దిశలను జయించెదను గాక ! ॥౩౪॥

భావార్థము :- అన్నమే సకల ప్రాణులను వర్ధింప జేయుచున్నది. అన్నము వలననే సకల ప్రాణులు సమస్త దిశలందు భ్రమించుచున్నవి. అన్నము లేనిదే ఎవరును ఏమియు చేయజాలరు.

---

౫౦౪ సంమాసృజామీత్యస్య దేవా ఋషయః, రసవిద్యావిద్విద్వాన్ దేవతా, స్వరాడార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున ర్మనుష్యాః కిం కుర్యు రిత్యుపదిశ్యతే. మఱల మానవులేమి చేయుదురు?

సం మా సృజామి పయసా పృథివ్యాః సం మా సృజామ్యద్భి రోషధీభిః ।

సో౨ఽహం వాజꣳ సనేయమగ్నే ॥ ॥౩౫॥

సమ్, మా, సృజామి, పయసా, పృథివ్యాః, సమ్, మా, సృజామి, అద్భి రిత్యత్+భిః, ఓషధీభిః, సః, అహమ్, వాజమ్, సనేయమ్, అగ్నే. (35)

పదార్థః :-(సమ్)ఏకీభావే(మా)మామ్(సృజామి)సంవధ్నామి(పయసా) రసేన (పృథివ్యాః) (సమ్)(మా)(సృజామి)(అద్భిః)సంసాధితైః శుద్ధైః(ఔషధీభిః)సోమలతాదిభిః(సః)(అహమ్)(వాజమ్) అన్నమ్(సనేయమ్)సంభజేయమ్(అగ్నే)విద్వన్. ॥౩౫॥ అన్వయః :- హే అగ్నే ! రసవిద్యావిద్విద్వన్ యో౨ఽహం పృథివ్యాః పయసా మా సంసృజామి. అద్భి రోషధీభిః సహ చ మా సంసృజామి, సో౨ఽహం వాజం శనేయ మేవం త్వమప్యాచర. ॥౩౫॥ భావార్థః :-అత్ర వాచకలుప్తోపమాలకారః. హే మనుష్యా ! యథా౨ఽహం వైద్యకశాస్త్రరీత్యా౨ఽన్నపానాదికం కృత్వా సుఖీ భవామి తథా యూయ మపి ప్రయతధ్వమ్. ॥౩౫॥

పదార్థము :-అగ్నే = రసవిద్య నెఱుగు విద్వాంసుడా ! ఏ నేను, పృథివ్యాః = పృథివియొక్క, పయసా = రసముతో, మా = నన్ను, సం సృజామి = కలుపు చున్నానో లేక, అద్భిః = మంచిశుద్ధ జలములతోను, ఓషధీభిః = సోమలతాద్యోషధులతోను, మా = నన్ను, సంసృజామి = సంబంధమొనర్చు చున్నానో, సః అహమ్ = అట్టి నేను, వాజమ్ = అన్నమును, స నేయమ్ = సేవించెదనుగాక, ఇదే విధముగ నీవును ఆచరించుము. ॥౩౫॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. మానవులారా నేనెటుల వైద్యక శాస్త్రపద్ధతితో అన్నపానాదు లొనర్చి సుఖుడ నగుచున్నానో అటులనే మీరును ప్రయత్నించుడు. ॥౩౫॥ (౫౦౪)

---

౫౦౫ పయః పృథివ్యామిత్యస్య దేవా ఋషయః, రసవిద్విద్వాన్ దేవతా, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

మనుష్యాః జలరసవిదః స్యు రిత్యాహ. మానవులు జలరస విదులు కావలయును.

పయః పృథివ్యాం పయ ఓషధీషు పయో దివ్య న్తరిక్షే పయో ధాః ।

పయస్వతీః ప్రదిశః సన్తు మహ్యామ్ ॥ ॥౩౬॥

పయః, పృథివ్యామ్, పయః, ఓషధీషు, పయః, దివి, అన్తరిక్షే, పయః, ధాః, పయస్వతీః, ప్రదిశ ఇతి ప్ర+దిశః, సన్తు, మహ్యామ్. (36)

పదార్థః :—(పయః)జలరసఞ్చ(పృథివ్యామ్)(పయః)(ఓషధీషు) (పయః)(దివి)శుద్ధే ప్రకాశే (అన్తరిక్షే)సూర్యపృథివ్యో ర్మధ్యే(పయః)రసమ్(ధాః)దధీథాః (పయస్వతీః)పయో బహూరసో విద్యతే యాసు తాః(ప్రదిశః)ప్రకృష్టా దిశః(సన్తు)(మహ్యామ్). ॥౩౬॥ అన్వయః :- హే విద్వంస్త్వం పృథివ్యాం యత్పయ ఓషధీషు యత్పయో దివ్యన్తరిక్షే యత్పయో ధాస్తత్సర్వం పయోఽహమపి ధరామి. యాః ప్రదిశః పయస్వతీ స్తుభ్యం సన్తు తా మహ్య మపి భవన్తు. ॥౩౬॥ భావార్థః :—యే మనుష్యా జలాది సంయుక్తేభ్యః పృథివ్యాదిభ్యః ఉత్తమాన్నాన్ రసాంశ్చ సంగృహ్య ఖాదన్తి పిబన్తి చ తేఽరోగా భూత్వా సర్వాసు దిక్షు కార్యం సాద్ధుం గన్తు మాగన్తుం వా శక్నువన్తి దీర్ఘాయుషశ్చ జాయన్తే. ॥౩౬॥

పదార్థము :—విద్వాంసుడా! నీవు, పృథివ్యామ్ పయః = భూమి మీద నే జల దుగ్ధాదుల రసమును, ఓషదీషుపయః = ఓషధులందలి ఏ జలమును, దివి అన్తరిక్షే పయః = శుద్ధ నిర్మల ప్రకాశమున లేక తరణిధరణులమధ్య ఏ రసమును, ధాః = ధారణ మొనర్చు చున్నావో, పయః = ఆ సమస్త జలమును,లేక దుగ్ధరసమును నేనును ధారణ మొనర్చెదను,ప్రదిశః = ఏ దిశాప్రదిశలు నీకు, పయస్వతీః = బహూరసవంతములై నవిగ. సంతు = అగునో అవి, మహ్యామ్ = నాకును నగుగాక ! ॥౩౬॥

భావార్థము :—ఏ మానవులు జలాది సంయుక్తములగు పృథివ్యాదులనుండి ఉత్తమాన్నములను, రసములను సంగ్రహించి తినుచున్నారో త్రాగుచున్నారో వారు రోగరహితులై సకల దిశలందు కార్యమును సాధించుటకు, లేక రాకపోకలొనరించుటకు శక్తివంతు లగుచున్నారు, దీర్ఘాయుష్మంతులు నగు చున్నారు. ॥౩౬॥ (౫౮౫)

---

౫౮౬ దేవస్యత్వేత్యస్య దేవా ఋషయః, సామ్రాడ్ రాజా దేవతా, ఆర్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పున ర్మనుష్యాః కీదృశం రాజానం మన్యేర న్నిత్యుపదిశ్యతే.

మానవు లెటువంటి వానిని రాజుగ భావించ వలయును ?

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్ ।
సరస్వత్యై వాచో యన్తు యన్త్రేణాగ్నేః సామ్రాజ్యేనాభిషిఞ్చామి ॥౩౭॥

దేవస్య, త్వా, సవితుః, ప్రసవ ఇతి ప్ర+సవే, అశ్వినోః, బాహుభ్యామితి బాహు+భ్యామ్, పూష్ణః, హస్తాభ్యామ్, సరస్వత్యై, వాచః, యన్తు, యన్త్రేణ, అగ్నేః, సామ్రాజ్యేనేతి, సామ్+రాజ్యేన, అభిషిఞ్చామీత్యభి+సిఞ్చామి. (37)

పదార్థః :—(దేవస్య)స్వప్రకాశ స్యైశ్వరస్య(త్వా)త్వామ్(సవితుః)సకలైశ్వర్యప్రాపకస్య(ప్రసవే)ప్రసూతే జగతి(అశ్వినోః)సూర్యాచన్ద్రమసోః ప్రతాపశీతలత్వాభ్యామివ(బాహుభ్యామ్)భుజాభ్యామ్

(పూష్ణః)ప్రాణస్య ధారణాకర్షణాభ్యామివ(హస్తాభ్యామ్)కరాభ్యామ్(సరస్వత్యై)పరో విజ్ఞానం విద్యతే యస్యాస్తస్యాః. అత్ర షష్ఠ్యర్థే చతుర్థీ(వాచః)వాణ్యాః (యన్తుః)నియన్తుః (యన్త్రేణ) కలాకౌశలత యోత్పాదితేన(అగ్నేః)విద్యుదాదేః(సామ్రాజ్యేన)యః సమగ్రాయా భూమేర్మధ్యే సమ్యక్ రాజతే స సమ్రాట్ తస్య భావేన సార్వభౌమత్వేన(అభిషిఞ్చామి). ॥౩౭॥ అన్వయః :—హే విద్వన్! రాజన్ ! యథాఽహం త్వా సవితుర్దేవస్య ప్రసవేఽశ్వినోర్బాహుభ్యామ్ పూష్ణో హస్తాభ్యామ్. సరస్వత్యై వాచో యన్తురగ్నేర్యన్త్రేణ సామ్రాజ్యే నాభిషిఞ్చామి. తథా భవాన్సుఖేన మామభిషిఞ్చతు. ॥౩౭॥ భావార్థః :—అత్ర వాచకలుప్తోపమాలంకారః. మనుష్యైః సర్వవిద్యావిద్భిర్భూత్వా సూర్యాదిగుణకర్మసదృశస్వభావో రాజా మన్తవ్యః. ॥౩౭॥

పదార్థము :—విద్వాంసుడైన రాజా ! త్వా = నిన్ను. సవితుః = సకలైశ్వర్యములను సమకూర్చువాడును, దేవస్య = స్వయంప్రకాశకుడు నగు పరమేశ్వరుడు, ప్రసవే = సృజించిన జగత్తులో, అశ్వినోః = సూర్య చంద్రుల ప్రతాప శీతలత్వములవలె నుండు, బాహుభ్యామ్ = భుజములచే, పూష్ణః = పుష్టినొసగు ప్రాణములను ధారణాకర్షణము లొనర్చునటువంటి, హస్తాభ్యామ్ = చేతులతో, సరస్వత్యై = విజ్ఞానయుక్తమగు, వాచః = వాణిని, యంతుః = నియమమునందుంచు, అగ్నేః = విద్యుదాద్యగుల యొక్క, యంత్రేణ = కలాకౌశలత్వముచే నిర్మింపబడిన, సామ్రాజ్యేన = సామ్రాజ్యత్వముచే. అభిషించామి = అభిషేకించుచున్నాను, అనగా అధికార మిచ్చుచున్నాను. అటులనే సుఖముతో నీవు నన్నభిషేకించుము. ॥౩౭॥

భావార్థము :—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. మానవులు సకల విద్యల నెఱిగినవారై సూర్యాదుల గుణకర్మలతో సదృశమగు స్వభావముగల పురుషుని రాజుగ నొనర్చవలయును. ॥౩౭॥ (౯౭౬)

---

౯౭౭ ఋతాషాడిత్యస్య దేవా ఋషయః, ఋతువిద్యావిద్విద్వాన్ దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునా రాజా కిం కుర్యా దిత్యాహ. రాజు ఏమి చేయవలయును ?

ఋతాషాడృతధామాగ్నిర్గన్ధర్వస్తస్యౌషధయో ఽప్సరసో ముదో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రమ్ పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥

ఋతాషాట్, ఋతధామేత్యృత + ధామా, అగ్నిః, గన్ధర్వః, తస్య, ఓషధయః, అప్సరసః, ముదః, నామ, సః, నః, ఇదమ్, బ్రహ్మ, క్షత్రమ్, పాతు, తస్మై, స్వాహా, వాట్, తాభ్యః, స్వాహా. (38)

పదార్థః :—(ఋతాషాట్)య ఋతం సత్యం వ్యవహారం సహతే సః (ఋతధామా) ఋతం యథార్థం ధామ స్థిత్యర్థం స్థానం యస్య సః(అగ్నిః)పావకః(గన్ధర్వః)యో గాం పృథివీం ధరతి సః (తస్య)(ఓషధయః)(అప్సరసః)యా అప్సు సరన్తి తాః(ముదః)మోదన్తే యాసు తాః(నామ)ఖ్యాతిః (సః)(నః)అస్మాకమ్(ఇదమ్)(బ్రహ్మ)బ్రహ్మవిత్ కులమ్(క్షత్రమ్)రాజన్యకులమ్ (పాతు) రక్షతు (తస్మై)(స్వాహా)సత్యా వాణీ(వాట్)యేన వహతి సః(తాభ్యః)(స్వాహా)సత్యా క్రియా. ॥౩౮॥ అన్వయః :—హే మనుష్యా ! య ఋతాషాడృతధామా గన్ధర్వోఽగ్నిరివాస్తి తస్యౌషధయోఽప్సరసో

ముదో నామ స_న్తి స న ఇదం బ్రహ్మ క్షత్రం చ పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ఽ స్తు. ॥౩౮॥ భావార్థః :—యో జనోఽగ్నివచ్ఛత్రుదాహక ఓషధివదానన్దకారీ భవేత్ స ఏవ సర్వం రాజ్యం రక్షితుం శక్నోతి. ॥౩౮॥

పదార్థము :—మానవులారా ! ఋతాషాట్ = సత్యవ్యవహారమును సహించువాడు, ఋతధామా = నిలబడుటకు సత్యమైన స్థానము గలవాడు, గన్ధర్వః = పృథివిని ధారణ మొనర్చువాడు, అగ్నిః = అగ్ని తుల్యుడు నై యెవడున్నాడో అతనికి. ఓషధయః = ఓషధులు, అప్సరసః = నీటిమీద తేలునవి, ముదః = ఆనందము గలవి, నామ = అను పేరులు గలవియై యున్నవి. సః = అతడు, నః = మా యొక్క, ఇదమ్ బ్రహ్మ క్షత్రమ్ = బ్రహ్మను ఎఱిగిన యీ కులమును, క్షత్రియ వంశమును, పాతు = రక్షించు గాక ! తస్మై = అతనికి, స్వాహా = సత్యవాణి, వాట్ = వ్యవహారములను యథా యోగ్యముగ ఉపయోగించునది, తాభ్యః = ఆ ఓషధాదులకు, స్వాహా = సత్యక్రియ జరుగుగాక ! ॥౩౮॥

భావార్థము :—ఏ మానవుడు అగ్నివలె దుష్టులను దహించువాడై ఓషధి వలె నానంద మొనగూర్చువాడై యుండునో అతనే సమస్త రాజ్యమును రక్షించ సమర్థుడు. ॥౩౮॥ (౯౭౩)

---

౯౮౮ సꣳహిత ఇత్యస్య దేవా ఋషయః, సూర్యో దేవతా, భురిగార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః. పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

సꣳహితో విశ్వసామా సూర్యో గన్ధర్వ స్తస్య మరీచయోఽప్సరస ఆయువో నామ। స న ఇదం బ్రహ్మ క్షత్రమ్పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥

సꣳహిత ఇతి సమ్ + హితః, విశ్వసామేతి విశ్వ + సామా, సూర్యః, గన్ధర్వః, తస్య, మరీచయః, అప్సరసః, ఆయువః, నామ, సః, నః, ఇదమ్, బ్రహ్మ, క్షత్రమ్, పాతు, తస్మై, స్వాహా, వాట్, తాభ్యః స్వాహా. (39)

పదార్థః :—(సꣳహితః)సర్వై ర్మూర్తై ర్ద్రవ్యైః సత్పురుషై ర్వా సహ మిలితః (విశ్వసామా)విశ్వం సర్వం సామ సన్నిధౌ సమీపే యస్య సః(సూర్యః)సవితా(గన్ధర్వః)యో గాం పృథివీం ధరతి సః(తస్య)(మరీచయః)కిరణాః.మృ కణిభ్యా మీచిః. ఉ.౪.౭౦.(అప్సరసః)యా అప్స్వ న్తరిక్షే సర న్తి గచ్ఛ న్తి తాః(ఆయువః)సమ న్తాత్ సంయోజకా వియోజకాశ్చ(నామ)ఖ్యాతిః(సః) (నః) (ఇదమ్)వ ర్తమానమ్(బ్రహ్మ)విద్వత్కులమ్(క్షత్రమ్)శూరవీరకులమ్(పాతు)రక్షతు(తస్మై) (స్వాహా) సత్యాం క్రియామ్(వాట్)వహనమ్(తాభ్యః)అప్సరోభ్యః(స్వాహా)సుష్ఠు క్రియయా. ॥౩౯॥

అన్వయః :—హే విద్వన్ ! భవాన్ యః సంహితో సూర్యో గన్ధర్వోఽ స్తి తస్య మరీచయోఽప్సరస ఆయువో నామ స న్తి తాభ్యో విశ్వసామా స్వాహా కార్యసిద్ధిం కరోతు య స్త్వం తస్మై స్వాహా ప్రయుఙ్క్షే స భవాన్ న ఇదం బ్రహ్మ క్షత్రం చ వాట్ పాతు. ॥౩౯॥ భావార్థః :—మనుష్యాః సూర్యకిరణాన్ యుక్త్యా సేవిత్వా విద్యాశౌర్యే వర్ధయిత్వా స్వప్రయోజనం సాధయేయుః. ॥౩౯॥

పదార్థము :—విద్వాంసుడా ! ఏ నీవు, సంహితః = సకల మూ ర్తివంత ద్రవ్యములతో లేక సత్పురుషులతో కలిసి యున్నవాడవు, సూర్యః = సూర్యుడవు, గన్ధర్వః = పృథివిని ధారణ మొనర్చు వాడ

వునై యున్నావో, తస్య = అట్టి[నీవు], మరీచయః = కిరణములు, అప్సరసః = అంతరిక్షమున చరించునవి, ఆయువః = సకల దిశలనుండి సంయోగ వియోగము లొనర్చునవియునై, నామ = ప్రసిద్ధములై యున్నవి. అనగా జలాది పదార్థముల సంయోగ వియోగముల నొనర్చు చున్నవి. తాభ్యః = అంతరిక్షమున సంచరించు నా కిరణములకు, విశ్వసామా = సామవేదమును కలిగియున్ననీవు, స్వాహా = యథాయోగ్యముగ నుపయోగపడునటుల ఉత్తమక్రియచే కార్యసిద్ధి యొనరించుము, ఏ నీవు,తస్మై = అట్టిసూర్యునకై, స్వాహా = సత్యక్రియను చక్కగ వినియోగించు చున్నావు, సః = ఆ నీవు, నః ఇదమ్ బ్రహ్మక్షత్రమ్ = మా యీ విద్వాంసుల కులమును, శూరవీర కులమును, వాట్ = కార్య నిర్వాహణ మొనర్చు టను, పాతు = రక్షించుము. ॥౩౯॥

భావార్థము :–మానవులు సూర్యకిరణములను యుక్తిచే సేవించి విద్యాశౌర్యములను పెంపొందింపజేసి స్వప్రయోజనములను సాధించ వలయును. ॥౩౯॥ (౯౭౭)

---

౯౭౮ సుషుమ్ణ ఇత్యస్య దేవా ఋషయః, చన్ద్రమా దేవతా, నిచృదార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున ర్మనుష్యై శ్చన్ద్రాదిభ్య ఉపకారో గ్రాహ్య ఇత్యాహ.

మానవులు చంద్రాది లోకములనుండి ఉపకారమును గ్రహించ వలయును.

సుషుమ్ణః సూర్యరశ్మిశ్చన్ద్రమా గన్ధర్వ స్తస్య నక్షత్రాణ్యప్సరసో భేకురయో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రమ్పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥

సుషుమ్ణః, సుసుమ్న ఇతి సు+సుమ్నః, సూర్యరశ్మిరితి సూర్య+రశ్మిః, చన్ద్రమాః, గన్ధర్వః, తస్య, నక్షత్రాణి, అప్సరసః, భేకురయః, నామ, సః, నః, ఇదమ్, బ్రహ్మ, క్షత్రమ్, పాతు, తస్మై,స్వాహా, వాట్, తాభ్యః, స్వాహా. (40)

పదార్థః :–(సుషుమ్ణః)సుశోభనం సుమ్నం సుఖం యస్మాత్సః(సూర్యరశ్మిః)సూర్యస్య రశ్మయః కిరణా దీప్తయో యస్మిన్ సః(చన్ద్రమాః)యస్సర్వాన్ చన్దత్యాహ్లాదయతి సః (గన్ధర్వః) యో గాః సూర్యకిరణాన్ ధరతి సః(తస్య)(నక్షత్రాణి)అశ్విన్యాదీని(అప్సరసః)ఆకాశగతాః కిరణాః (భేకురయః)యా భాం దీప్తిం కుర్వన్తి తాః. పృషోదరాదినాఽభీష్టరూపసిద్ధిః(నామ)ప్రసిద్ధః (సః) (నః) అస్మభ్యమ్(ఇదమ్)(బ్రహ్మ)అధ్యాపకకులమ్(క్షత్రమ్)దుష్టనాశకం కులమ్(పాతు) రక్షతు (తస్మై) (స్వాహా)(వాట్)(తాభ్యః)(స్వాహా). ॥౪౦॥ అన్వయః :–హే మనుష్యాః ! యః సూర్యరశ్మిః సుషుమ్ణో గన్ధర్వ శ్చన్ద్రమా అస్తి యా స్తస్య నక్షత్రాణ్యప్సరసో భేకురయో నామ సన్తి స యథా న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తథా విధాయ తస్మై వాట్ స్వాహా తాభ్యః స్వాహా యుష్మాభిః సంప్రయోజ్యాః. ॥౪౦॥ భావార్థః :–మనుష్యైశ్చన్ద్రాదిభ్యోఽపి తద్విద్యయా సుఖం సాధనీయమ్.

పదార్థము :–మానవులారా ! సూర్యరశ్మిః = సూర్యకిరణములు గలది, సుషుమ్ణః = ఉత్తమ సుఖము గలది, గన్ధర్వః = సూర్యకిరణములను ధారణ మొనర్చునదై యేది యున్నదో, తస్య = దానికి, నక్షత్రాణి = అశ్వినీ భరణి నక్షత్రములు, అప్సరసః = అకాశమునందు కిరణములు, భేకురయః = ప్రకాశింప జేయునవియునై, నామ = ప్రసిద్ధములై యున్నవో. అవి చంద్రుని యప్సరలు. సః = అది, నః ఇదమ్ క్షత్రమ్ = మా యొక్క చదివించు నీ బ్రాహ్మణ కులమును, దుష్టసంహార

మొనరించు నీ క్షత్రియ వంశమును, పాతు = రక్షించు గాక ; తస్మై = అట్టి చంద్రలోకమునకు, వాట్ స్వాహా = కార్య నిర్వాహకమగు నుత్తమక్రియను మఱియు, తాభ్యః = ఆ కిరణములకై, స్వాహా = ఉత్తమ క్రియను ప్రయుక్త మొనర్చ వలయును. ॥४०॥

భావార్థము :— మానవులు చంద్రాది లోకముల నుండియు వాని విద్యలచే సుఖమును సాధించ వలెను.

---

४१ ఇషిర ఇత్యస్య దేవా ఋషయః, వాతో దేవతా. బ్రాహ్మ్యుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పున ర్మనుష్యై ర్వాతాదిభ్య ఉపకారా గ్రాహ్యా ఇత్యాహ.

మానవులు పవనాదులనుండి ఉపకారమును గ్రహించ వలయును,

ఇషిరో విశ్వవ్యచా వాతో గన్ధర్వ స్తస్యాపోఽఅప్సరస ఊర్జో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥

ఇషిరః,విశ్వవ్యచాః, వాతః, గన్ధర్వః, తస్య, ఆపః, అప్సరసః, ఊర్జః, నామ, సః, నః, ఇదమ్, బ్రహ్మ, క్షత్రమ్, పాతు, తస్మై, స్వాహా, వాట్, తాభ్యః,స్వాహా.

పదార్థః :—(ఇషిరః) యేనేచ్ఛన్తి సః (విశ్వవ్యచాః) విశ్వస్మిన్ సర్వస్మిఞ్జగతి వ్యచో వ్యాప్తి ర్యస్య సః (వాతః) వాతి గచ్ఛతీతి (గన్ధర్వః)యః పృథివీం కిరణాంశ్చ ధరతి సః (తస్య) (ఆపః) జలాని ప్రాణా వా (అప్సరసః) య అన్తరిక్షే జలాదౌ చ సరన్తి గచ్ఛన్తి తాః (ఊర్జః) బల పరాక్రమ ప్రదాః (నామ) సంజ్ఞా (సః) (నః) అస్మభ్యమ్ (ఇదమ్) (బ్రహ్మ) సర్వేషాం సత్యోపదేశేన వర్ధకం బ్రహ్మకులమ్, (క్షత్రమ్) విద్యావర్ధకం రాజకులమ్ (పాతు) రక్షతు (తస్మై) (స్వాహా) (వాట్) (తాభ్యః) (స్వాహా). ॥४१॥　　అన్వయః :— హే ! మనుష్యా ! య ఇషిరో విశ్వవ్యచా గన్ధర్వో వాతోఽస్తి తస్య యా ఆపోఽప్సరస ఊర్జో నామ వర్తన్తే యథా స న ఇదం బ్రహ్మ క్షత్రం చ పాతు తథా యూయ మాచరత. తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా సంప్రయుఙ్గ్ధ్వమ్.

భావార్థః :— శరీరే యావన్తశ్చేష్టా బలపరాక్రమా జాయన్తే తావన్తో వాయోః సకాశాదేవ జాయన్తే వాయవ ఏవ ప్రాణరూపా గన్ధర్వాః సర్వధరాః సన్తీతి మనుష్యై ర్వేద్యమ్. ॥४१॥

పదార్థము :— మానవులారా ! ఇషిరః = ఇచ్ఛగించుటకు సాధనము, విశ్వవ్యచాః = సమస్త సంసారమున వ్యాప్తిగలది, గంధర్వః = పృథివిని కిరణములను ధారణ మొనర్చునది, వాతః = సర్వత్ర భ్రమణ మొనర్చునదియునై యే పవనమున్నదో, తస్య = దానికి, ఆపః = జలములు, ప్రాణాపానోదాన సమాన వ్యానములు, అప్సరసః = అంతరిక్షమునందును, జలములందును సంచార మొనర్చునవియై, ఊర్జః = బలపరాక్రమముల నొసగునవియై, నామ = ప్రసిద్ధములై యేవియున్నవో, సః = అది, నః ఇదమ్ బ్రహ్మ క్షత్రమ్ పాతు = మాకై సత్యోపదేశముచే అందరిని వృద్ధిపఱచు నీ బ్రాహ్మణ కులమును, విద్యావర్ధకమగు రాజ వంశమును ఎటుల రక్షించునో అటులనే మీరును ఆచరించుడు. తస్మై = ఉక్త పవనమునకై, స్వాహా వాట్ = ఉత్తమ క్రియాప్రాప్తి మరియు, తాభ్యః = ఆ జలాదులకు, స్వాహా = ఉత్తమ క్రియను లేక ఉత్తమ వాణిని ప్రయోగించుడు. ॥४१॥

భావార్థము :— శరీరమునందు కలుగు చేష్టా బలపరాక్రమము లన్నియు పవన సంపర్కము

చేతనే కలుగుచున్నవి. వాయువులే ప్రాణరూపములు, గంధర్వములు, అనగా అన్నిటిని ధరించునవి యగుచున్నవని మానవులు గ్రహించవలయును. ॥౪౧॥ (౯౯౦)

---

౯౯౧ భుజ్యు రిత్యస్య దేవా ఋషయః, యజ్ఞో దేవతా, ఆర్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

మనుష్యా యజ్ఞానుష్ఠానం కుర్వన్త్విత్యాహ. మానవులు యజ్ఞమును అనుష్ఠించ వలయును.

భుజ్యుః సుపర్ణో యజ్ఞో గన్ధర్వ స్తస్య దక్షిణా అప్సరస స్తావా నామ
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥

భుజ్యుః, సుపర్ణ ఇతి సు + పర్ణః యజ్ఞః, గన్ధర్వః, తస్య దక్షిణాః,అప్సరసః, స్తావాః, నామ, సః, నః, ఇదమ్, బ్రహ్మ, క్షత్రమ్, పాతు, తస్మై, స్వాహా, వాట్, తాభ్యః, స్వాహా. (42)

పదార్థః :—(భుజ్యుః) భుజ్యతే సుఖాని యస్మాత్సః (సుపర్ణః) శోభనాని పర్ణాని పాలనాని యస్మాత్సః (యజ్ఞః) య ఇజ్యతే సంగమ్యతే సః (గన్ధర్వః) యో గాం వాణీం ధరతి సః (తస్య) (దక్షిణాః) దక్షన్తే దీయన్తే సుపాత్రేభ్య స్తాః(అప్సరసః) యా అప్సు ప్రాణేషు సరన్తి ప్రాప్నువన్తి తాః (స్తావాః) యా స్తూయన్తే ప్రశస్యన్తే తాః (నామ) ప్రసిద్ధౌ (సః) (నః) అస్మభ్యమ్ (ఇదమ్) (బ్రహ్మ) బ్రాహ్మణం విద్వాంసమ్ (క్షత్రమ్) చక్రవర్తినం రాజానమ్(పాతు) (తస్మై) (స్వాహా) (వాట్) (తాభ్యః) (స్వాహా). ॥౪౨॥ అన్వయః :- హే ! మనుష్యా ! యో భుజ్యుః సుపర్ణో గన్ధర్వో యజ్ఞోఽస్తి తస్య యా దక్షిణా అప్సరసః స్తావా నామ సన్తి స యథా న ఇదం బ్రహ్మ క్షత్రం చ పాతు తథా యాయ మప్యనుతిష్ఠత తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా చ ప్రయుఙ్గ్ధ్వమ్. ॥౪౨॥ భావార్థః :—యే మనుష్యా అగ్నిహోత్రాదియజ్ఞాన్ ప్రత్యహం కుర్వన్తి తే సర్వస్య సంసారస్య సుఖాని వర్ధయన్తీతి బోధ్యమ్. ॥౪౨॥

పదార్థము :—మానవులారా ! భుజ్యుః = సుఖమును భోగించుటకు సాధనము,సుపర్ణః = శోభన పాలనమునకు హేతువు, గంధర్వః = వాణిని ధారణ మొనర్చునదియు నై , యజ్ఞః = సంగతి యొనర్చదగిన యే యజ్ఞకర్మ యున్నదో. తస్య = దానిలో, దక్షిణాః = సుపాత్రులకు, ధర్మాత్ములకు నిచ్చునే దక్షిణలున్నవో,అప్సరసః = ప్రాణములందు చేరునవి,స్తావాః = ప్రశంసించ బడునవియు నై యేవి,నామ = ప్రసిద్ధములై యున్నవో, సః = అది, నః ఇదమ్ బ్రహ్మ క్షత్రమ్ పాతు = మా యీ విద్వాంసులను, చక్రవర్తియైన రాజును ఎటుల రక్షించునో, అటుల మీరును అనుష్ఠించుడు, తస్మై = ఆ యజ్ఞ కర్మకు, స్వాహా వాట్ = ఉత్తమక్రియాప్రాప్తి, తాభ్యః = ఉక్తదక్షిణలకు, స్వాహా = ఉత్తమరీతితో సత్తక్రియను సంయోగ మొనర్చుడు. ॥౪౨॥

భావార్థము:—ఏ మానవులు అగ్నిహోత్రాది యజ్ఞములను ప్రతిదినము చేయుదురో వారుసకల లోకముల సుఖములను వృద్ధియొనర్చు చున్నారని యెఱుగ వలయును. ॥౪౨॥ (౯౯౧)

---

౯౯౨ ప్రజాపతి రిత్యస్య దేవా ఋషయః, విశ్వకర్మా దేవతా, విరాడార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున ర్జనైః కథం భవితవ్య మిత్యుప దిశ్యతే. మానవు లెటులుండ వలయును ?

ప్ర॒జాప॑తి॒ర్వి॒శ్వక॑ర్మా॒ మనో॑ గన్ధ॒ర్వ స్తస్య॑ ఋక్సా॒మాన్య॑ప్స॒రస॒ ఏష్ట॑యో॒ నామ॑ ।
స న॑ ఇ॒దం బ్రహ్మ॑ క్ష॒త్రం పా॑తు॒ తస్మై॒ స్వాహా॒ వాట్ తాభ్యః॒ స్వాహా॑ ॥ ౪౩॥

ప్ర॒జాప॑తి॒ రితి ప్ర॒జాప॑తిః, వి॒శ్వక॑ర్మే॒తి వి॒శ్వ+క॑ర్మా, మనః॑, గ॒న్ధ॒ర్వః, తస్య॑,
ఋ॒క్సా॒మానీత్యృ॑క్+సా॒మాని॑, అ॒ప్స॒రస॑ః, ఏష్ట॑య॒ ఇత్యా॑+ఇష్ట॑యః, నామ॑, సః॑,
నః॑, ఇ॒దమ్, బ్రహ్మ॑, క్ష॒త్రమ్, పా॒తు॒, త॒స్మై॒, స్వాహా॑, వాట్, తాభ్యః॑ స్వాహా॑.

పదార్థః :–(ప్రజాపతిః) ప్రజాయాః స్వామీ(విశ్వకర్మా)విశ్వాని సర్వాణి కర్మాణి యస్య సః (మనః) జ్ఞానసాధన మన్తఃకరణమ్ (గన్ధర్వః) యేన వాగాదీన్ ధరతి సః (తస్య) (ఋక్సామాని) ఋక్ చ సామాని చ తాని (అప్సరసః)యా అప్సు వ్యాప్యేషు ప్రాణాదిపదార్థేషు సరన్తి గచ్ఛన్తి తాః (ఏష్టయః)సమన్తాదిష్టయో విద్వత్పూజా సత్సంగో విద్యాదానం చ యాభ్యస్తాః (నామ) సంజ్ఞా (సః)(నః)(ఇదమ్)(బ్రహ్మ) వేదమ్(క్షత్రమ్) ధనుర్వేదమ్ (పాతు)(తస్మై) (స్వాహా) (వాట్) (తాభ్యః)(స్వాహా). ॥౪౩॥ అన్వయః :-హే మనుష్యా ! యూయం యో విశ్వకర్మా ప్రజాపతి ర్మనుష్యోఽస్తి తస్య మనో గన్ధర్వ ఋక్సామాన్యప్సరస ఏష్టయో నామ సన్తి యథా స న ఇదం బ్రహ్మ క్షత్రం చ పాతు తథా తస్మై స్వాహా సత్యా వాణీ వాట్ ధర్మప్రాపణం తాభ్యః స్వాహా సత్యయా క్రియయోపకారం చ కురుత. ॥౨౪॥ భావార్థః :-యే మనుష్యాః పురుషార్థినో మనస్వినో వేదవిదో జాయన్తే త ఏవ జగద్భూషణాః సన్తీతి వేద్యమ్. ॥౪౩॥

పదార్థము :–మానవులారా ! మీరు,విశ్వకర్మా = సకల కార్యములకు హేతువు, ప్రజాపతిః = ప్రజలను పాలించు మానవు డెవడున్నాడో, తస్య = అతని యొక్క, గంధర్వః = వాణ్యాదుల ధారణ మొనర్చునది,మనః = జ్ఞానము సాధించు మనస్సు,ఋక్సామాని = ఋక్సామ వేదముల మంత్రములు, అప్సరసః = హృదయాకాశమున వ్యాప్తమై ప్రాణాది పదార్థములందు పోవునవి. ఏష్టయః = విద్వాంసుల సత్కారము, సత్యముతోడి సాంగత్యము, విద్యాదానము మొదలైన వానిని నెరవేర్చు సాధనములన్నియు, నామ = ప్రసిద్ధములై యున్నవి. ఎటుల. సః = అతడు, నః ఇదమ్ బ్రహ్మ క్షత్రమ్ = మాకై ఈ వేదమును ధనుర్వేదమును; పాతు = రక్షించునో అటులనే, తస్మై = అతనికి, స్వాహా = సత్యవాణి, వాట్ = ధర్మప్రాప్తి,తాభ్యః = ఆ ఉక్తపదార్థములకై, స్వాహా = సత్యక్రియతో ఉపకార మొనర్చుడు. ॥౪౩॥

భావార్థము :–ఏ మానవులు పురుషార్థులు, మనస్వులు, వేద వేత్తలు నగుదురో,వారే లోకభూషణులగుదురని గ్రహించ వలయును, ॥౪౩॥ (౯౯౨)

౯౯౩ స న ఇత్యస్య దేవా ఋషయః, ప్రజాపతి ర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛన్దః, పఞ్చమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

స నో॑ భువ॑నస్య పతే ప్రజాపతే॒ యస్య॑ త ఉ॒పరి॑ గృ॒హా యస్య॑ వే॒హ ।
అ॒స్మై బ్రహ్మ॑ణే॒ఽస్మై క్ష॒త్రాయ॑ మహి॒ శర్మ॑ యచ్ఛ॒ స్వాహా॑ ॥ ॥౪౪॥

సః, నః॑, భు॒వ॒న॒స్య॒, ప॒తే॒, ప్ర॒జా॒ప॒త॒ ఇతి ప్రజా+పతే,యస్య॑, తే॒, ఉ॒పరి॑,గృ॒హాః,

యస్యై, వా,ఇహ,అస్మై, క్షత్రాయ,బ్రహ్మణే అస్మై, మహి,శర్మ,యచ్ఛ,స్వాహా.

పదార్థః :—(సః)విద్వాన్(నః)అస్మాకమ్)(భువనస్య)గృహస్య (పతే)స్వామిన్ (ప్రజాపతే) ప్రజాపాలక(యస్య)(తే)తవ(ఉపరి)ఊర్ధ్వముత్కృష్టే వ్యవహారే(గృహాః)యే గృహ్ణన్తి తే గృహస్థాదయః(యస్య)(వా)(ఇహ)అస్మిన్సంసారే(అస్మై) (బ్రహ్మణే) వేదేశ్వరవిదే జనాయ(అస్మై) (క్షత్రియ)రాజధర్మనిష్ఠాయ(మహి)మహత్(శర్మ) గృహం సుఖం వా(యచ్ఛ)దేహి(స్వాహా)సత్యయా క్రియయా. ॥౪౪॥ అన్వయః :—హే భువనస్య ! పతే ప్రజాపత ఇహ యస్య తే తవోపరి గృహా వా యస్య సర్వాః శుభాః క్రియాః సన్తి స త్వం నోఽస్మై బ్రహ్మణేఽస్మై క్షత్రియ స్వాహా మహి శర్మ యచ్ఛ. ॥౪౪॥ భావార్థః :—యే మనుష్యా విద్వత్కులం రాజకులం చ నిత్యం వర్ధయన్తి తే మహత్సుఖ మాప్నువన్తి. ॥౪౪॥

పదార్థము :—భువనస్య = ఇంటియొక్క, పతే = స్వామీ ! ప్రజాపతే = ప్రజలను రక్షించువాడా ! ఇహ = ఈ లోకములో, యస్య తే = ఏ నీ యొక్క, ఉపరి = ఉత్కృష్టవ్యవహారమునందు, గృహాః = పదార్థములను గ్రహించు గృహస్థమనుష్యు లున్నారో, వా = లేక, యస్య = ఎవనికి సకల శ్రేష్ఠక్రియలు యున్నవో, సః = ఆ నీవు, నః = మా యొక్క, అస్మై బ్రహ్మణే = వేదమును ఈశ్వరుని నెఱుగు నీ మనుష్యుని కొఱకు, అస్మై క్షత్రాయ = రాజధర్మమునందు నిరంతరము స్థితుడై యుండు నీ క్షత్రియునికి, స్వాహా = సత్యక్రియతో, మహి శర్మ = భూరి కల్యాణమును సుఖమును, యచ్ఛ = ఇమ్ము. ॥౪౪॥

భావార్థము :—విద్వత్కులమును క్షత్రియ వంశమును నిత్యము పెంపొందజేయు వారు అత్యంత సుఖమును పొందుచున్నారు. ॥౪౪॥ (౯౭౩)

---

౯౭౪ సముద్రోసీత్యస్య శునః శేప ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదష్టి శ్ఛన్దః,మధ్యమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

సముద్రోఽసి నభస్వానార్ద్రదానుః శమ్భూర్మయోభూ రభి మా వాహి స్వాహా ।
మారుతోఽసి మరుతాం గణః శమ్భూ ర్మయోభూ రభి మా వాహి స్వాహా ।
అవస్యూరసి దువస్వాఞ్ఛమ్భూ ర్మయో భూరభి మా వాహి స్వాహా ॥ ॥౪౫॥

సముద్రః, అసి,నభస్వాన్, ఆర్ద్రదానురిత్యార్ద్ర+దానుః, శమ్భూరితి శమ్+భూః, మయోభూరితి మయః+భూః, అభి, మా, వాహి, స్వాహా,మారుతః,అసి, మరుతామ్, గణః, శమ్భూరితి శమ్+భూః, మయోభూరితి మయః భూః, అభి, మా, వాహి, స్వాహా, అవస్యూః, అసి, దువస్వాన్, శమ్భూ రితి శమ్+భూః, మయో భూరితి మయః భూః, అభి, మా,వాహి,స్వాహా. (45)

పదార్థః :—(సముద్రః)సముద్ద్రవన్త్యాపో యస్మిన్ సః (అసి) (నభస్వాన్) బహు నభో జలం విద్యతే యస్మిన్ సః, నభ ఇత్యుదక నా . . నిఘం. ౧.౧౨ (ఆర్ద్రదానుః) య ఆర్ద్రాణాం

గుణానాం దాసు ర్దాతా సః (శంభూః)యః శం సుఖం భావయతి సః(మయోభూః)యో మయ ఆనన్దం భావయతి సః(అభి)ఆభిముఖ్యే (మా)మామ్(వాహి)పాప్రిప్నుహి(స్వాహా)సత్యయా క్రియయా (మారుతః)మరుతాం పవనానా మయం సమ్బన్ధీ జ్ఞాతా (అసి)(మరుతామ్)విదుషామ్ (గణః) సమూహః (శమ్భూః)శం కల్యాణం భావయతి సః(మయోభూః) సుఖం భావుకః (అభి)(మా) (వాహి) (స్వాహా) (అవస్యుః)ఆత్మనోఽవ ఇచ్ఛుః(అసి)(దువస్వాన్)దువః పరిచరణం పరిచరణం విద్యతే యస్య సః (శంభూః)(మయోభూః)(అభి)(మా)(వాహి)(స్వాహా). ॥౪౫॥ అన్వయః :—హే విద్వన్ య స్త్వం నభస్వానార్ద్రదానుః సముద్ర ఇవాసి స స్వాహా శంభూ ర్మయోభూః సన్మాభివాహి య స్త్వం మారుతో మరుతాం గణ ఇవాసి స స్వాహా శమ్భూ ర్మయోభూ స్సన్మాభివాహి య స్త్వం దువస్వా నవస్యూ రివాసి స తస్మాత్స్వాహా శమ్భూ ర్మయోభూః సన్మాభివాహి. ॥౪౫॥ భావార్థః :— అత్ర వాచక లుప్తోపమాలంకారః, యే మనుష్యా సముద్రవ ద్గంభీరా రత్నాఢ్యా ఋజవో వాయువ ద్బలిష్ఠా విద్వద్వత్ పరోపకారిణః స్వాత్మవత్సర్వేషాం రక్షకా స్స న్తి త ఏవ సర్వేషాం కల్యాణం సుఖం చ కర్తుం శక్నువ న్తి. ॥౪౫॥

పదార్థము :—విద్వాంసుడా ! ఏ నీవు, నభస్వాన్ = ఎక్కువ జలము కలది, ఆర్ద్రదానుః = శీతల గుణముల నిచ్చునది,సముద్రః = క్రింది మీదుగ జలపాతము కలిగినదియు నగు సముద్రమువలె, అసి = ఉన్నావో,అట్టి నీవు, స్వాహా = సత్యక్రియతో.శమ్భూః = ఉత్తమ సుఖోత్పాదకుడవు,మయోభూః = సామాన్య సుఖమును కలిగించువాడవును నై , మా = నాకు, అభి వాహి = అన్నివైపులనుండి లభించుము. ఏ నీవు, మారుతః = పవనములకు సంబంధమైన జ్ఞాతవు,మరుతాం గణః = విద్వాంసుల సమూహమువలె, అసి = ఉన్నావో ఆ నీవు,స్వాహా = ఉత్తమక్రియతో. శంభూః = విశేష పరజన్మ సుఖమును మఱియు, మయోభూః = ఈ జన్మలోని సామాన్య సుఖమును ఉత్పన్న మొనర్చువాడవై , మా = నాకు, అభివాహి = నలువైపులనుండి ప్రాప్తించుము ! ఏ నీవు, దువస్వాన్ = ప్రశంసిత సత్కారయుతుడవై , అవస్యూః = స్వరక్షణ కోరెడు వానివలె, అసి = ఉన్నావో ఆ నీవు, శంభూః మయోభూః = విశేష సుఖమును. సామాన్య సుఖమును కలిగించువాడవై, మా = నాకు, అభి వాహి = అన్నివైపులనుండి ప్రాప్తించుము ! ॥౪౫॥

భావార్థము :—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏ మానవులు సముద్రమువలె గంభీరులు, రత్నాఢ్యులు, ఋజుస్వభావులు. వాయువువలె బలిష్ఠులు, విద్వాంసులవలె పరోపకారులు, తనఆత్మవలె అందరిని రక్షించు వారును నై యున్నారో వారే అందఱికి కల్యాణమును సుఖమును సమకూర్చువారగు చున్నారు. ॥౪౫॥ (౯౪)

---

ఉ౯౬ యా స్తే ఇత్యస్య శునఃశేప ఋషిః, అగ్ని ర్దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పున ర్విదుషా కిం క ర్తవ్య మిత్యాహ. విద్వాంసు డేమి చేయవలయును ?

యా స్తే అగ్నే సూర్యే రుచో దివ మాతన్వ న్తి రశ్మిభిః ।
తాభిర్నో అద్య సర్వాభీ రుచే జనాయ నస్కృధి ॥ ॥౪౬॥

యాః, తే, అగ్నే, సూర్యే, రుచః, దివమ్, ఆతన్వ న్తీత్యా+తన్వ న్తి,

రశ్మిభిరితి రశ్మి+భిః, తాభిః, నః అద్య, సర్వాభిః, రుచే, జనాయ, నః, కృధి.

పదార్థః :–(యాః)(తే)తవ(అగ్నే)పరమేశ్వర విద్వన్ వా (సూర్యే) సవితరి ప్రాణే వా. (రుచః)దీప్తయః ప్రీతయో వా (దివమ్) ప్రకాశమ్ (ఆతన్వన్తి) సర్వతో విస్తృణన్తి (రశ్మిభిః) (తాభిః)రుగ్భిః(నః)అస్మాన్ (అద్య) (సర్వాభిః) (రుచే)ప్రీతికరాయ(జనాయ)(నః)అస్మాన్(కృధి) కురు. ॥౪౬॥ అన్వయః :–హే అగ్నే విద్వన్! యాః సూర్యే రుచః సన్తి యా రశ్మిభి ర్దివ మాతన్వన్తి తాభిః సర్వాభిస్తే సగ్భి రద్య నః సంయోజయ రుచే జనాయ చ నస్కృధి. ॥౪౬॥ భావార్థః :– అత్ర శ్లేషాలంకారః. యథా పరమేశ్వరః సూర్యాదీనాం ప్రకాశకా నామపి ప్రకాశకోఽస్తి తథానూచానో విద్వాన్ విదుషా మపి విద్యాప్రదో భవతి యథేశ్వరోఽత్ర జగతి సర్వేషాం సత్యే రుచి మసత్యేఽరుచిం జనయతి తథా విద్వాన ప్యాచరేత్. ॥౪౬॥

పదార్థము :–అగ్నే = పరమేశ్వరుడా ! లేక విద్వాంసుడా ! యాః సూర్యే రుచః = సూర్యుని యందే దీప్తులున్నవో, లేక ప్రాణములోనే ప్రీతి యున్నదో, ఏవి,రశ్మిభిః = స్వకిరణములచే, దివమ్ = ప్రకాశమును, ఆతన్వన్తి = అన్నివైపుల వ్యాపింపజేయు చున్నవో, తాభిః సర్వాభిః = వాని యన్నిటి చేతను, తే = స్వకీయ దీప్తిచేతను లేక ప్రీతుల చేతను, అద్య = నేడు, నః = మమ్ము సంయుక్త మొనర్చుము. రుచే జనాయ = ప్రేమించు జనునికై, నః కృధి = మమ్ము నియమించుము

భావార్థము :–ఈ మంత్రమునందు శ్లేషాలంకార మున్నది. పరమేశ్వరు డెటుల సూర్యాది ప్రకాశ మొనరించు లోకములనుకూడ ప్రకాశిం జేయుచున్నాడో, ఆటులనే సకల శాస్త్రములను క్షుణ్ణముగ నేర్చు విద్వాంసుడు విద్వాంసులకు కూడ విద్యలొసగు వాడగు చున్నాడు. ఏ విధముగ ఈశ్వరు డీ జగత్తులోని సర్వప్రాణులకు సత్యమునందు అరుచి, అసత్యమునందు రుచి కలిగించు చున్నాడో ఆటులనే విద్వాంసుడును నాచరించ వలయును. ॥౪౬॥ (౫౫౫

౫౫౬ యా వ ఇత్యస్య శునః శేవ ఋషిః, బృహస్పతి ర్దేవతా, ఆర్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

యా వో దేవాః సూర్యే రుచో గోష్వశ్వేషు యా రుచః ।
ఇన్ద్రాగ్నీ తాభిః సర్వాభీ రుచం నో ధత్త బృహస్పతే ॥ ॥౪౭॥

యా, వః, దేవాః, సూర్యే, రుచః, గోషు, అశ్వేషు, యాః, రుచః, ఇన్ద్రాగ్నీ, తాభిః, సర్వాభిః, రుచమ్, నః, ధత్త, బృహస్పతే. (47)

పదార్థః :–(యాః)(వః)యుష్మాకమ్(దేవాః)విద్వాంసః(సూర్యే) చరాచరాత్మని జగదీశ్వరే (రుచః)ప్రీతయః(గోషు) కిరణేన్ద్రియేషు దుగ్ధాదిదాత్రీషు వా (అశ్వేషు)వహ్నితురంగాదిషు (యాః) (రుచః)ప్రీతయః(ఇన్ద్రాగ్నీ)ఇన్ద్రః ప్రసిద్ధో విద్యుదగ్నిః పావకశ్చ(తాభిః)సర్వాభిః(రుచమ్)ప్రీతిమ్ (నః)అస్మాకం మధ్యే(ధత్త)ధరత(బృహస్పతే)బృహతాం పదార్థానాం పతే పాలకేశ్వర. ॥౪౭॥ అన్వయః :–హే బృహస్పతే దేవా ! యా వస్సూర్యే రుచో యా గోష్వశ్వేషు రుచః సన్తి యా వైతేష్విన్ద్రాగ్నీ వర్తేతే తా చ తాభి స్సర్వాభి రుగ్భి ర్నో రుచం ధత్త. ॥౪౭॥ భావార్థః :–

అత్ర శ్లేషాలంకారః. యథా పరమేశ్వరో గవాదిపాలనే పదార్థవిద్యాయాం చ సర్వాన్ మనుష్యాన్ ప్రేరయతి తథైవ విద్వాంసోఽప్యాచరేయుః. ॥౪౭॥

పదార్థము :-బృహస్పతే = పెద్దపెద్ద పదార్థములను పాలించు నీశ్వరుడా ! మరియు, దేవాః = విద్వాంసులారా ! సూర్యే = చరాచరములలో వ్యాప్తుడైన పరమేశ్వరునియందు. అనగా ఈశ్వరునికి[మీ]యందును, మీ విద్వాంసులకు నీశ్వరునియందును, వః యాః రుచః = మీయందరికి నే ప్రీతులున్నవో లేక, గోషు = ఈ కిరణములందు, ఇంద్రియములందు, పాలిచ్చునావులందు, అశ్వేషు = అగ్నియందు, అశ్వాదులందు, యాః రుచః = ఏ రుచులున్నవో లేక వీనిలో, ఇన్ద్రాగ్నీ = నే ప్రసిద్ధవిద్యుత్తు భౌతికాగ్నులు వ్యాపించి యున్నవో అవియు,తాభిః సర్వాభిః = ఆ సకల ప్రీతులచే,నః = మాయందు, రుచమ్ = ప్రీతిని, ధత్త = స్థాపింపుము. ॥౪౭॥

భావార్థము :—ఈ మంత్రమునందు శ్లేషాలంకార మున్నది. పరమేశ్వరు డెటుల పదార్థవిద్యయందు, గవాదుల పాలించుటయందు సకల మానవులను ప్రేరేపించుచున్నాడో అటులనే విద్వాంసుడును ఆచరించ వలయును. ॥౪౭॥ (౯౯౬)

---

౯౯౭ రుచన్న ఇత్యస్య శునఃశేప ఋషిః, బృహస్పతి ర్దేవతా, భురిగార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

రుచం నో ధేహి బ్రాహ్మణేషు రుచꣳ రాజసు నస్కృధి ।
రుచం విశ్యేషు శూద్రేషు మయి ధేహి రుచా రుచమ్ ॥ ॥౪౮॥

రుచమ్, నః, ధేహి, బ్రాహ్మణేషు, రుచమ్, రాజస్వితి రాజ+సు, నః, కృధి, రుచమ్, విశ్యేషు, శూద్రేషు, మయి, ధేహి, రుచా, రుచమ్. (48)

పదార్థః :-(రుచమ్)ప్రేమ(నః)అస్మాకమ్(ధేహి)ధర(బ్రాహ్మణేషు)బ్రహ్మవిత్సు(రుచమ్) ప్రీతిమ్(రాజసు)క్షత్రియేషు రాజపుత్రేషు(నః)అస్మాకమ్(కృధి)కురు(రుచమ్) (విశ్యేషు)విక్షు ప్రజాషు భవేషు వణిగ్జనేషు (శూద్రేషు) సేవకేషు (మయి)(ధేహి)(రుచా)ప్రీత్యా(రుచమ్)ప్రీతిమ్. ॥౪౮॥

అన్వయః :-హే జగదీశ్వర వా విద్వꣳస్త్వం నో బ్రాహ్మణేషు రుచా రుచం ధేహి నో రాజసు రుచా రుచం కృధి విశ్యేషు శూద్రేషు రుచా రుచం మయి చ రుచా రుచం ధేహి. ॥౪౮॥

భావార్థః :—అత్ర శ్లేషాలంకారః. యథా పరమేశ్వరః పక్షపాతం విహాయ బ్రాహ్మణాదివర్ణేషు సమానాం ప్రీతిం కరోతి తథైవ విద్వాంసోఽపి తుల్యాం ప్రీతిం కుర్యుః. యే హీశ్వరగుణకర్మస్వభావా ద్విరుద్ధా వర్తన్తే తే సర్వే నీచా స్తిరస్కరణీయా భవన్తి ॥౪౮॥

పదార్థము :-జగదీశ్వరుడా ! లేక విద్వాంసుడా ! నీవు, నః = మాకు, బ్రాహ్మణేషు = బ్రహ్మవేత్తలగు విద్వాంసులందు. రుచా = ప్రీతిచే, రుచమ్ = ప్రీతిని, ధేహి = స్థాపింపుము.నః = మాకు, రాజసు = రాజన్య క్షత్రియులందు ప్రీతిచే, రుచమ్ = ప్రీతిని, కృధి = కలిగింపుము, విశ్యేషు = ప్రజలందేర్పడు వైశ్యులందు, శూద్రేషు = శూద్రులందు ప్రీతిచే, రుచమ్ = ప్రీతిని. మరియు, మయి = నాయందును ప్రీతిచే, రుచమ్ = ప్రీతిని, ధేహి = స్థాపింపుము. ॥౪౮॥

భావార్థము :—ఈ మంత్రమునందు శ్లేషాలంకార మున్నది. పరమేశ్వరు డెటుల పక్షపాతము ను వదలి బ్రాహ్మణాది వర్ణములందు సమాన ప్రీతియుంచుచున్నాడో, అటులనే విద్వాంసులును సమ మైన ప్రేమను జూపవలయును. ఈశ్వరుని గుణకర్మ స్వభావములకు విరుద్ధముగ నున్నవారందరు నీచులు తిరస్కరించదగిన వారును నై యున్నారు. ॥౪౮॥ (౯౯౭)

౯౯౮ తత్త్వేత్యస్య శునఃశేప ఋషిః, బృహస్పతి ర్దేవతా, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
మనుష్యై ర్విద్వద్వదాచరణీయ మిత్యాహ. మానవులు విద్వాంసులవలె నాచరించ వలయును.

తత్త్వా యామి బ్రహ్మణా వన్దమాన స్తదా శాస్తే యజమానో హవిర్భిః ।
అహేడమానో వరుణేహ బోధ్యురుశꣳస మా న ఆయుః ప్రమోషీః ॥౪౯॥

తత్, త్వా, యామి, బ్రహ్మణా, వన్దమానః, తత్, ఆ, శాస్తే, యజమానః, హవిర్భిరితి హవిః+భిః, అహేడమానః, వరుణ, ఇహ, బోధి, ఉరుశꣳసే త్యురు+శꣳస, మా, నః, ఆయుః, ప్ర, మోషీః. (49)

పదార్థః :—(తత్)(త్వా)త్వామ్(యామి)ప్రాప్నోమి (బ్రహ్మణా)వేదేన(వన్దమానః) స్తువన్ సన్(తత్)ప్రేమ(ఆ)(శాస్తే)ఇచ్ఛతి(యజమానః) యో యజతే సః (హవిర్భిః) హోతుమర్హైః సంస్కృతై ర్ద్రవ్యైః (అహేడమానః)సత్కృతః(వరుణ)వర(ఇహ)(బోధి)బుధ్యస్వ (ఉరుశంస)య ఉరూన్ బహూన్ శంసతి తత్సమ్బుద్ధౌ(మా)(నిషేధే)(నః)అస్మాన్(ఆయుః)(ప్ర)(మోషీః) చోర యేః. ॥౪౯॥ అన్వయః :—హే ఉరుశంస వరుణ ! బ్రహ్మణా వన్దమానో యజమానోఽహేడ మానో హవిర్భి ర్యదాశాస్తే తదహం యామి యదుత్తమ మాయుస్త్వాశ్చిత్యాహం యామి తత్ త్వమపి ప్రాప్నుహి త్వమిహ తద్ బోధి త్వం నోఽస్మాకం తదాయు ర్మా ప్రమోషీః. ॥౪౯॥ భావార్థః :— ఆప్తా విద్వాంసో యదిచ్ఛేయు స్తదేవ మనుష్యై రేషితవ్యమ్. న కేనాపి కేషాం చిద్విదుషా మనాదరః కార్యః. న ఖలు స్త్రీపురుషై రబ్రహ్మచర్యాయుక్తాహారవిహార వ్యభిచారాతివిషయాసక్త్యాదిభి రాయుః కదాపి హ్రసనీయమ్. ॥౪౯॥

పదార్థము :—ఉరుశంస = అనేకులను ప్రశంసించువాడా ! వరుణ = శ్రేష్ఠవిద్వాంసుడా ! బ్రహ్మణా = వేదముచే, వందమానః = స్తుతి యొనర్చుచున్న, యజమానః = యజ్ఞకర్త, అహేడ మానః = సత్కృతుడై, హవిర్భిః = హోమమొనర్చుటకై చక్కగా తయారుచేసిన పదార్థములతో, ఆశాస్తే = ఏమి ఆశించుచున్నాడో, తత్ = దానిని నేనును, యామి = పొందుదును గాక ! అటులనే ఆయుః = ఏ యుత్తమ శతవార్షిక జీవనమును, త్వా = నిన్నాశ్రయించి పొందుదునో, దానిని నీవును పొందుదువు గాక ! నీవు, ఇహ = ఈ లోకములో పై జెప్పబడిన ఆయువును, బోధి = గ్రహింపుము,మరియు నీవు. నః = మా యొక్క ఆ యాయువును; మా ప్ర మోషీః = దొంగిలించకుము.

భావార్థము :—సత్యవాది, శాస్త్రవేత్త, సజ్జనుడునగు విద్వాంసు డేమి యభిలషించునో న్దా నినే మానవులును అభిలషించవలయును. ఎవరూ ఏ విద్వాంసులను తిరస్కరించ గూడదు. మఱియు స్త్రీ పురుషులు బ్రహ్మచర్యత్యాగమును, అయోగ్యములగు నాహార విహారములను, వ్యభిచారమును, అత్యంత విషయాసక్తి మొదలైన దుష్కర్మల నొనర్చి ఆయువును ఎన్నటికి క్షీణింపజేయగూడదు.

౯౯౯ స్వర్ణ ఘర్మ ఇత్యస్య శునఃశేప ఋషిః, సూర్యో దేవతా, భురిగాస్త్యుష్ణిక్, ఋషభః స్వరః.
కీదృశాః జనాః పదార్థాన్ శుద్ధస్తీత్యుప దిశ్యతే. ఎటువంటివారు పదార్థములను శుద్ధ మొనర్చుచున్నారు?

స్వ౪ర్ణ ఘర్మః స్వాహా స్వ౪ర్ణార్కః స్వాహా స్వ౪ర్ణ శుక్రః స్వాహా
స్వ౪ర్ణ జ్యోతిః స్వాహా స్వ౪ర్ణ సూర్యః స్వాహా ॥ ॥౫౦॥

స్వః, న, ఘర్మః, స్వాహా, స్వః, న, అర్కః, స్వాహా, స్వః, న, శుక్రః, స్వాహా, స్వః, న, జ్యోతిః, స్వాహా, స్వః, న, సూర్యః, స్వాహా. (50)

పదార్థః :—(స్వః)సుఖమ్(న)ఇవ(ఘర్మః)తాపః(స్వాహా)సత్యయా క్రియయా (స్వః) (న) ఇవ(అర్కః)అగ్నిః(స్వాహా)(స్వః)(న)ఇవ(శుక్రః)వాయుః (స్వాహా) (స్వః) (న) ఇవ (జ్యోతిః) విద్యుతోదీప్తిః(స్వాహా)(స్వః)(న)ఇవ(సూర్యః)(స్వాహా). ॥౫౦॥ అన్వయః :—హే మనుష్యా ! యథా స్వాహా స్వర్ణ ఘర్మ స్వాహా స్వర్ణార్కః స్వాహా స్వర్ణ శుక్రః స్వాహా స్వర్ణ జ్యోతిః స్వాహా స్వర్ణ సూర్యః స్త్యాత్తథా యూయ మప్యాచరత.॥౫౦॥భావార్థః :—అత్రోప మాలంకారః. యజ్ఞకారిణో మనుష్యాః సుగన్ధాదిద్రవ్యహోమైః సర్వాన్వాయ్వాది పదార్థాన్ శుద్ధాన్ కర్తుం శక్నువన్తి యేన రోగరాహిత్యేన సర్వేషాం దీర్ఘాయుః స్యాత్. ॥౫౦॥

పదార్థము :-మానవులారా ! ఎటుల, స్వాహా = సత్యక్రియచే, స్వః న = సుఖతుల్యముగ, ఘర్మః = ప్రతాపము, స్వాహా = సత్యక్రియచే, స్వః న = సుఖ తుల్యముగ. అర్కః = అగ్ని, స్వాహా = సత్యక్రియచే, స్వః న = సుఖ సదృశముగ, శుక్రః = వాయువు, స్వాహా = సత్యక్రియతో, స్వః న = సుఖము వలె, జ్యోతిః = విద్యుత్కాంతి, స్వాహా = సత్యక్రియచే, స్వః న = సుఖము వలె, సూర్యః = సూర్యుడు అగుచున్నాడో, అటులనే మీరును ఆచరించుడు. ॥౫౦॥

భావార్థము :—ఈ మంత్రము నందుపమాలంకార మున్నది. యజ్ఞమొనరించు మానవులు సుగంధి యుక్తాది పదార్థముల హోమముచే రోగములు నశించి యందరికి దీర్ఘాయువు కలుగునటుల సమస్తవాయ్వాది పదార్థములను శుద్ధమొనర్చుటకు సమర్థు లగుచున్నారు. ॥౫౦॥

---

౧౦౦౦ అగ్నిమిత్యస్య శునఃశేప ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః,
కీదృశా నరాః సుఖినో భవన్తీత్యుప దిశ్యతే. ఎటువంటి నరులు సుఖు లగుదురు ?

అగ్నిం యునజ్మి శవసా ఘృతేన దివ్యꣳసుపర్ణం వయసా బృహన్తమ్ ।
తేన వయం గమేమ బ్రధ్నస్య విష్టపꣳస్వో రుహాణా అధినాక ముత్తమమ్ ॥

అగ్నిమ్, యునజ్మి, శవసా, ఘృతేన, దివ్యమ్, సుపర్ణమితి సు+పర్ణమ్, వయసా, బృహన్తమ్, తేన, వయమ్, గమేమ, బ్రధ్నస్య, విష్టపమ్, స్వః, రుహాణాః, అధి, నాకమ్, ఉత్తమమ్. (51)

పదార్థః :—(అగ్నిమ్)పావకమ్ (యునజ్మి) సుగన్ధైర్ద్రవ్యై ర్యుక్తం కరోమి (శవసా) బలేన(ఘృతేన)ఆజ్యేన(దివ్యమ్)దివి శుద్ధగుణే భవమ్(సుపర్ణమ్)సుష్ఠుపాలన పూర్తికరమ్ (వయసా)

వ్యాప్త్యా (బృహన్తమ్)మహాన్తమ్(తేన) (వయమ్) (గమేమ) గచ్ఛేమ. అత్ర బహులం ఛన్దసీతి శపో లుక్(బ్రధ్నస్య)మహతః(విష్టపమ్)విష్టాన్ ప్రవిష్టాన్ పాతి యేన తత్ (స్వః)సుఖమ్ (రుహాణాః)రోహతః(అధి)ఉపరిభావే(నాకమ్)అవిద్యమానదుఃఖమ్(ఉత్తమమ్)శ్రేష్ఠమ్. ॥౫౦॥
అన్వయః:-అహం వయసా బృహన్తం దివ్యం సుపర్ణ మగ్నిం శవసా ఘృతేన యునజ్మి తేన స్వో రుహాణా వయం బ్రధ్నస్య విష్టప ముత్తమం నాక మధిగమేమ. ॥౫౦॥ భావార్థః :-యే మనుష్యా అగ్నౌ సుసంస్కృతాని సుగన్ధ్యాదియుక్తాని ద్రవ్యాణి ప్రక్షిప్య వాయ్వాదిశుద్ధిద్వారా సర్వాన్ సుఖయన్తి తేఽత్యుత్తమం సుఖ మాప్నువన్తి. ॥౫౦॥

పదార్థము :-నేను, వయసా = ఆయువుయొక్క వ్యాప్తిచే. బృహంతమ్ = పెద్దది, దివ్యమ్ = శుద్ధగుణములందు ప్రసిద్ధము, సుపర్ణమ్ = చక్కగ రక్షించుటలో పరిపూర్ణమైనదియు నగు, అగ్నిమ్ = అగ్నిని. శవసా = బలప్రదములగు, ఘృతే = నేయి మొదలగు సుగంధిత పదార్థములతో, యునజ్మి = సమ్మేళన మొనర్చు చున్నాను. తేన = అందుచే, స్వః = సుఖమును, రుహాణాః వయమ్ = అధిష్ఠించినవార మైన మేము, బ్రధ్నస్య = చాలా పెద్దవాడగు[నీశ్వరునియొక్క], విష్టపమ్ = సామాన్య భావముతోగాని విశేషభావముతోగాని ప్రవిష్ఠములైన జీవులను పాలించు వ్యవహారమును, ఉత్తమమ్ నాకమ్ = శ్రేష్టమును దుఃఖరహితమును సుఖరూపమును నగు స్థానమును, అధిగమేమ = పొందు చున్నాము. ॥౫౦॥

భావార్థము :-ఏ మానవు లగ్నియందు సుసంస్కృతములు సుగంధాది యుతములునగు పదార్థములను వ్రేల్చి వాయ్వాదుల శుద్ధిద్వారా అందరిని సుఖపెట్టుచున్నారో వారత్యంత సుఖమునుపొందుచున్నారు.

---

౧౦౦౧ ఇమావిత్యస్య శునఃశేప ఋషిః, అగ్నిర్దేవతా, విరాడార్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఇమౌ తే పక్షావజరౌ పతత్రిణౌ యాభ్యాꣳ రక్షాꣳస్యపహꣳస్యగ్నే ।
తాభ్యాం పతేమ సుకృతాము లోకం యత్రఽఋషయో జగ్ముః ప్రథమజాః పురాణాః॥

ఇమౌ, తే, పక్షౌ, అజరౌ, పతత్రిణౌ, యాభ్యామ్, రక్షాꣳసి, అపహꣳసీత్యప+హꣳసి, అగ్నే, తాభ్యామ్, పతేమ, సుకృతామితి సు+కృతామ్, ఊ +ఇత్యూమ్, లోకమ్, యత్ర, ఋషయః, జగ్ముః, ప్రథమజా ఇతి ప్రథమ+జాః, పురాణాః.

పదార్థః :-(ఇమౌ)(తే)తవ(పక్షౌ)పరిగ్రహౌ కార్యకారణరూపౌ(అజరౌ) అవినాశినౌ (పతత్రిణౌ)పతత్రాణ్యూర్ధ్వగమనాని సన్తి యయోస్తౌ (యాభ్యామ్)(రక్షాంసి) దుష్టాన్ దోషాన్వా (అపహంసి)దూరే ప్రక్షిపసి (అగ్నే)అగ్నిరివ వర్తమాన తేజస్విన్ విద్వన్(తాభ్యామ్)(పతేమ)గచ్ఛేమ (సుకృతామ్)శోభన మకార్షు స్తే సుకృత స్తేషామ్(ఉ)వితర్కే-(లోకమ్)ద్రష్టవ్య మానన్దమ్(యత్ర) (ఋషయః)వేదార్థవిదః(జగ్ముః)గతవన్తః(ప్రథమజాః)ప్రథమే విస్తీర్ణే బ్రహ్మణి జాతాః ప్రసిద్ధాః (పురాణాః)పురా అధ్యయనసమయే నవీనాః. ॥౫౨॥ అన్వయః :-హే అగ్నే! తే యావిమౌ పతత్రిణా వజరౌ పక్షౌ స్తో యాభ్యాం రక్షాంస్యపహంసి తాభ్యా ముతం సుకృతాం లోకం వయం

పతేమ యత్ర ప్రథమజాః పురాణా ఋషయో జగ్ముః. ॥౫౨॥ భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథాప్తా విద్వాంసో దోషాన్ హత్వా ధర్మాదిసద్గుణాన్ గృహీత్వా బ్రహ్మ ప్రాప్యానంద న్తి తథైతాన్ ప్రాప్య మనుష్యై రపి సుఖయితవ్యమ్. ॥౫౨॥

పదార్థము :-అగ్నే = అగ్నివలె ప్రతాపముగల విద్వాంసుడా ! తే = నీ యొక్క, పతత్రిణౌ = ఉచ్ఛశ్రేణిని పొందినవి, అజరౌ = ఎన్నడు నశించనివి అజరములు అమరములునగు,ఇమౌ = పక్షౌ = కార్యకారణ రూపములగు నే యీ సమీప పదార్థము లున్నవో, యాభ్యామ్ = వేనిచే నీవు, రక్షాంసి = దుష్ట ప్రాణులను లేక దోషములను, అపహంసి = దూర పఱచుచున్నావో, తాభ్యామ్ ఉ = వాని చేతనే,సుకృతామ్ = సుకృతులగు సజ్జనుల యొక్క.లోకమ్ = కాంచదగిన ఆ ఆనందమును మేము, పతేమ = పొందగలుగుదుము గాక; యత్ర = ఏ యానందమున, ప్రథమజాః = సర్వవ్యాపకు డగు పరమాత్మయందు లేక అతి విస్తారమగు వేదమునందు ప్రసిద్ధులు, పురాణాః = పూర్వము-అధ్య యనసమయమందు నవీనులు, ఋషయః = వేదార్థవిదులు నగు విద్వద్వృషులు, జగ్ముః = చేరుదురో.

భావార్థము :-ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. శాస్త్రవేత్తలగు విద్వాంసులు దోషములు పీడి, ధర్మాది సద్గుణముల గ్రహించి, బ్రహ్మను పొంది ఎటుల ఆనందించు దురో అటులనే వానిని పొంది మానవులు సుఖించ వలయును. ॥౫౨॥ (౧౦౦౧)

---

౧౦౦౨ ఇన్దు రిత్యస్య పరమేష్ఠీ ఋషిః, ఇందు ర్దేవతా, ఆర్షీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

విద్వద్భిః కిం కార్య మిత్యాహ. విద్వాంసు లేమి చేయవలయును ?

ఇన్దుర్దక్షః శ్యేన ఋతావా హిరణ్యపక్షః శకునో భురణ్యుః ।

మహాన్త్సధస్థే ధ్రువ ఆ నిషత్తో నమస్తే అస్తు మా మా హిꣳసీః॥౫౩॥

ఇన్దుః, దక్షః, శ్యేనః, ఋతావేత్యృత+వా, హిరణ్యపక్ష ఇతి హిరణ్య+ పక్షః, శకునః, భురణ్యుః, మహాన్, సధస్థ ఇతి సధ+స్థే, ధ్రువః, ఆ, నిషత్తః, ని+సత్త ఇతి ని+సత్తః, నమః, తే, అస్తు, మా, మా, హిꣳసీః. (53)

పదార్థః :-(ఇన్దుః)చన్ద్ర ఇవ ఆర్ద్రస్వభావః(దక్షః) బలచాతుర్యయుక్తః (శ్యేనః)శ్యేన ఇవ పరాక్రమీ(ఋతా వా)ఋతస్య సత్యస్య సమ్బన్ధో విద్యతే యస్య సః.అత్రాన్యేషామపీతి దీర్ఘః.సుపాం సు లుగితి డాదేశః (హిరణ్యపక్షః)హిరణ్యస్య సువర్ణస్య పక్షః పరిగ్రహో యస్య సః (శకునః)శక్తిమాన్ (భురణ్యుః)భర్తా(మహాన్)(సధస్థే)సహ స్థానే(ధ్రువః)నిశ్చలః (ఆ)సమన్తాత్ (నిషత్తః) నితరాం స్థితః(నమః)సత్కరణమ్(తే)తుభ్యమ్(అస్తు)(మా)మామ్(మా)నిషేధే(హింసీః)తాడయేః. ॥౫౩॥

అన్వయః :-హే విద్వన్ సభేశః యస్త్వమిన్దు ర్దక్షః శ్యేన ఋతావా హిరణ్యపక్షః శకునో భురణ్యు ర్మహాన్ సధస్థ ఆనిషత్తో ధ్రువః సన్మా మా హిꣳసీ స్తస్మై తేఽస్మాకం నమోఽస్తు. ॥౫౩॥

భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. ఇహ జగతి విద్వాంసః స్థిరా భూత్వా సర్వాన్ విద్యా ర్థినః సుశిక్షితాన్ కుర్యు ర్యత స్తే హింసకా న భవేయుః ॥౫౩॥

పదార్థము :-విద్వాంసుడవైన సభాపతీ ! ఏ నీవు, ఇన్దుః = చంద్రునివలె శీతలస్వభావము గల

వాడవు, దక్షః = బలము చాతుర్యము గలవాడవు, శ్యేనః = డేగవలె పరాక్రమ వంతుడవు, ఋతావా = ఋతముతో సంబంధము గలవాడవు,హిరణ్య పక్షః = సువర్ణ గ్రహణము గలవాడవు,శకునః = శక్తిమంతుడవు, భురణ్యుః = సకల పాలకుడవు, మహాన్ = చాలా పెద్దవాడవు, సధస్థే = ఇతరులతోపాటు ఒకే స్థలమందు, ఆనిషత్తః = నిరంతరము స్థితుడవు, ధ్రువః = నిశ్చలుడవునై, మా = నన్ను,మా హింసీః = హింసించవో,తే = అట్టినీకు,నమః = మాసత్కారములు,అస్తు = అందుగాక।

భావార్థము :—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఈ లోకమున విద్వాంసులు స్థిరులుగనుండి సకల విద్యార్థులను హింసకులు కాకుండునటుల సుశిక్షితులుగ నొనర్చెదరు.

---

౧౦౦౩ దివ ఇత్యస్య గాలవ ఋషిః, ఇందు ర్దేవతా; భురిగార్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

కిం భూతో జనో దీర్ఘాయు ర్భవతీత్యుప దిశ్యతే. ఎవడు దీర్ఘాయువును పొంద గలడు ?

దివో మూర్ధాసి పృథివ్యా నాభి రూర్గ పామోషధీనామ్ ।

విశ్వాయుః శర్మ సప్రథా నమస్పథే ॥ ॥౫౪॥

దివః, మూర్ధా, అసి, పృథివ్యాః, నాభిః, ఊర్క్, అపామ్, ఓషధీనామ్, విశ్వాయురితి విశ్వ+ఆయుః, శర్మ, సప్రథా ఇతి స+ప్రథాః, నమః, పథే. (54)

పదార్థః:—(దివః)ప్రకాశస్య(మూర్ధా)శిర ఇవ వర్తమానః(అసి)(పృథివ్యాః)(నాభిః)బన్ధనమివ (ఊర్క్)రసః(అపామ్)జలానామ్(ఓషధీనామ్)(విశ్వాయుః)పూర్ణాయుః(శర్మ)శరణమ్ (సప్రథాః) ప్రథసా ప్రఖ్యయా సహ వర్తమానః(నమః)అన్నమ్(పథే)మార్గాయ.॥౫౪॥అన్వయః:—హే విద్వన్ ! యస్త్వం దివో మూర్ధా పృథివ్యా నాభి రపా మోషధీనా మూర్గివ విశ్వాయుః సప్రథా అసి స త్వం పథే నమః శర్మ చ ప్రాప్నుహి.॥౫౪॥భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యో మనుష్యో న్యాయవాన్ క్షమావాన్ ఔషధ సేవీ యుక్తాహారవిహారో జితేన్ద్రియో భవతి స శతాయు ర్జాయతే. ॥౫౪॥

పదార్థము :—విద్వాంసుడా ! ఏ నీవు, దివః = ప్రకాశము అనగా ప్రతాపము యొక్క,మూర్ధా = తలతో సమానుడవు, పృథివ్యాః = భూమియొక్క, నాభిః = బంధనముతో సమానుడవు, అపామ్ = జలములయొక్క, ఓషధీనామ్ = ఓషధుల యొక్కయు, ఊర్క్ = రసముతో సమానుడవు, విశ్వాయుః = పూర్తిగ శతవర్షములు జీవించువాడవు, సప్రథాః = కీర్తియుతుడవునై, అసి = ఉన్నావో, ఆ నీవు,పథే = సన్మార్గమునకై,నమః = అన్నమును, శర్మ = శరణమును సుఖమునుపొందుము.

భావార్థము:—ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకార మున్నది. ఏ మనుష్యుడు న్యాయవంతుడు, క్షమావంతుడు, ఔషధ సేవి, యుక్తాహార విహారుడు, జితేంద్రియుడు నై యుండునో. అతడు నూరుసంవత్సరముల ఆయువు పొందగలడు. ॥౫౪॥ (౧౦౦౩)

---

౧౦౦౪ విశ్వస్యేత్యస్య గాలవ ఋషిః. ఇందు ర్దేవతా, జగతీ ఛందః, నిషాదః స్వరః.

పున ర్మనుష్యైః కిం కర్తవ్య మిత్యుప దిశ్యతే. మానవు లేమి చేయవలయును ?

విశ్వస్య మూర్ధన్నధి తిష్ఠసి శ్రితః సముద్రే తే హృదయ మప్స్వాయు రపో దత్తోదధిం భిన్త । దివస్పర్జన్యాదన్తరిక్షాత్ పృథివ్యాస్తతో నో వృష్ట్యావ ।

విశ్వస్య, మూర్ధన్, అధి, తిష్ఠసి, శ్రితః, సముద్రే, తే, హృదయమ్, అప్సు, ఆయుః, అపః, దత్త, ఉదధిమిత్యుద+ధిమ్, భిన్త, దివః, పర్జన్యాత్, అన్తరిక్షాత్, పృథివ్యాః, తతః, నః, వృష్ట్యా, అవ. (౫౫)

పదార్థః :—(విశ్వస్య)సర్వస్య జగతః(మూర్ధన్)మూర్ధని(అధి)ఉపరి(తిష్ఠసి) (శ్రితః) (సముద్రే)అన్తరిక్షవద్వ్యాప్తే పరమేశ్వరే(తే)తవ(హృదయమ్)(అప్సు)ప్రాణేషు(ఆయుః) జీవనమ్ (అపః)ప్రాణాన్(దత్త)దదాసి(ఉదధిమ్) ఉదకధారకం సాగరమ్(భిన్త)భినత్సి (దివః)ప్రకాశాత్ (పర్జన్యాత్)మేఘాత్(అన్తరిక్షాత్)ఆకాశాత్(పృథివ్యాః)భూమేః(తతః)తస్మాత్(నః) (వృష్ట్యా)(అవ)రక్ష. ॥౫౫॥ అన్వయః :—హే విద్వన్ ! యస్త్వం విశ్వస్య మూర్ధన్ శ్రితః సూర్య ఇవాధితిష్ఠసి యస్య తే సముద్రే హృదయమప్స్వాయు రస్తి స త్వమపోదత్తోదధిం భిన్త యతః సూర్యో దివోఽన్తరిక్షాత్పర్జన్యాత్పృథివ్యా వృష్ట్యాసర్వానవతి తతో నోఽస్మానవ. ॥౫౫॥ భావార్థః :— అత్ర వాచకలుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవత్సుఖవర్షకా ఉత్తమాచారిణో భవన్తి. తే సర్వాన్ సుఖినః కర్తుం శక్నువన్తి. ॥౫౫॥

పదార్థము :—విద్వాంసుడా ! ఏ నీవు, విశ్వస్య = సకలమునకు, మూర్ధన్ = శిరస్సుమీద, శ్రితః = విరాజిల్లు సూర్యునివలె, అధితిష్ఠసి = అధికారమును పొందియున్నావో, తే = ఏ నీయొక్క, హృదయమ్ = మనస్సు, సముద్రే = అంతరిక్షమువలె వ్యాపకుడగు పరమాత్ముని యందును, ఆయుః = జీవనము, అప్సు = ప్రాణములందును ఉన్నవో[ఆ నీవు], అపః = ఆ ప్రాణములను, దత్త = ఒసగుచున్నావు, ఉదధిమ్ = సముద్రమును, భింత = భేదించుచున్నావు. దేనిచే సూర్యుడు, దివః = ప్రకాశము నుండి, అన్తరిక్షాత్ = ఆకాశము నుండి, పర్జన్యాత్ = మేఘమునుండి, పృథివ్యాః = భూమినుండి, వృష్ట్యా = వర్షాదుల యోగముచే, సకల చరాచర ప్రాణులన్నిటిని రక్షించుచున్నాడో, తతః = ఆ సూర్యునికి తుల్యుడవైన నీవు, నః అవ = మమ్ము రక్షింపుము. ॥౫౫॥

భావార్థము :—ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఏ మానవులు సూర్యునివలె సుఖమును వర్షింప జేయువారు, ఉత్తమాచారవంతులునై యున్నారో వారందఱిని సుఖులుగ నొనర్పగలుగుచున్నారు. ॥౫౫॥ (౧౦౦౫)

---

౧౦౦౫ ఇష్ట ఇత్యస్య గాలవ ఋషిః, యజ్ఞో దేవతా. ఆర్ష్యుష్ణిక్ ఛందః, ఋషభః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

ఇష్టో యజ్ఞో భృగుభి రాశీర్దా వసుభిః । తస్య న ఇష్టస్య ప్రీతస్య ద్రవిణేహాగమేః ॥

ఇష్టః, యజ్ఞః, భృగుభిః రితి భృగు + భిః, ఆశీర్దా ఇత్యాశీః + దాః, వసుభిరితి వసు + భిః, తస్య, నః, ఇష్టస్య, ప్రీతస్య, ద్రవిణ, ఇహ, ఆ, గమేః.

పదార్థః :—(ఇష్టః)కృతః(యజ్ఞః) యష్టుమర్హః (భృగుభిః) పరిపక్వవిజ్ఞానైః (ఆశీర్దాః) య ఇచ్ఛాసిద్ధిం దదాతి(వసుభిః)ప్రాథమకల్పికై ర్విద్వద్భిః(తస్య)(నః)అస్మాకమ్ (ఇష్టస్య) (ప్రీతస్య) కమనీయస్య (ద్రవిణ)ధనమ్. అత్ర సుపాం సులుగితి విభక్తేర్లుక్. (ఇహ)సంసారే(ఆ గమేః)

సమన్తాత్ గచ్ఛ, వాచ్ఛనసి సర్వే విధయో భవన్తీతి భత్వాభావః.॥౫౮॥ అన్వయః :—హే విద్వన్! యో వసుభి ర్భృగుభి రాశీర్దా యజ్ఞ ఇష్టస్తస్యేష్టస్య ప్రీతస్య యజ్ఞస్య సకాశాదిహ త్వన్నో ద్రవిణ ఆ గమేః.॥౫౮॥భావార్థః :—యే విద్వద్వత్ ప్రయతన్తే త ఇహ పుష్కలాం శ్రియ మాప్నువన్తి.

పదార్థము :—విద్వాంసుడా ! భృగుభిః = పరిపూర్ణ విజ్ఞానవంతులు, వసుభిః = మొదటి తరగతికి చెందిన విద్వాంసులు, ఆశీర్దాః = అభీష్టప్రదమగు, యజ్ఞః = ఏ యజ్ఞమును, ఇష్టః = చేసియున్నారో, తస్య ఇష్టస్య = ఆ యొనర్చబడిన,ప్రీతస్య = మనోహరమైనయజ్ఞము ద్వారా, ఇహ = ఈలోకమున నీవు, నః ద్రవిణ = మా ధనమును, ఆ గమేః = పొందుము. ॥౫౮.॥

భావార్థము :—విద్వాంసులవలె చక్కగ ప్రయత్నించువారలీ జగత్తులో పుష్టలధనమును పొందుదురు

---

౧౦౦౮ ఇష్ట ఇత్యస్య గాలవ ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఇష్టో౽అగ్నిరాహుతః పిపర్తు న ఇష్టꣳహవిః । స్వగేద న్దేవేభ్యో నమః ॥

ఇష్టః, అగ్నిః, ఆహుత ఇత్యాహుతః, పిపర్తు, నః, ఇష్టమ్, హవిః, స్వగేతి స్వ+గా, ఇదమ్, దేవేభ్యః, నమః. (57)

పదార్థః :—(ఇష్టః)సత్కృత ఆహుతిభి ర్వర్ధితో వా(అగ్నిః)సభాద్యధ్యక్షో విద్వాన్ పావకో వా(ఆహుతః)సమన్తాత్ తర్పితో హుతో వా(పిపర్తు)పాలయతు పూరయతు వా(నః) అస్మానస్మాకం వా(ఇష్టమ్)సుఖం తత్సాధనం వా(హవిః) హవిషా. సంస్కృతద్రవ్యేణ విభక్తివ్యత్యయః (స్వగా) యత్స్వాన్ గచ్ఛతి ప్రాప్నోతి తత్ స్వగా. అత్ర విభక్తేః సుపాం సు లుగిత్యాకారాదేశః (ఇదమ్) (దేవేభ్యః)విద్వద్భ్యః(నమః)అన్నం సత్కారో వా. ॥౫౭॥ అన్వయః :—హవి రాహుత ఇష్టో౽గ్ని ర్న ఇష్టం పిపర్తు నః పిపర్తు వా ఇదం స్వగా నమో దేవేభ్యో౽స్తు. ॥౫౭॥
భావార్థః :—మనుష్యై రగ్నౌ యత్ సుసంస్కృతం ద్రవ్యం హూయతే యదిహ బహ్వన్నకారి జాయతే ఽత స్తేన విద్వదాదీనాం సత్కారః కర్తవ్యః. ॥౫౭॥

పదార్థము :—హవిః = సంస్కరించబడిన పదార్థములచే, ఆహుతః = చక్కగ తృప్తిపఱచబడిన లేక హవన మొనర్చబడిన, ఇష్టః = సత్కరించబడిన లేక ఆహుతులచే వృద్ధిజేయబడిన, అగ్నిః = ఈ సభాసదుల యధ్యక్షుడు విద్వాంసుడు లేక అగ్ని, నః ఇష్టమ్ = మా యొక్క సుఖమును, సుఖసాధనమును, పిపర్తు = పూరించునుగాక ! మమ్ము రక్షించునుగాక ! ఇదమ్ స్వగా = నేను పొందుచున్న ఈ, నమః = అన్నము లేక సత్కారము, దేవేభ్యః = విద్వాంసులకు కూడ కలుగును గాక ! ॥౫౭॥

భావార్థము:—అగ్నియందు మానవు లే సుసంస్కృత పదార్థమును వ్రేల్చుచున్నారో అది యీ జగత్తులో నధికాన్నము నుత్పాదించునది యగుచున్నది, కావున దానిచే విద్వాంసులు మొదలగువారిని సత్కరించ వలయును. ॥౫౭॥ (౧౦౦౮)

---

౧౦౦౯ యదేత్యస్య విశ్వకర్మా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్షీజగతీ ఛందః, నిషాదః స్వరః.
అథ విద్వద్విషయే సత్యనిర్ణయ మాహ. విద్వాంసుల విషయములో సత్యనిర్ణయము.

యదాకూతాత్సమసుస్రోద్ధృదో వా మనసో వా సంభృతం చక్షుషో వా తదనుప్రేత సుకృతాము లోకం యత్రఋషయో జగ్ముః ప్రథమజాః పురాణాః ॥

యత్, ఆకూతాదిత్యా+కూతాత్, సమసుస్రోదితి సమ్+అసుస్రోత్, హృదః, వా, మనసః, వా, సంభృతమితి సమ్+భృతమ్, చక్షుషః, వా, తత్, అనుప్రేతే త్యను+ప్రేత, సుకృతామితి సుకృతామ్, ఊఁ ఇత్యూఁ, లోకమ్, యత్ర, ఋషయః, జగ్ముః, ప్రథమజాః, పురాణాః. (58)

పదార్థః :—(యత్)(ఆకూతాత్)ఉత్సాహాత్(సమసుస్రోత్) సమ్యక్ ప్రాప్నుయాత్. అత్ర బహులం ఛన్దసీతి శపః శ్లుః(హృదః)ఆత్మనః(వా)ప్రాణాత్(మనసః)సంకల్పవికల్పాత్మకాత్(వా)బుద్ధ్యాదేః(సంభృతమ్)సమ్యగ్ ధృతమ్(చక్షుషః)ప్రత్యక్షాదే రిన్ద్రియోత్పన్నాత్(వా)శ్రోత్రాదిభ్యః(తత్)(అనుప్రేత)ఆనుకూల్యేన ప్రాప్నుత (సుకృతామ్)ముముక్షూణామ్(ఉ)(లోకమ్)దర్శనసుఖసంఘాతం మోక్షపదం వా(యత్ర)యస్మిన్ (ఋషయః) వేదవిద్యాపురస్సరాః పరమయోగినః (జగ్ముః) గతాః (ప్రథమజాః)అస్మదాదౌ జాతాః(పురాణాః)అస్మదపేక్షయాం ప్రాచీనాః. ॥౫౮॥ అన్వయః :—హే సత్యాసత్యజిజ్ఞాసవో జనా ! యూయం యదాకూతాద్ధృతో వా మనసో వా చక్షుషో వా సంభృతమస్తి తత్సమసుస్రోదతః ప్రథమజాః పురాణా ఋషయో యత్ర జగ్ముస్తం సుకృతా ము లోకమనుప్రేత. ॥౫౮॥ భావార్థః :—యదా మనుష్యాః సత్యాసత్యనిర్ణయం జిజ్ఞాసేయుస్తదా యద్యదీశ్వర గుణకర్మస్వభావాత్ సృష్టిక్రమాత్ ప్రత్యక్షాదిప్రమాణేభ్య ఆప్తాచారాదాత్మమనోభ్యా మనుకూలం స్యాత్తత్ సత్యమితరదసత్యమితి నిశ్చినుయుర్య ఏవం ధర్మం పరీక్ష్యాచరన్తి తేఽతిసుఖం ప్రాప్నువన్తి.

పదార్థము :—సత్యాసత్య జిజ్ఞాసువులారా! మీరు, యత్ = ఏది, ఆకూతాత్ = ఉత్సాహమువలన, హృదః = ఆత్మవలన. వా = ప్రాణమువలన. మనసః = మనస్సువలన. వా = బుద్ధ్యాదులవల, చక్షుషః = నేత్రాదీంద్రియములవలన కలిగిన ప్రత్యక్షాది ప్రమాణముల చేత, వా = కర్ణాదీంద్రియముల చేత, సంభృతమ్ = బాగుగ ధారణ మొనర్పబడినదై అనగ నిశ్చయముగ సరిగ నెఱిగిన, చూచిన, అనుమానముచే నెఱుగ బడినదై యున్నదో, తత్ = అది, సమసుస్రోత్ = చక్కఁగ లభించుగాక ; ఇందులకై, ప్రథమజాః = మా కంటె ముందు పుట్టినవారు, పురాణాః = మాకంటె ప్రాచీనులు, ఋషయః = వేద విద్యనెఱిగిన పరమ యోగులైన ఋషులు, యత్ర = ఎక్కడకు, జగ్ముః = చేరుదురో, సుకృతామ్ ఉ = ఆ సుకృతులకు—ముముక్షువులగు సజ్జనులకే చెందిన, లోకమ్ = ప్రత్యక్ష సుఖసమూహమును—మోక్షపదమును, అనుప్రేత = అనుకూలముగ పొందుడు. ॥౫౮॥

భావార్థము :—ఎప్పుడు మానవులు సత్యాసత్య నిర్ణయమును అభిలషించెదరో అప్పుడు ఏదేది ఈశ్వరుని గుణకర్మ స్వభావమునకు, సృష్టిక్రమమునకు, ప్రత్యక్షాది ప్రమాణములకు, ఆప్తుని ఆచారమునకు, ఆత్మకు, మనస్సునకు అనుకూలముగ నుండునో అయ్యది సత్యము, తద్భిన్నము అనృతమని నిశ్చయించు కొనవలయును. ఎవరిటువంటి పరీక్ష యొనర్చి ధర్మము నాచరింతురో వా రత్యంత సుఖమును పొందుచున్నారు. ॥౫౮॥ (౧౦౦౮)

౧౦౦౮ ఏతమిత్యస్య విశ్వకర్మా ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదార్షీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఏతꣳ సధస్థ పరి తే దదామి యమావహాచ్ఛేవధిం జాతవేదాః ।
అన్వాగన్తా యజ్ఞపతి ర్వో అత్ర తꣳ స్మ జానీత పరమే వ్యోమన్ ॥౫౯॥

ఏతమ్, సధస్థేతి సధఽస్థ, పరి, తే, దదామి, యమ్, ఆవహాదిత్యావహాత్, శేవధిమితి శేవ+ధిమ్, జాతవేదా ఇతి జాత+వేదాః, అన్వాగన్తేత్యను ఆ+గన్తా, యజ్ఞపతిరితి యజ్ఞ+పతిః, వః, అత్ర, తమ్, స్మ, జానీత, పరమే, వ్యోమన్నితి వి+ఓమన్. (59)

పదార్థః :-(ఏతమ్)పూర్వోక్తమ్(సధస్థ) సమానస్థాన(పరి)సర్వతః (తే)తుభ్యమ్ (దదామి) (యమ్)(ఆవహాత్)సమన్తాత్ప్రాప్నుయాత్(శేవధిమ్)శేవం సుఖం ధీయతే యస్మింస్తం నిధిమ్ (జాతవేదాః)జాతప్రజ్ఞో వేదార్థవిత్(అన్వాగన్తా) ధర్మమన్వాగచ్ఛతి. (యజ్ఞపతిః) యజ్ఞస్య పాలక ఇవ వర్తమానః(వః)యుష్మభ్యమ్(అత్ర)(తమ్)(స్మ)ఏవ(జానీత)(పరమే) ప్రకృష్టే (వ్యోమన్) వ్యోమ్న్యాకాశే.॥౫౯॥అన్వయః :-హే ఈశ్వర జిజ్ఞాసవో మనుష్యా హే సధస్థ చ జాతవేదా యజ్ఞపతిర్యం శేవధి మావహా దేత మత్ర పరమే వ్యోమన్ వ్యాప్తం పరమాత్మాన మహం తే యథా పరిదదామ్యన్వాగన్తాఽహం యం వో యుష్మభ్య ముపదిశాని స్మ తం యూయం విజానీత. ॥౫౯॥
భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే మనుష్యా విద్వదనుకూల మాచరన్తి. తే సర్వవ్యాపిన మన్తర్యామిణ మీశ్వరం ప్రాప్తు మర్హన్తి. ॥౫౯॥

పదార్థము :-ఈశ్వరుని జిజ్ఞాసించు మానవులారా! సధస్థ = ఏక స్థానముననుండు సజ్జనులారా! జాతవేదాః = జాతప్రజ్ఞుడు, వేదార్థవేత్త, యజ్ఞపతిః = యజ్ఞమును పాలించువానివలె నుండువాడు, యమ్ శేవధిమ్ = సుఖనిధియగు నే పరమేశ్వరుని, ఆవహాత్ = చక్కగాపొందునో, ఏతమ్ = ఆయితనిని, అత్ర పరమే వ్యోమన్ = ఈ పరమోత్తమాకాశమునందు వ్యాపకుడగు పరాత్పరుని, తే = నీకై ఎటుల, పరిదదామి = అన్నివిధముల ఇచ్చుచున్నానో, ఉపదేశించుచున్నానో, అన్వాగంతా = ధర్మానుకూలముగ నడచువాడనైన నేను, వః = మీ యందఱికి నే పరమేశ్వరుని, స్మ = ఉపదేశించుచున్నానో; తమ్ = అతనిని, జానీత = మీరు తెలుసుకొనుడు. ॥౫౯॥

భావార్థము:- ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ఎవరు విద్వాంసుల కనుకూలముగ నాచరించుదురో వారు సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని పొందుట కర్హులగుచున్నారు.

---

౧౦౦౯ ఏతమిత్యస్య విశ్వకర్మర్షిః, ప్రజాపతిర్దేవతా, నిచృదార్షీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నా విషయమే.

ఏతం జానాథ పరమే వ్యోమన్ దేవాః సధస్థా విద రూపమస్య ।
యదాగచ్ఛాత్ పథిభి ర్దేవయానై రిష్టాపూర్తే కృణవాథావి రస్మై ॥

ఏతమ్, జానాథ, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్, దేవాః, సధస్థా ఇతి సధ + స్థాః, విద, రూపమ్, అస్య, యత్, ఆగచ్ఛాదిత్యా + గచ్ఛాత్, పథిభిరితి పథిభిః, దేవయానై రితి దేవ+యానైః, ఇష్టాపూర్తే ఇతీష్టా+పూర్తే, కృణవాథ, ఆవిః, అస్మై.

పదార్థః :—(ఏతమ్) పరమాత్మానమ్ (జానాథ) విజానీత. లేట్ ప్రయోగోఽయమ్ (పరమే) (వ్యోమన్) (దేవాః) విద్వాంసః (సధస్థాః) సహస్థానాః (విద) బుద్ధ్యధ్వమ్ (రూపమ్) సచ్చిదానన్దస్వరూపమ్ (అస్య) (యత్) (ఆగచ్ఛాత్) సమన్తాత్ ప్రాప్నుయాత్ (పథిభిః) మార్గైః (దేవయానైః) దేవా ధార్మికా విద్వాంసో గచ్ఛన్తి యేషు తైః (ఇష్టాపూర్తే) ఇష్టం శ్రౌతం కర్మ చ పూర్తం స్మార్తం కర్మ చ తే (కృణవాథ) కురుథ (ఆవిః) ప్రాకట్యే (అస్మై) పరమాత్మనే. ॥౬౦॥

అన్వయః :— హే సధస్థా దేవాః యూయం పరమే వ్యోమన్ వ్యాప్తమేతం జానాథాస్య రూపం విద యద్దేవయానైః పథిభిరాగచ్ఛాదస్మై పరమాత్మనే ఇష్టాపూర్తే ఆవిః కృణవాథ. ॥౬౦॥

భావార్థః :—సర్వే మనుష్యా విద్వత్సఙ్గయోగాభ్యాస ధర్మాచారైః పరమేశ్వర మవశ్యం జానీయుర్నో చేదిష్టాపూర్తే సాధయితుం న శక్నుయుః. న చ ముక్తిం ప్రాప్నుయుః. ॥౬౦॥

పదార్థము :—సధస్థాః = ఒకే స్థానమున కలిసి మెలసియుండు వారలారా ! దేవాః = విద్వాంసులారా ! మీరు, పరమే వ్యోమన్ = పరమోత్తమాకాశమందు వ్యాప్తుడగు, ఏతమ్ = ఈ పరమాత్మను, జానాథ = ఎఱుగుడు. అస్య = ఈ వ్యాపకుని యొక్క, రూపమ్ = సత్యము, చైతన్యమాత్రము, ఆనందమయము నగు స్వరూపమును, విద = ఎఱుగుడు, యత్ = ఏ సచ్చిదానంద పరమేశ్వరుని, దేవయానైః = ధార్మిక విద్వాంసులు నడచు, పథిభిః = మార్గముల ద్వారా పురుషుడు, ఆగచ్ఛాత్ = చక్కగా పొందునో, అస్మై = ఈ పరమేశ్వరునికై . ఇష్టాపూర్తే = వేదోక్తయజ్ఞాది కర్మలను, దాని సాధకములగు స్మార్త కర్మలను, ఆవిః = ఆవిష్కారము. కృణవాథ = ఒనర్చుడు.

భావార్థము :—మానవులందరు విద్వత్సంగముచేతను. యోగాభ్యాసముచేతను, ధర్మాచరణముచేతను పరమేశ్వరుని తప్పక ఎఱుగుదురుగాక : ఇటు లొనర్చనిచో యజ్ఞాది శ్రౌత స్మార్త కర్మలను సాధించజాలరు మఱియు ముక్తిని కూడ పొందజాలరు. ॥౬౦॥ (౧౦౦౯)

---

౧౦౧౦ ఉద్బుధ్యస్వేత్యస్య గాలవః ఋషిః, ప్రజాపతిర్దేవతా, ఆర్షీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునః సఏవ విషయః ప్రోచ్యతే. మఱల నా విషయమే చెప్పబడుచున్నది.

ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టాపూర్తే సఁ సృజేథా మయం చ ।
అస్మిన్త్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥

ఉత్, బుధ్యస్వ, అగ్నే, ప్రతి, జాగృహి, త్వమ్, ఇష్టాపూర్తే ఇతీష్టా+పూర్తే, సమ్, సృజేథామ్, అయమ్, చ, అస్మిన్, సధస్థ ఇతి సధ+స్థే, అధి, ఉత్తరస్మిన్నిత్యుత్+తరస్మిన్, విశ్వే, దేవాః, యజమానః, చ, సీదత.

పదార్థః :—(ఉత్) ఊర్ధ్వమ్ (బుధ్యస్వ) జానీహి (అగ్నే) అగ్నిరివ వర్తమాన పురుష (ప్రతి) (జాగృహి) యజమానం ప్రబోధయావిద్యానిద్రాం పృథక్ కృత్య విద్యాయాం జాగరూకం కురు (త్వమ్) (ఇష్టాపూర్తే) ఇష్టం చ పూర్తం చ తే (సమ్) సంసర్గే (సృజేథామ్)నిష్పాదయేతామ్ (అయమ్) బ్రహ్మవిద్యోపదేష్టా (చ) (అస్మిన్) (సధస్థే) సహస్థానే (అధి) ఉపరి (ఉత్తరస్మిన్) ఉత్తమాసనే (విశ్వే) సమగ్రాః (దేవాః) విద్యాయాః కామయితారః (యజమానః) విద్యాప్రదాతా యజ్ఞకర్తా (చ) (సీదత) తిష్ఠత. ॥౬౧॥ అన్వయః :-హే అగ్నే త్వముద్బుధ్యస్వ ప్రతి జాగృహి త్వం చాయం ఇష్టాపూర్తే సంసృజేథాం హే విశ్వేదేవా ! కృతేష్టాపూర్తో యజమానశ్చ యూయం సధస్థేఽస్మిన్నుత్తరస్మిన్నధి సీదత. ॥౬౧॥

భావార్థః :—యే సచేతనా ధీమన్తో విద్యార్థినః స్యుస్తేఽధ్యాపకైః సమ్యగధ్యాపనీయాః స్యుర్యే విద్యాభీప్సవోఽధ్యాపకానుకూలాచరణాః స్యుర్యే చ తదధీనా అధ్యాపకాస్తే పరస్పరం ప్రీత్యా సతతం విద్యోన్నతిం కుర్యుర్యేఽతోఽన్యే ప్రశస్తా విద్వాంసః స్యుస్త ఏతేషాం సతతం పరీక్షాం కుర్యుర్యత ఏతే విద్యావర్ధనే సతతం ప్రయతేరఁస్తథర్త్విగ్యజమానాదయో భవేయుః ॥౬౧॥

పదార్థము :-అగ్నే = అగ్నివలెనుండు ఋత్విక్కా ! త్వమ్ = నీవు, ఉద్బుధ్యస్వ = లెమ్ము. ప్రబోధమును పొందుము, ప్రతి జాగృహి = యజమానుని అవిద్యారూప నిద్రనుండి మేలుకొలిపి విద్యయందు చైతన్యునిగ నొనర్చుము. నీవును, చ = మఱియు, అయమ్ = బ్రహ్మవిద్య నుపదేశించు నీ యజమానుడును ఇరువురు. ఇష్టాపూర్తే = యజ్ఞ సిద్ధికర్మలను, దాని సామగ్రిని, సంసృజేథామ్ = ఉత్పన్నమొనర్చుడు, విశ్వే దేవాః = సమస్త విద్వాంసులారా ! చ యజమానః = [ఇష్టాపూర్తమొనర్చినవాడు] విద్యగఱపువాడును, యజ్ఞమొనర్చువాడుననగు యజమానుడును మీరందరును, అస్మిన్ సధస్థే = ఈ ఒకే స్థానములో, ఉత్తరస్మిన్ = ఉత్తమాసనమునందు, అధి సీదత = ఆసీనులు గండు. ॥౬౧॥

భావార్థము :-చైతన్యవంతులు, ధీమంతులునగు విద్యార్థులను అధ్యాపకులు చక్కగా చదివించవలయును. విద్యాభీప్సువులై అధ్యాపకుని కనుకూలముగ నాచరించువారు, తదధీనులగు నధ్యాపకులు పరస్పర ప్రేమతో సతతము విద్యోన్నతి యొనర్చవలయును. ఈ అధ్యాపకాధ్యేతలకు వేరుగనున్న ఉత్తమ విద్వాంసులు ఈ అధ్యాపకాధ్యేతలు విద్యాభివృద్ధియందు నిరంతరము ప్రయత్న మొనరించునటుల విద్యార్థులను సమయ సమయములందు పరీక్షించు చుండవలయును. అటులనే ఋత్విగ్యజమానులును సభ్యులైన పరీక్షక విద్వాంసులును యజ్ఞమును అభివృద్ధి పఱచవలయును. ॥౬౧॥(౧౦౧౦)

---

౧౦౧౧ యేనేత్యస్య దేవశ్రవ దేవవాతా వృషీ, విశ్వకర్మాగ్ని ర్వా దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పునః స ఏవ విషయః ప్రకాశ్యతే. మఱల నా విషయమే.

యేన వహసి సహస్రం యేనాగ్నే సర్వవేదసమ్ ।
తేనేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ॥ ॥౬౨॥

యేన. వహసి, సహస్రమ్, యేన, అగ్నే, సర్వవేదసమితి సర్వ+వేదసమ్, తేన ఇమమ్, యజ్ఞమ్, నః, నయ, స్వఃరితి స్వః, దేవేషు, గన్తవే. (62)

పదార్థః :—(యేన) అధ్యాపనేన (వహసి) ప్రాప్నోషి (సహస్రమ్)అసంఖ్యమతులం బోధ

మ (యేన) అధ్యయనేన (అగ్నే) అధ్యాపకాధ్యేతు ర్వా (సర్వవేదసమ్) సర్వే వేదసో వేదా విజ్ఞాయ న్తే యస్మిఀ స్తమ్ (తేన) (ఇమమ్) వక్ష్యమాణమ్ (యజ్ఞమ్) అధ్యయనాధ్యాపనాఖ్యమ్ (నః) అస్మా న్ (నయ) ప్రాప్నుహి ప్రాపయ వా (స్వః) సుఖమ్ (దేవేషు) దివ్యేషు గుణేషు విద్వత్సు వా (గన్తవే) గన్తుం ప్రాప్తుమ్. ॥౬౨॥ అన్వయః :—హే అగ్నే! త్వం యేన సహస్రం సర్వవేదసం వహసి ప్రాప్నోషి యేన చ ప్రాపయసి తేనేమం యజ్ఞం నో దేవేషు స్వర్గన్తవే నయ. ॥౬౨॥ భావార్థః :— యే ధర్మాచరణ నిష్కపటత్వాభ్యాం విద్యాం ప్రయచ్ఛన్తి గృహ్ణన్తి చ త ఏవ సుఖభాగినో భవన్తి.

పదార్థము :—అగ్నే = చదువువాడా! చదివించువాడా! యేన = ఏ విద్య గఱపుటచే, సహస్రమ్ = సహస్ర విధములుగనున్న అనుపమ బోధను, సర్వవేదసమ్ = సకలవేదముల నెఱుగ గలుగు దానిని. వహసి = నీవు పొందుచున్నావో. యేన = ఏది యభ్యసించి యితరులకు లభింప జేయుచున్నావో. తేన = దానిచే. ఇయమ్ యజ్ఞమ్ = అధ్యయనాధ్యాపనమగు నీ యజ్ఞమును. నః = మమ్మును. దేవేషు = దివ్యగుణములందు. విద్వాంసులందు. స్వర్గంతవే = సుఖమును పొందుటకై. నయ = చేర్పించుము. ॥౬౨॥

భావార్థము :—ఎవరు ధర్మాచరణముచేతను నిష్కపటముచేతను విద్యాదాన మొసగుదురో. గ్రహించుదురో వారే సుఖభాగు లగుచున్నారు. ౧౦౧౧ ॥౬౨॥

---

౧౦౧౨ ప్రస్తరేణేత్యస్య విశ్వామిత్ర ఋషిః, యజ్ఞో దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.

పున ర్మనుష్యైః క్రియాయజ్ఞః కథం సాధనీయ ఇత్యుప దిశ్యతే.

మానవులు క్రియాయజ్ఞము నెటుల సాధించవలయును?

ప్రస్తరేణ పరిధినా స్రుచా వేద్యా చ బర్హిషా ।
ఋచేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ॥ ॥౬౩॥

ప్రస్తరేణేతి ప్ర+స్తరేణ, పరిధినేతి పరి+ధినా, స్రుచా వేద్యా చ, బర్హిషా, ఋచా, ఇమమ్, యజ్ఞమ్, నః, నయ, స్వః, దేవేషు, గన్తవే. (63)

పదార్థః :—(ప్రస్తరేణ) ఆసనేన (పరిధినా) యః పరితః సర్వతో ధీయతే తేన (స్రుచా) యేన యజ్ఞః సాధ్యతే (వేద్యా) యస్యాం హూయతే తయా (చ) (బర్హిషా) ఉత్తమేన కర్మణా (ఋచా) స్తుత్యా ఋగ్వేదాదినా వా (ఇమమ్) పదార్థమయమ్ (యజ్ఞమ్) అగ్నిహోత్రాదికమ్ (నః) అస్మాన్ (నయ) (స్వః) సాంసారికం సుఖమ్ (దేవేషు) దివ్యేషు పదార్థేషు విద్వత్సు వా (గన్తవే) గన్తుం ప్రాప్తుమ్. ॥౬౩॥ అన్వయః :—హే విద్వంస్త్వం వేద్యా స్రుచా బర్హిషా ప్రస్తరేణ పరిధినర్చా చేమం యజ్ఞం దేవేషు గన్తవే స్వర్నో నయ. ॥౬౩॥ భావార్థః :—యే మనుష్యా! ధర్మేణ ప్రాప్తై ర్ద్రవ్యై ర్వేదరీత్యా చ సాఙ్గోపాఙ్గం యజ్ఞం సాధ్నువన్తి తే సర్వప్రాణ్యుపకారిణో భవన్తి. ॥౬౩॥

పదార్థము :—విద్వాంసుడా! నీవు, వేద్యా = హోమమొనర్చబడు వేదిచేతను, స్రుచా = హోమసాధనమగు స్రువ చేతను, బర్హిషా = ఉత్తమ క్రియచే, ప్రస్తరేణ = ఆసనముచే పరిధినా = అన్నివైపుల నుండి ధారణ మొనర్చు, యజుర్వేదముచే, చ = మఱియు, ఋచ = స్తుతి చేతను లేక, ఋగ్వేదాదులచేతను, ఇమమ్ = ఈపదార్థమయముచే అనగా ఉత్తమ భోజన యోగ్యములగు పదార్థములచే

హోమ మొనర్చబడు నీ, యజ్ఞమ్ = అగ్నిహోత్రాది యజ్ఞమును, దేవేషు = దివ్యపదార్థములందు, విద్వాంసులందు, గంతవే = పొందుటకై, స్వః = సాంసారిక సుఖమును, నః = మాకు, నయ = లభింపజేయుము. ॥౬౩॥

భావార్థము :—ఏ మానవులు ధర్మముచే పొందిన పదార్థములచేతను, వేదరీతిచేతను సాంగోపాంగముగ యజ్ఞమును సాధించుచున్నారో వారన్ని ప్రాణులకు ఉపకారమొనర్చు వారగుచున్నారు.

౧౧౧౩ యద్దత్తమిత్యస్య విశ్వకర్మర్షిః, యజ్ఞో దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః,
పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

యద్దత్తం యత్పరాదానం యత్పూర్తం యాశ్చ దక్షిణాః ।
తదగ్ని ర్వైశ్వకర్మణః స్వ ర్దేవేషు నో దధత్ ॥ ॥౬౪॥

యత్, దత్తమ్, యత్, పరాదానమితి పరా+దానమ్, యత్, పూర్తమ్, యాః, చ దక్షిణాః తత్, అగ్నిః, వైశ్వకర్మణ ఇతి వైశ్వ+కర్మణః, స్వః, దేవేషు, నః, దధత్.

పదార్థః :—(యత్)(దత్తమ్)సుపాత్రేభ్యః సమర్పితమ్(యత్) (పరాదానమ్)పరేభ్య ఆదానమ్(యత్)(పూర్తమ్)పూర్ణాం సామగ్రీమ్ (యాః) (చ) (దక్షిణాః)కర్మానుసారేణ దానాని(తత్) (అగ్నిః)పావక ఇవ గృహస్థో విద్వాన్(వైశ్వకర్మణః)విశ్వాని సమగ్రాణి కర్మాణి యస్య స ఏవ (స్వః)ఐన్ద్రియం సుఖమ్(దేవేషు)దివ్యేషు ధర్మ్యేషు వ్యవహారేషు(నః) అస్మాన్ (దధత్) దధాతు. ॥౬౪॥ అన్వయః :—హే గృహస్థ ! త్వయా యద్దత్తం యత్పరాదానం యత్పూర్తం యాశ్చ దక్షిణా దీయన్తే తత్స్వశ్చ వైశ్వకర్మణోఽగ్ని రివ భవాన్ దేవేషు నో దధత్. ॥౬౪॥
భావార్థః :—యే యాశ్చ ! గృహాశ్రమం చికీర్షేయు స్తే పురుషా స్తాః స్త్రియశ్చ వివాహాత్ ప్రాక్ ప్రాగల్భ్యాదిసామగ్రీం కృత్వైవ యువావస్థాయాం స్వయం వరం వివాహం కృత్వా ధర్మేణ దానాదానమానాదివ్యవహారం కుర్యుః. ॥౬౪॥

పదార్థము :—గృహస్థుడా ! నీచే, యత్ దత్తమ్ = మంచి ధర్మాత్ముల కేది ఇవ్వబడి యున్నదో, యత్ పరాదానమ్ = ఏది పరులనుండి గ్రహించబడి యున్నదో, యత్ పూర్తమ్ = ఏ పూర్ణ సామగ్రి యున్నదో, యాః చ దక్షిణాః = ఏ దక్షిణలు ఇవ్వబడుచున్నవో, తత్ = ఆ యన్నిటిని, స్వః = ఇంద్రియముల సుఖమును, వైశ్వకర్మణః అగ్నిః = సమస్త కర్మలు కలిగియున్న అగ్నివలె నున్న గృహస్థుడవు, విద్వాంసుడవు నగు నీవు, దేవేషు = దివ్యములు ధర్మసంబంధములు నగు వ్యవహారము లందు, నః = మమ్ము, దధత్ = స్థాపించుము. ॥౬౪॥

భావార్థము :—ఏ పురుషులు, ఏ స్త్రీలు, గృహాశ్రమ మొనరింప గోరుదురో వారు వివాహమునకు పూర్వమే ప్రగల్భమును అనగా బలపరాక్రమ పరిపూర్ణత్వాది సామగ్రిని సంపాదించు కొనియే యువావస్థయందు స్వయంవరవిధి ననుసరించి వివాహమాడి ధర్మముచే దానా దానములు, ఆదర గౌరవములు మొదలైన వ్యవహారము లొనర్చ వలయును. ॥౬౪॥ (౧౧౧౩)

౧౧౧౪ యత్ర ధారా ఇత్యస్య విశ్వకర్మర్షిః, యజ్ఞో దేవతా, విరాడనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః.
పున ర్మనుష్యాః కిం కుర్యు రిత్యాహ. మఱల మానవులు ఏమి చేయవలయును ?

యత్ర ధారా అనపేతా మధో ర్ఘృతస్య చ యాః ।
తదగ్ని ర్వైశ్వకర్మణః స్వ ర్దేవేషు నో దధత్ ॥ ॥౮౫॥

యత్ర, ధారాః, అనపేతా ఇత్యనప+ఇతాః, మధోః, ఘృతస్య, చ, యాః, తత్, అగ్నిః, వైశ్వకర్మణ ఇతి వైశ్వ+కర్మణః, స్వః, దేవేషు, నః, దధత్.

పదార్థః :-(యత్ర)యజ్ఞే(ధారాః)ప్రవాహాః(అనపేతాః)నాపేతాః పృథగ్భూతాః(మధోః)మధురగుణాన్వితస్య ద్రవ్యస్య (ఘృతస్య)ఆజ్యస్య(చ)(యాః)(తత్)తాభిః(అగ్నిః)పావకః(వైశ్వకర్మణః విశ్వాన్యఖిలాని కర్మాణి యస్మాత్ స ఏవ(స్వః)సుఖమ్(దేవేషు)దివ్యేషు వ్యవహారేషు(నః) అస్మభ్యమ్ (దధత్)దధాతి, దధాతే ర్లేటో రూపమ్. ॥౮౫॥ అన్వయః :-యత్ర మధో ర్ఘృతస్య చ యా అనపేతా ధారా విద్వద్భిః క్రియన్తే తద్వైశ్వకర్మణోఽగ్ని ర్నో దేవేషు స్వ ర్దధత్. ॥౮౫॥ భావార్థః:-యే మనుష్యాః వేద్యాదికం నిర్మాయ సుగన్ధి మిష్టాదియుక్తం బహుఘృత మగ్నౌ జుహ్వతి తే సర్వాన్ రోగా న్నిహత్యాతులం సుఖం జనయన్తి. ॥౮౫॥

పదార్థము :-యత్ర = ఏ యజ్ఞములో, మధోః = మధురాదిగుణ యుక్తములగు సుగంధిత ద్రవ్యముల యొక్కయు, చ ఘృతస్య = ఘృతము యొక్కయు, యాః అనపేతాః ధారాః = సంయుక్తములగు ఏ ప్రవాహములను విద్వాంసు లొనర్చుచున్నారో, తత్ = ఆ ధారలచే, వైశ్వకర్మణః = సకలకర్మలకు నిమిత్తమగు.అగ్నిః = అగ్ని,నః = మా కొఱకు,దేవేషు = దివ్య వ్యవహారములందు, స్వః = సుఖమును, దధత్ = ధారణమొనర్చుచున్నది. ॥౮౫॥

భావార్థము :-ఏ మానవులు వేద్యాదుల నిర్మించి సుగంధయుక్తములను, మిష్టాదులతోకూడిన అధిక ఘృతమును అగ్నియందు వ్రేల్చుచున్నారో వారన్ని రోగములను నివారించి అతుల సుఖమును కలిగించు చున్నారు. ॥౮౫॥ (౧౧౧౪)

---

౧౧౧౫ అగ్నిరస్మీత్యస్య దేవశ్రవో దేవవాతా ఋషీ. అగ్నిర్దేవతా. నిచృత్త్రిష్టుప్ఛన్దః. ధైవతః స్వరః.
యజ్ఞేన కిం జాయత ఇత్యాహ. యజ్ఞముచే నేమేమి యగును ?

అగ్ని రస్మి జన్మనా జాతవేదా ఘృతం మే చక్షు రమృతం మ ఆసన్ ।
అర్క స్త్రిధాతూ రజసో విమానోఽజస్రో ఘర్మో హవి రస్మి నామ ॥

అగ్నిః, అస్మి, జన్మనా, జాతవేదా ఇతి జాత+వేదాః, ఘృతమ్, మే,చక్షుః, అమృతం, మే, ఆసన్, అర్కః,త్రిధాతు రితి త్రి+ధాతుః, రజసః, విమాన, ఇతి వి+మానః, అజస్రః, ఘర్మః, హవిః, అస్మి, నామ. (66)

పదార్థః :-(అగ్నిః)పావక ఇవ(అస్మి)(జన్మనా) ప్రాదుర్భావేన (జాతవేదాః) యో జాతేషు విద్యతే సః(ఘృతమ్)ఆజ్యమ్(మే)మహ్యమ్(చక్షుః)దర్శకం ప్రకాశకమ్(అమృతమ్)అమృతాత్మకం భోజ్యం వస్తు(మే)మమ(ఆసన్)ఆస్యే(అర్కః)సర్వాన్ ప్రాణినోఽర్చన్తి యేన సః(త్రిధాతుః) త్ర

యో ధాతవో యస్మిన్ సః(రజసః)లోకసమూహస్య(విమానః)విమానయానమివ ధర్తా(అజస్రః)అజ స్రం గమనం విద్యతే యస్య సః. అత్రాన్యే ష్వపి దృశ్యత ఇత్యచ్ (ఘర్మః)జిఘ్రతి యేన సః ప్రకాశ ఇవ యజ్ఞః(హవిః)హోతవ్యం ద్రవ్యమ్(అస్మి)(నామ) ఖ్యాతిః. ॥౬౬॥ అన్వయః :- అహం జన్మనా జాతవేదా అగ్ని రివాస్మి.యథాఽగ్నేర్ఘృతం చక్షు రస్తి తథా మేఽస్తు.యథా పావకం సంస్కృతం హవి ర్హుతం సదమృతం జాయతే తథా మ ఆసన్ ముఖేఽస్తు, యథా త్రిధాతూ రజసో విమానోఽజస్రో ఘర్మోఽర్కో యస్య నామ సంశోధితం హవి శ్చాస్తి తథాఽహమస్మి. ॥౬౬॥ భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథాగ్ని ర్హుతం హవి ర్వాయౌ ప్రసార్య దుర్గన్ధం నివార్య సుగన్ధం ప్రకటయ్య రోగాన్ సమూలఘాతం నిహత్య సర్వాన్ ప్రాణినః సుఖయతి తథైవ మనుష్యై ర్భవితవ్యమ్. ॥౬౬॥

పదార్థము :- నేను, జన్మనా = జన్మచే, జాతవేదాః = ఉత్పన్న పదార్థములలో స్థితమైన, అగ్నిః అస్మి = అగ్నివలె ఉన్నాను. ఎటుల అగ్నికి, ఘృతమ్ = ఘృతాదులు, చక్షుః = ప్రకాశము లై యున్నవో, అటులనే. మే = నాకును నగుగాక ! ఎటు లగ్నియందు చక్కగ సంస్కరించ బడిన, హవిః = హవనము చేయదగు ద్రవ్యము హోమ మొనర్చబడినదై , అమృతమ్ = సర్వ రోగ నాశకము, ఆనందప్రదము నగుచున్నదో, అటులనే, మే = నా యొక్క, ఆసన్ = ముఖము నందు కలుగును గాక ! ఎటుల, త్రిధాతుః = సత్త్వ రజస్తమోగుణములు గలిగినది, రజసః విమా నః = లోక లోకాంతరములను విమానయానమువలె ధారణ మొనర్చునది, అజస్రః = నిరంతరము గమన శీలము, ఘర్మః = ప్రకాశమువలె సుగంధమును గ్రహించు నేయజ్ఞము, అర్కః = సకల ప్రాణులను అర్చించు సాధనమై యున్నదో. దేనికి, నామ = ప్రసిద్ధమైన, బాగుగ శోధించబడి హవన మొనర్చుటకు యోగ్యములగు పదార్థములున్నవో, అస్మి = అటులనే నేను ఉండెదను.॥౬౬॥

భావార్థము :- ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఎటు లగ్నియందు వ్రే ల్చబడిన హవిస్సు వాయువునందు వ్యాపించి, దుర్గంధమును నివారించి, సుగంధమును ప్రకటింప జేసి, రోగములను సమూలముగ నశింపజేసి, సకల ప్రాణులకు సుఖము చేకూర్చు చున్నవో అటు లనే సకల మానవు లుండవలయును. ॥౬౬॥ (౧౦౧౫)

---

౧౦౧౬ ఋచో నామేత్యస్య దేవశ్రవో దేవవాతా వృషీ, అగ్ని ర్దేవతా, ఆర్షీ జగతీ ఛందః, నిషాదః స్వరః. అథర్గాది వేదాధ్యయనేన కిం కార్యమిత్యుపదిశ్యతే. ఋగ్వేదాదుల జదివి యేమి చేయవలెను ?

ఋచో నామాస్మి యజూꣳషి నామాస్మి సామాని నామాస్మి ।
యే అగ్నయః పాఞ్చజన్యా అస్యాం పృథివ్యామధి ।
తేషామసి త్వముత్తమః ప్ర నో జీవాతవే సువ ॥ ॥౬౭॥

ఋచః, నామ, అస్మి, యజూꣳషి, నామ, అస్మి, సామాని, నామ, అస్మి, యే, అగ్నయః, పాఞ్చజన్యా ఇతి పాఞ్చజన్యాః, అస్యామ్, పృథివ్యామ్, అధి, తేషామ్, అసి, త్వమ్, ఉత్తమ ఇత్యుత్+తమః, ప్ర, నః, జీవాతవే, సువ.

పదార్థః :— (ఋచః) ఋగ్వేద శ్రుతయః (నామ) ప్రసిద్ధౌ (అస్మి) భవామి (యజూంషి) యజుర్మన్త్రాః (నామ) (అస్మి) (సామాని) సామవేదమన్త్రగానాని (నామ) (అస్మి) (యే) (అగ్నయః) ఆహవనీయాదయః పావకాః (పాఞ్చజన్యాః) పఞ్చజనేభ్యో హితాః. పఞ్చజనా ఇతి మనుష్య నా. నిఘం. ౨. ౩. (అస్యామ్) (పృథివ్యామ్) (అధి) ఉపరి (తేషామ్) (అసి) (త్వమ్) (ఉత్తమః) (ప్ర) (నః) అస్మాకమ్ (జీవాతవే) జీవనాయ (సువ) ప్రేరయ. ||౬౭|| అన్వయః :—హే విద్వన్ యోఽహమృచో నామాస్మి యజూంషి నామాస్మి సామాని నామాస్మి తస్మాన్మత్తో వేదవిద్యాం గృహాణ. యేఽస్యాం పృథివ్యాం పాఞ్చజన్యా అగ్నయోఽధిసన్తి తేషాం మధ్యే త్వముత్తమోఽసి స త్వం నో జీవాతవే శుభకర్మసు ప్రసువ.||౬౭||భావార్థః—యో మనుష్య ఋగ్వేదమధీతే స ఋగ్వేదీ యో యజుర్వేద మధీతే స యజుర్వేదీ యః సామవేద మధీతే స సామవేదీ యోఽథర్వవేదం చాధీతే సోఽథర్వవేదీ. యో ద్వౌ వేదావధీతే స ద్వివేదీ య స్త్రీన్ వేదానధీతే స త్రివేదీ యశ్చతురో వేదా నధీతే స చతుర్వేదీ యశ్చ కమపి వేదం నాఽదీతే స కామపి సంజ్ఞాం న లభతే. యే వేదవిద స్తేఽగ్నిహోత్రాదియజ్ఞైః సర్వహితం సంపాదయేయు ర్యత ఉత్తమా కీర్తిః స్యాత్. సర్వే ప్రాణినో దీర్ఘాయుషశ్చ భవేయుః. ||౬౭||

పదార్థము :—విద్వాంసుడా ! ఏ నేను. ఋచః = ఋక్కులయొక్క, నామ = ప్రసిద్ధకర్తను, అస్మి = అయి యున్నానో, యజూంషి నామ అస్మి = యజుర్వేదపు ప్రసిద్ధ కర్తను, సామాని = సామవేదపు మంత్రగానముయొక్క, నామ అస్మి = ప్రకాశ కర్తను అయియున్నానో అట్టి నానుండి వేద విద్యను గ్రహించుము. అస్యామ్ పృథివ్యామ్ = ఈ పృథివియందు, పాంచజన్యాః = మానవులకు హితకరములగు. యే అగ్నయః = ఏ యగ్నులు, అధి = సర్వోపరిగ నున్నవో, తేషామ్ = వాని మధ్య, త్వమ్ = నీవు.ఉత్తమః అసి = అత్యుత్తముడవు.ఆ నీవు, నః జీవాతవే = మాజీవనమునకై సత్కర్మలందు, ప్రసువ = ప్రేరేపించుము. ||౬౭||

భావార్థము :-ఋగ్వేదమును అధ్యయన మొనర్చువాడు ఋగ్వేది, యజుర్వేదాధ్యయన మొనర్చువాడు యజుర్వేది, సామవేదాధ్యయన మొనర్చువాడు సామవేది. అథర్వ వేదాధ్యాయి అథర్వవేది, రెంటిని చదువువాడు ద్వివేది, మూటిని చదువువాడు త్రివేది, నాలుగు వేదములను జదువువాడు చతుర్వేది యని యనబడుదురు. ఏ వేదమును అధ్యయన మొనరించని వానికి ఏ నామము లభించదు. వేదవిత్తులు వారికుత్తమ కీర్తి లభించునటులను, సకల ప్రాణులు దీర్ఘాయువులు కాగలుగునటులను, అగ్నిహోత్రాది యజ్ఞములచే సర్వజనహితమును సమకూర్చవలయును. ||౬౭||

---

౧౦౧౩ వార్త్రహత్యాయేత్యస్య ఇన్ద్ర ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

సేనాధ్యక్షః కథం విజయీ భవే దిత్యాహ. సేనాధ్యక్షు డెటుల విజయవంతుడు కావలయును?

వార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యాయ చ । ఇన్ద్ర త్వా వర్తయామసి॥

వార్త్రహత్యాయేతి వార్త్ర+హత్యాయ, శవసే, పృతనాషాహ్యాయ, పృతనాసహ్యాయేతి పృతనా+సహ్యాయ, చ, ఇన్ద్ర, త్వా, ఆ, వర్తయామసి. (68)

పదార్థః :—(వార్త్రహత్యాయ) విరుద్ధభావేన వర్తతేఽసౌ వృత్రః వృత్ర ఏవ వార్త్రః. వార్త్రస్య వర్తమానస్య శత్రోర్హత్యా హననం తత్ర సాధు స్తస్మై (శవసే) బలాయ (పృతనాషాహ్యాయ)

యే మనుష్యాః పృతనాః సహన్తే తే పృతనా సాహ స్తేషు సాధవే(చ) (ఇన్ద్ర)పరమైశ్వర్య యుక్త సేనేశ (త్వా) త్వామ్ (ఆ) సమన్తాత్ (వర్తయామసి) ప్రవర్తయామః ॥౬౮॥ అన్వయః :— హే ఇన్ద్ర! యథా వయం వార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యాయ తేనాన్యేన యోగ్యసాధనేన చ త్వా ఽఽవర్తయామసి తథా త్వం వర్తస్వ. ॥౬౮॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యో విద్వాన్ సూర్యో మేఘ మివ శత్రూన్ హన్తుం శూరవీరసేనాం సత్కరోతి స సతతం విజయీ భవతి. ॥౬౮॥

పదార్థము :—ఇంద్ర = పరమైశ్వర్యయుక్తా ! సేనాపతీ ! మే మెటుల, వార్త్ర హత్యాయ = విరుద్ధభావములతో నున్న శత్రువును వధించుటయందు కుశలుడు. శవసే = ఉత్తమ బలముగల వాడు, పృతనాసాహ్యాయ = శత్రు సేనల బలమును సహించగలిగిన వాడు నగు వానికై, చ = మఱియు నితర యోగ్య సాధనములు కలిగియున్న వాడవగు, త్వా = నిన్ను, ఆవర్తయామసి = నలుదిశల నుండి యథాయోగ్యముగ ప్రవర్తింప జేయుదుమో, అటులనే నీవునుయథాయోగ్యముగ వర్తించుము.

భావార్థము :—వాచక లుప్తోపమాలంకార మిందున్నది. ఏ విద్వాంసుడు సూర్యుడు మేఘమును సంహరించుచున్నటుల శత్రువులను చంపుటకు శూరవీరుల సేనను సత్కరించుచున్నాడో, అతడు సదా విజయి యగుచున్నాడు. ॥౬౮॥ (౧౦౧౪)

౧౧౦౦ా సహదానుమిత్యస్యేన్ద్రవిశ్వామిత్రా వృషీ, ఇన్ద్రో దేవతా, ఆర్షీత్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

పునర్నరైః కథం భవితవ్య మిత్యుప దిశ్యతే. మానవు లెటు లుండవలయును ?

సహదానుం పురుహూత క్షియన్త మహస్తమిన్ద్ర సంపిణక్ కుణారుమ్ ।
అభి వృత్రం వర్ధమానం పియారు మపాద మిన్ద్ర తవసా జఘన్థ॥౬౯॥

సహదానుమితి సహ + దానుమ్, పురుహూతేతి పురు + హూత, క్షియన్తమ్, అహస్తమ్, ఇన్ద్ర, సమ్, పిణక్, కుణారుమ్, అభి, వృత్రమ్, వర్ధమానమ్, పియారుమ్, అపాదమ్, ఇన్ద్ర, తవసా, జఘన్థ. (69)

పదార్థః :—(సహదానుమ్) యః సహైవ దదాతి తమ్ (పురుహూత) బహుభి స్సజ్జనైః సత్కృత (క్షియన్తమ్) గచ్ఛన్తమ్ (అహస్తమ్) అవిద్యమానౌ హస్తౌ యస్య తమ్. (ఇన్ద్ర) శత్రు విదారక సేనేశ (సమ్) (పిణక్) పినష్టి (కుణారుమ్) శబ్దయన్తమ్. అత్ర క్వణ శబ్దే ఇత్యస్మాద్ధాతో రౌణాదిక ఆరుః ప్రత్యయః. (అభి) (వృత్రమ్) మేఘ మివ (వర్ధమానమ్) (పియారుమ్) పానకారకమ్ (అపాదమ్) పాదేన్ద్రియ రహితమ్ (ఇన్ద్ర) సభేశ (తవసా) బలేన. తవ ఇతి బల నా . . . నిఘం. ౨. ౯ (జఘన్థ) జహి. ॥౬౯॥ అన్వయః :—హే పురుహూతేన్ద్ర యథా సూర్యః సహదానుం క్షియన్తం కరుణారు మహస్తం పియారు మపాద మభివర్ధమానం వృత్రం సమ్పిణక్ తథా హే ఇన్ద్ర శత్రూం స్తవసా జఘన్థ ॥౬౯॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యే మనుష్యాః సూర్యవత్ప్రతాపినో భవన్తి తేఽ జాతశత్రవో జాయన్తే ॥౬౯॥

పదార్థము :—పురుహూత = అనేక విద్వాంసులతో సత్కారము పొందినవాడా ! ఇంద్ర = శత్రువులను నశింపజేయు సేనాపతీ ! ఎటుల సూర్యుడు, సహదానుమ్ = తోడుపడునది, క్షియం

తమ్ = ఆకాశమున నివసించునది. కుషారుమ్ = శబ్దమొనర్చునది, అహస్తమ్ = హస్తములులేనిది. వియారుమ్ = పానమొనర్చునది, అపాదమ్ = పాదేంద్రియరహితము. అభివర్ధమానమ్ = అన్ని వైపులనుండి వృద్ధిపొందినదియు నగు, వృత్రమ్ = మేఘమును, సంపిణక్ = బాగుగ చూర్ణముగ నొనర్చుచున్నాడో, అటులనే, ఇంద్ర = సభాపతీ! నీవు శత్రువులను, తపసా = బలముతో, జఘన్థ = సంహరించుము. ॥౬౯॥

భావార్థము :—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. ఏ మానవులు సూర్య సదృశ ప్రతాపము గలవారగుదురో వారు శత్రురహితు లగుచున్నారు. ॥౬౯॥ (౧౦౧౮)

---

౧౦౧౯ వి న ఇత్యస్య శాస ఋషిః, ఇంద్రో దేవతా, నిచృదనుష్టుప్ ఛందః, గాంధారః స్వరః,
అథ సేనాపతిః కీదృశో భవేదిత్యుపదిశ్యతే. సేనాపతి యెటు లుండ వలయును ?

వి న ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః ।
యోఽఅస్మాఁ౨॥ ఽఅభిదాస త్యధరం గమయా తమః ॥ ॥౭౦॥

వి, నః, ఇన్ద్ర, మృధః, జహి, నీచా, యచ్ఛ, పృతన్యతః, యః, అస్మాన్, అభిదాసతీత్యభి+దాసతి, అధరమ్, గమయ, తమః. (70)

పదార్థః :—(వి) (నః) అస్మాకమ్ (ఇన్ద్ర) సేనేశ (మృధః) మర్ద్యన్తే శత్రవో భవన్తి యేషు తాన్ సంగ్రామాన్, మృధ ఇతి సంగ్రామ నా . . . నిఘం. ౨. ౧౭. (జహి) (నీచా) న్యగ్భూతాన్నమ్రాన్. అత్ర సుపాం సు లుగిత్యాకారః (యచ్ఛ) నిగృహ్ణీహి (పృతన్యతః) ఆత్మనః పృతనాం సేనామిచ్ఛతః (యః) విరోధీ (అస్మాన్) (అభిదాసతి) అభిముఖేనోపక్షయతి (అధరమ్) అధోగతిమ్ (గమయ) ప్రాపయ. అత్రాన్యేషా మపీతి దీర్ఘః (తమః) అన్ధకారం కారాగృహమ్. ॥౭౦॥

అన్వయః :—హే ఇన్ద్ర! త్వం మృధో వి జహి పృతన్యతో నః శత్రూన్నీచా యచ్ఛ.యోఽస్మానభిదాసతి తమధరం తమో గమయ. ॥౭౦॥ భావార్థః :—సేనేశేన సంగ్రామా జేతవ్యా స్తైన నీచకర్మకారిణాం నిగ్రహః కర్తవ్యో రాజప్రజా విరోధకారయితా భృశం దణ్డనీయశ్చ. ॥౭౦॥

పదార్థము :—ఇంద్ర = ఓ ఇంద్ర! పరమశక్తివంతుడవగు నో సేనాపతీ : నీవు, మృధః = సంగ్రామములను, విజహి = విశేషించి జయించుము. పృతన్యతః = సేనలను కలిగియున్న, నః = మా శత్రువులను, నీచా = నీచస్థితిగల [లొంగిన] వారిగ, యచ్ఛ = ఒనరించుము. యః = ఎవడు, అస్మాన్ = మమ్ము, అభిదాసతి = నష్టమొనర్ప గోరుచున్నాడో అతనికి, అధరమ్ = అధోగతిరూపమగు, తమః = అంధకారము. గమయ = లభింపజేయుము. ॥౭౦॥

భావార్థము :—సేనాపతి సంగ్రామములందు జయము పొందవలయును. అట్టి విజయములచే నీచ కర్మ లొనర్చువారిని నిరోధించవలయును, రాజునకు ప్రజలకు విరోధమొనర్చు వానిని మిక్కుటముగ దండించవలయును. ॥౭౦॥ (౧౦౧౯)

---

౧౦౨౦ మృగో నేత్యస్య జయ ఋషిః, ఇంద్రో దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.
రాజజనైః కీదృశై ర్భవితవ్య మిత్యుప దిశ్యతే. రాజపురుషు లెటులుండ వలయును ?

మృగో న భీమః కుచరో గిరిష్ఠాః పరావత ఆ జగన్థా పరస్యాః ।

సృకꣳ సꣳశాయ పవిమిన్ద్ర తిగ్మం వి శత్రూన్తాఢి విమృధో నుదస్వ ॥ ॥౭౧॥

మృగః, న, భీమః, కుచర ఇతి కు+చరః, గిరిష్ఠాః, గిరిస్థా ఇతి గిరి+స్థాః పరావతః, ఆ, జగన్థ. పరస్యాః, సృకమ్, సꣳశాయేతి సమ్ + శాయ, పవిమ్, ఇన్ద్ర, తిగ్మమ్, వి, శత్రూన్, తాఢి, వి, మృధః, నుదస్వ. (71)

పదార్థః :—(మృగః) మృగేన్ద్రః సింహః (న) ఇవ (భీమః) బిభేత్యస్మాత్ సః (కుచరః) యః కుత్సితాం గతిం చరతి సః (గిరిష్ఠాః) యో గిరౌ తిష్ఠతి సః (పరావతః) దూరదేశాత్(ఆ) సమన్తాత్ (జగన్థ) గచ్ఛ. అత్ర పురుషవ్యత్యయః. అన్యేషా మపీతి దీర్ఘశ్చ (పరస్యాః) శత్రూణాం సేనాయా ఉపరి (సృకమ్)వజ్రతుల్యం శస్త్రమ్. సృక ఇతి వజ్ర నా . . ., నిఘం . . ౨. ౨౦ (సంశాయ) సమ్యక్ సూక్ష్మ బిలాన్ కృత్వా (పవిమ్) పునాతు దుష్టాన్ దణ్డయిత్వా యేన తమ్ (ఇన్ద్ర) సేనాధ్యక్ష (తిగ్మమ్) తీక్ష్ణీకృతమ్ (వి) (శత్రూన్) (తాఢి) ఆ జహి (వి) (మృధః) (నుదస్వ) ॥౭౧॥

అన్వయః :—హే ఇన్ద్ర!త్వం కుచరో గిరిష్ఠా భీమో మృగో న పరావత ఆజగన్థ పరస్యాస్తిగ్మం పవిం సృకం సంశాయ శత్రూన్ వితాఢి మృధో వినుదస్వ చ. ॥౭౧॥ భావార్థః :—యే సేనాపురుషాః సింహవత్ పరాక్రమ్య తీక్ష్ణైః శస్త్రైః శత్రుసేనాఙ్గాని ఛిత్వా సంగ్రామాన్ విజయన్తే తేఽతులాం ప్రశంసాం ప్రాప్నువన్తి నేతరే క్షుద్రాశయా భీరవః. ॥౭౧॥

పదార్థము :—ఇంద్ర = సేనాపతీ : నీవు, కుచరః = కుటిలగతి గలవాడవు. గిరిష్ఠాః = పర్వత వాసివి, భీమః = భయంకరుడవు, మృగః న = సింహమువలె. పరావతః = దూరముననున్న శత్రువులను, ఆజగన్థ = నలుదెసలనుండి ముట్టడించుము, పరస్యాః = శత్రుసేనమీద తిగ్మమ్, పవిమ్ = అతి తీవ్రమును, పవిత్రమొనర్చునదియు, సృకమ్ = వజ్రతుల్యమునైన అస్త్రమును, సంశాయ = బాగుగా పదునుబెట్టి,శత్రూన్ = శత్రువులను,వితాఢి = దండించుము. మఱియు, మృధః = సంగ్రామములో, వి నుదస్వ = జయించుము, మంచి కర్మలందు ప్రేరేపించుము. ॥౭౧॥

భావార్థము :—ఏ సైనికులు సింహమువలె పరాక్రమించి, తీక్ష్ణశస్త్రాస్త్రములచే శత్రుసేనలను చెండాడి యుద్ధములందు విజయము పొందుచున్నారో వారు అనుపమప్రశంసనీయు లగుచున్నారు. ఇతర క్షుద్రాశయులు విజయసుఖమును ఎన్నటికి పొందజాలరు. ॥౭౧॥ (౧౦౨౦)

---

౧౦౨౧ వైశ్వానరో న ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్ని ర్దేవతా, ఆర్షీ గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

వైశ్వానరో న ఊతయఽఆ ప్ర యాతు పరావతః । అగ్ని ర్నః సుష్టుతీ రుప ॥

వైశ్వానరః, నః, ఊతయే, ఆ, ప్ర, యాతు, పరావత ఇతి పరా+వతః, అగ్నిః, నః, సుష్టుతీః, సుస్తుతీ రితి సు+స్తుతీః, ఉప. (72)

పదార్థః :—(వైశ్వానరః) విశ్వేషు నరేషు యో రాజతే స ఏవ (నః) అస్మాకమ్ (ఊతయే) రక్షాద్యాయ (ఆ) (ప్ర) (యాతు) ప్రాప్నోతు (పరావతః) దూరదేశాత్ (అగ్నిః) సూర్యః (నః) అస్మాకమ్ (సుష్టుతీః) యా శోభనాః స్తుతయ స్తాః (ఉప). ॥౭౨॥ అన్వయః :—హే సేనేశ

సభేశ! యథా వైశ్వానరోఽగ్నిః సూర్యః పరావతః సర్వాన్ పదార్థాన్ ప్రాప్నోతి తథా భవానత్ర యేన ఆ ప్రయాతు. యథాఽగ్నిర్విద్యుత్ సంహితాఽస్తి తథా త్వం నః సుష్టుతీః సుశృణు. ॥౨౨॥ భావార్థః :— అత్ర వాచకలుప్తోపమాలంకారః. యః సూర్యవద్దూరస్థోఽపి న్యాయేన సర్వాన్ పదార్థాన్ ప్రకాశయతి యథా చ దూరస్థోఽపి సద్గుణాఢ్యో జనః ప్రశస్యతే తథా రాజపురుషైర్భవితవ్యమ్.

పదార్థము :— సేనేశా : సభేశా ! ఎటుల, వైశ్వానరః = సంపూర్ణ నరులలో వ్యాపించి యుండియున్న. అగ్నిః = సూర్యరూపాగ్ని, పరావతః = దూరదేశస్థ సకల పదార్థములను పొందు చున్నదో అటులనే నీవు. ఊతయే = రక్షణలకై, నః = మా సమీపమున. ఆ ప్రయాతు = చక్కగ లభించుము. ఎటుల విద్యుత్తు అన్నిటిలో వ్యాపకమై సమీపమున ఉండుచున్నదో అటులనే. నః = మాయొక్క, సుష్టుతీః = ఉత్తమస్తుతులను. ఉప = బాగుగ వినుము. ॥౨౨॥

భావార్థః :- వాచక లుప్తోపమాలంకారము ఉండుచున్నది. ఎవడు దూరముగనుండియు సూర్యుని వలె న్యాయముగ సకల పదార్థములను ప్రకాశపఱచునో, ఎటుల దూరస్థుడైనను సద్గుణాఢ్యుడు ప్రశంసితుడగుచున్నాడో, అటులనే రాజపురుషు లుండవలయును. ॥౨౨॥ (౧౦౨౧)

---

౧౦౨౨ పృష్టో దివీత్యస్య కుత్స ఋషిః, అగ్నిర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః,
పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమునే చెప్పెను.

పృష్టో దివి పృష్టోఽఅగ్నిః పృథివ్యాం పృష్టో విశ్వా ఓషధీ రావివేశ ।
వైశ్వానరః సహసా పృష్టో అగ్నిః స నో దివా స రిషస్పాతు నక్తమ్ ॥

పృష్టః, దివి, పృష్టః. అగ్నిః, పృథివ్యామ్, పృష్టః, విశ్వాః, ఓషధీః, ఆ,వివేశ, వైశ్వానరః. సహసా, పృష్టః, అగ్నిః, సః, నః, దివా, సః, రిషః, పాతు, నక్తమ్.

పదార్థః :-(పృష్టః) జ్ఞాతు మిష్టః (దివి) సూర్యే (పృష్టః) (అగ్నిః) ప్రసిద్ధః పావకః (పృథివ్యామ్) (పృష్టః) (విశ్వాః) అఖిలాః (ఓషధీః) సోమ యవాద్యాః (ఆ) (వివేశ) విష్టోఽస్తి (వైశ్వానరః)విశ్వస్య నేతా స ఏవ (సహసా)బలేన(పృష్టః)(అగ్నిః)విద్యుత్(సః)(నః)అస్మాన్ (దివా) దివసే(సః)(రిషః)హింసకాత్(పాతు)రక్షతు(నక్తమ్)రాత్రౌ.॥౨౩॥ అన్వయః :-మనుష్యై ర్యో దివి పృష్టోఽగ్నిః పృథివ్యాం పృష్టోఽగ్ని ర్జలే వాయౌ చ పృష్టోఽగ్నిః సహసా వైశ్వానరః పృష్టోఽగ్ని ర్విశ్వా ఓషధీ రావివేశ స దివా స చ నక్తం యథా పాతి తథా సేనేశో భవానస్మాన్ రిషః సతతం పాతు. ॥౨౩॥ భావార్థః :—యే మనుష్యా ! ఆకాశస్థం సూర్యం పృథివీస్థం జ్వలితం సర్వపదార్థవ్యాపినం విద్యుదగ్నిం చ విద్వద్భ్యో నిశ్చిత్య కార్యేషు సంయుఞ్జతే తే శత్రుభ్యో నిర్భయా జాయన్తే. ॥౨౩॥

పదార్థము :—మానవులచే, దివి = ప్రకాశస్వరూపుడగు సూర్యుని యందు, పృష్టః అగ్నిః = తెలుసుకోదగిన ఏ యగ్ని, పృథివ్యామ్ = పృథివియందు,పృష్టః = గ్రహించ వలసిన ఏ యగ్ని, జలవాయువులందు,పృష్టః = తెలుసుకోదగిన ఏ పావకము,సహసా = బలాది గుణములతో గూడిన, వైశ్వానరః = విశ్వమున ప్రకాశమానము, పృష్టః అగ్నిః = తెలుసుకోదగినది విద్యుద్రూపమునైన యే యగ్ని, విశ్వాః ఓషధీః = సకలౌషధులందు, ఆ వివేశ = ప్రవేశించుచున్నదో, దివా = దినమందును, సః = ఆ యగ్ని, నక్తమ్ = రాత్రియందును ఎటుల రక్షించు చున్నదో అటులనే సేనాపతివైన నీవు, నః = మమ్ము, రిషః = హింసకులనుండి నిరతము, పాతు = రక్షించుము. ॥౨౩॥

భావార్థము :—ఏ మానవులు ఆకాశస్థసూర్యుని, పృథివీస్థజ్వలితమును, సకల పదార్థములందు వ్యాపకము నగు విద్యుదగ్నిని విద్వాంసులనుండి నిశ్చయించుకొని కార్యములందు సంయుక్త పఱచు చున్నారో వారు శత్రువులనుండి నిర్భయులగుచున్నారు. ॥౨౩॥ (౧౦౨౨)

౧౦౨౩ అశ్యామేత్యస్య భరద్వాజ ఋషిః. అగ్ని ర్దేవతా. నిచృత్త్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.
అథ ప్రజారాజజనై రితరేతరం కిం కార్య మిత్యాహ.
ప్రజలు రాజపురుషులు పరస్పరమెటుల మెలగవలయును?

అశ్యామ తం కామమగ్నే తవోతీ అశ్యామ రయిꣳ రయివః సువీరమ్,
అశ్యామ వాజ మభి వాజయన్తోఽశ్యామ ద్యుమ్నమజరాజరం తే॥ ॥౨౪॥

అశ్యామ, తమ్, కామమ్, అగ్నే, తవ, ఊతీ, అశ్యామ రయిమ్, రయివ ఇతి రయి+వః, సువీరమితి సు+వీరమ్, అశ్యామ, వాజమ్, అభి, వాజయన్తః, అశ్యామ, ద్యుమ్నమ్, అజర, అజరమ్, తే. (74)

పదార్థః :—(అశ్యామ)ప్రాప్నుయామ(తమ్)(కామమ్) (అగ్నే)యుద్ధవిద్యావిత్సేనేశ (ఊతీ) రక్షాద్యయా క్రియయా. అత్ర సుపాం సు లుగితి పూర్వసవర్ణః(అశ్యామ)(రయిమ్) రాజ్యశ్రియమ్ (రయివః)ప్రశస్తా రయయో విద్యన్తే యస్య తత్సమ్బుద్ధౌ. అత్ర ఛన్దసీర ఇతి మస్య వః. (సువీరమ్)శోభనా వీరాః ప్రాప్యన్తే యస్మాత్తమ్ (అశ్యామ)(వాజమ్)సఙ్గ్రామవిజయమ్(అభి) (వాజయన్తః)(అశ్యామ)(ద్యుమ్నమ్)యశో ధనం వా(అజర)జరాదోషరహిత(అజరమ్) జరాదోషరహితమ్ (తే)తవ. ॥౨౪॥ అన్వయః :—హే అగ్నే ! వయం తవోతీ తం కామ మశ్యామ. హే రయివః సువీరం రయి మశ్యామ వాజయన్తో వయం వాజ మభ్యశ్యామ, హే అజర తేఽజరం ద్యుమ్నః మశ్యామ. ॥౨౪॥ భావార్థః :—ప్రజాస్థై ర్మనుష్యై రాజపురుషరక్షయా రాజపురుషైః ప్రజాజనరక్షణేన చ పరస్పరం సర్వే కామా ప్రాప్తవ్యాః. ॥౨౪॥

పదార్థము :—అగ్నే = యుద్ధవిద్యనెఱిగిన సేనాపతీ ! మేము, తవ = నీ యొక్క, ఊతీ = రక్షాది క్రియలచే, తమ్ కామమ్ = ఆ కామనను, అశ్యామ = పొందుదుము గాక ! రయివః = ప్రశంసిత ధనవంతుడా ! సువీరమ్ = శ్రేష్ఠవీరులను లభింపజేయు, రయిమ్ = ధనమును, అశ్యామ పొందుదుము గాక ! వాజయంతః = సంగ్రామ మొనర్చుచున్న, ఒనరింపజేయుచున్న మేము, వాజమ్ = సాంగ్రామిక విజయమును, అభ్యశ్యామ = చక్కగా పొందుదుము గాక ! అజర = వృద్ధత్వ రహితుడవైన సేనాపతీ ! మేము, తే = నీ ప్రతాపముచే, అజరమ్ = అక్షయములగు ద్యుమ్నమ్ = ధనకీర్తులను, అశ్యామ = పొందుదుము గాక ! ॥౨౪॥

భావార్థము :—ప్రజలు రాజపురుషుల రక్షచేతను, రాజపురుషులు ప్రజల రక్షణచేతను పరస్పరము ఇష్టకామములను పొందుదురు గాక ! ॥౨౪॥ (౧౦౨౩)

౧౦౨౪ వయ మిత్యస్యోత్కీల ఋషిః, అగ్ని ర్దేవతా, ఆర్షీత్రిష్టుప్ఛందః, ధైవతః స్వరః.
పురుషార్థేన కిం సాధ్య మిత్యాహ. పురుషార్థముతో నేమి సాధించవలయును ?

వయం తే అద్య రరిమా హి కామ ముత్తానహస్తా నమసోపసద్య ।

యజిష్ఠేన మనసా యక్షి దేవానస్రేధతా మన్మనా విప్రో౽అగ్నే ॥

వయమ్, తే, అద్య, రరిమ, హి, కామమ్, ఉత్తానహస్తా ఇత్యుత్తాన+హస్తాః, నమసా, ఉపసద్యేత్యుప+సద్య, యజిష్ఠేన, మనసా, యక్షి, దేవాన్, అస్రేధతా, మన్మనా, విప్రః, అగ్నే. (75)

పదార్థః :–(వయమ్)(తే)తవ(అద్య)అస్మిన్దినే (రరిమ) దద్మః. రా దానే లిట్. అన్యేషామపి దృశ్యత ఇతి దీర్ఘః(హి)ఖలు(కామమ్)(ఉత్తానహస్తాః) ఉత్తానా ఊర్ధ్వగతా వభయదాతారౌ హస్తౌ యేషాం తే(నమసా)సత్కారేణ(ఉపసద్య)సామీప్యం ప్రాప్య (యజిష్ఠేన) అతిశయేన యష్టృ సంగన్తృ తేన(మనసా)విజ్ఞానేన(యక్షి)యజసి(దేవాన్) విదుషః (అస్రేధతా)ఇతస్తతో గమనరహితేన స్థిరేణ (మన్మనా)యేన మన్యతే విజానాతి తేన (విప్రః)మేధావీ(అగ్నే)విద్వన్. ॥౭౫॥ అన్వయః :–హే అగ్నే ! ఉత్తానహస్తా వయం తే నమసోపసద్యాద్య కామం హి రరిమ యథా విప్రో౽స్రేధతా మన్మనా యజిష్ఠేన మనసా దేవాన్ యజతి సంగచ్ఛతే యథా చ త్వం యక్షి తథా వయ మపి యజేమ. ॥౭౫॥ భావార్థః :–యే మనుష్యాః పురుషార్థేనాలంకామాః స్యుస్తే విద్వత్సంగే నైతత్ ప్రాప్తుం శక్నుయుః. ॥౭౫॥

పదార్థము :–అగ్నే = విద్వాంసుడా ! ఉత్తానహస్తాః = ఉత్కృష్టముగ నభయ మొసగు హస్తములు గలవాడా ! వయమ్ = మేము, తే నమసా = నీ సత్కారముచే, ఉపసద్య = సమీపమును పొంది. అద్య = నేడే, కామమ్ = కామనను,హి = నిశ్చయముగ,రరిమ = యిచ్చుచున్నాము ఎటుల,విప్రః = బుద్ధిమంతుడు అస్రేధతా = చంచల రహితము.మన్మనా = తెలిసికొనుసాధనము, యజిష్ఠేన = అతిశయము సంయుక్తమునగు,మనసా = చిత్తముచే, దేవాన్ = విద్వాంసులను, శుభ గుణములను పొందు చున్నాడో, మఱియు నెటుల నీవు,యక్షి = శుభ కార్యములందు పాలుగొందువో అటులనే మేమును సంగతమొనర్చెదము గాక ! ॥౭౫॥

భావార్థము:–ఏ మానవులు పురుషార్థముచే పూర్ణకామనలు గలవారగుదురో వారు విద్వత్సంగమున నీ విషయమును పొందుటకు సమర్థు లగుచున్నారు. ॥౭౫॥ (౧౦౨౪)

---

౧౦౨౫ ధామచ్ఛదగ్ని రిత్యస్యోత్కీల ఋషిః, విశ్వే దేవాః దేవతాః, నిచృదనుష్టుప్ఛందః, గాంధారః స్వరః.

అథ సర్వవిద్వత్కర్తవ్యమాహ. సకల విద్వాంసుల కర్తవ్యమును జెప్పెను.

ధామచ్ఛదగ్ని రిన్ద్రో బ్రహ్మా దేవో బృహస్పతిః ।
సచేతసో విశ్వే దేవా యజ్ఞం ప్రావన్తు నః శుభే ॥ ॥౭౬॥

ధామచ్ఛదితి ధామ+ఛత్, అగ్నిః, ఇన్ద్రః, బ్రహ్మా, దేవః, బృహస్పతిః. సచేతస ఇతి స+చేతసః, విశ్వే, దేవాః, యజ్ఞమ్, ప్ర, అవన్తు, నః, శుభే. (76)

పదార్థః :–(ధామచ్ఛత్)యో ధామాని ఛాదయతి సంవృణోతి సః(అగ్నిః)విద్వాన్ (ఇన్ద్రః) పరమైశ్వర్యవాన్(బ్రహ్మా)చతుర్వేదవిత్(దేవః)విద్యాదాతా(బృహస్పతిః) అధ్యాపకః (సచేతసః) యే చేతసా ప్రజ్ఞయా సహ వర్తన్తే(విశ్వే)సర్వే(దేవాః)విద్వాంసః(యజ్ఞమ్)ఉక్తమ్ (ప్ర) (అవన్తు) కామయన్తామ్(నః)అస్మాకమ్(శుభే)కల్యాణాయ. ॥౭౬॥ అన్వయః :–హే మనుష్యాః! దేవో ధామచ్ఛదగ్నిరిన్ద్రో బ్రహ్మా బృహస్పతి శ్చేమే సచేతసో విశ్వేదేవాః నః శుభే యజ్ఞం ప్రవన్తు.

॥౭౯॥ భావార్థః :-సర్వే విద్వాంసః సర్వేషాం ...భాయ సతతం సత్యోపదేశాన్ కుర్వన్తు.

పదార్థము :-మానవులారా ! దేవః = విద్వాంసుడు, ధామచ్ఛత్ = జన్మమును స్థానమును నామమును విస్తృత పఱచువాడు, అగ్నిః = పావకుడు, ఇంద్రః = విద్యుత్తుల్యులగు మంత్రి మఱియు రాజు, బ్రహ్మా = చతుర్వేదముల నెఱుగువాడు, బృహస్పతిః = వేదవాణిని పఠన పాఠములచే పాలించువాడు, సచేతసః = విజ్ఞానవంతులగు, విశ్వే దేవాః = ఈ సకల విద్వాంసులు, నః = మా యొక్క, శుభే = కల్యాణమునకై, యజ్ఞమ్ = విజ్ఞానయోగ క్రియను, ప్ర అవన్తు = చక్కగ కామించెదరు గాక ! ॥౭౮॥

భావార్థము :-విద్వాంసు లందరు మనుష్యాది సకల ప్రాణుల కల్యాణార్థము నిరంతరము సత్యోపదేశ మొనర్చెదరు గాక ! ॥౭౯॥

---

౧౦-౭౭ త్వమిత్యస్యోశనా ఋషిః, విశ్వే దేవాః దేవతాః, నిచృదనుష్టుప్ఛందః, గాంధారః స్వరః
అథ సభేశ సేనేశయోః కర్తవ్య మాహ. సభాపతి సేనాపతుల కర్తవ్యము జెప్పెను.

త్వం యవిష్ఠ దాశుషో నౄఀః పాహి శృణుధీ గిరః । రక్షా తోక ముత త్మనా॥

త్వమ్, యవిష్ఠ, దాశుషః, నౄన్, పాహి, శృణుధి,గిరః,రక్ష,తోకమ్,ఉత,త్మనా.

పదార్థః :-(త్వమ్)సభేశ(యవిష్ఠ)అతిశయేన యువన్ (దాశుషః) విద్యాదాతౄన్ (నౄన్) అధ్యాపకాన్ మనుష్యాన్(పాహి)(శృణుధి)అత్రాన్యేషా మపి దృశ్యత ఇతి దీర్ఘః(గిరః)విదుషాం విద్యా సుశిక్షితా వాచః(రక్ష)అత్ర ద్వ్యచోఽత స్తిఙ ఇతి దీర్ఘః. (తోకమ్) పుత్రాదికమ్ (ఉత)(త్మనా) ఆత్మనా.॥౭౭॥అన్వయః:-హే యవిష్ఠ రాజన్! త్వం దాశుషో నౄన్ పాహ్యేతేషాం గిరః శృణుధి. యో వీరో యుద్ధే మ్రియేత తస్య తోకం త్మనా రక్షోతాపి స్త్రియాదికం చ. ॥౭౭॥ భావార్థః :- సభేశ సేనేశయో ర్ద్వే కర్మణీ అవశ్యం కర్తవ్యే స్త ఏకం విదుషాం పాలనం తదుపదేశ శ్రవణఞ్చ ద్వితీయం యుద్ధే హతానా మపత్యస్త్ర్యాదిపాలనఞ్చైవం సమాచరతాం పురుషాణాం సదైవ విజయః శ్రీః సుఖాని చ భవ న్తీతి విద్వద్భి ర్ధ్యేయమ్. ॥౭౭॥

పదార్థము :-యవిష్ఠ = పూర్ణయువావస్థను పొందిన రాజా ! త్వమ్ = నీవు, దాశుషః = విద్యా దాతవు, నౄన్ పాహి = మానవులను రక్షించుము. మఱియు వీరియొక్క,గిరః = విద్యాశిక్షాయుక్త వాణులను, శృణుధీ = వినుము. యుద్ధములందు ఏవీరులు చనిపోవుదురో వారియొక్క, తోకమ్ = పసిపిల్లలనుఉత = మఱియు భార్యాదులను, త్మనా = ఆత్మతో, రక్ష = రక్షించుము. ॥౭౭॥

భావార్థము:-సభకు సేనాధిపతులకు రెండు పనులు తప్పక చేయ వ:సియున్నది.ఒకటి విద్వాం సులను పాలించుట, వారి యుపదేశములను వినుట, రెండు-యుద్ధమునందు పరమపదించినవారి సంతానమును, స్త్రీలను మొదలైన సంబంధీకులను పాలించుట. ఇటుల సమాచరించు పురుషులకు ఎల్లప్పుడు విజయము, ధనము, సుఖము వర్ధిల్లును. [అని విద్వాంసులు ధ్యానముంచవలయును.]

అత్ర గణితవిద్యా రాజ ప్రజా పఠక పాఠక కర్మాదివర్ణనా దేతదధ్యాయోక్తార్థానాం పూర్వాధ్యాయోక్తార్థైః సహ సంగతి రస్తీతి బోధ్యమ్.

ఈ అధ్యాయమునందు గణితవిద్య, రాజ ప్రజలకర్మలు, అధ్యాపకాధ్యేతల కర్మలు వర్ణించ ఱుటచే పూర్వాధ్యాయోక్తార్థములతో నీయధ్యాయోక్తార్థముల సంగతి గలదని గ్రహించవలెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం పరమవిదుషాం శ్రీవిరజానన్దసరస్వతీ స్వామినాం శిష్యేణ శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేణ శ్రీ దయానన్ద సరస్వతీ స్వామినా నిర్మితే సంస్కృతార్యభాషాభ్యాం సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే ఒష్టాదశోఽధ్యాయః

---